పామాలివ్ సౌందర్య రక్షణ

# మీ దేహకాంతికి క్రొత్త శోభనిస్తుంది!

మీ దేహకాంతికి క్రొత్త శోభను చేకూర్చుకో గలరు. పామాలివ్ సౌందర్యరక్షణతో దానిని ఎంతో మృదువుగా, తాజాగా ఉంచుకోండి

మొదటి రోజు నుండే, పామాలివ్ సౌందర్య రక్షణ మీ దేహకాంతికి క్రొత్త శోభను యిస్తుంది. భారత దేశపు అపూర్వమగు సౌందర్య పోషక తైలములు చేరిన పామాలివ్ సబ్బు ఎంతో సౌమ్యమైనది మరియు శుద్ధమైనది. దాని సమృద్ధియగు మీగడ వంటి నురుగు ఎంతో శుభ్రపరచి, మీకు క్రొత్త శోభను చేకూరుస్తుంది. సౌందర్య పోషక తైలములు చేరిన పామాలివ్ సబ్బునే ఎల్లప్పుడూ వాడి చిన్న చిన్న కళంకములు చాల తక్కువగుట, ఎక్కువ మృదుత్వము, మరియు నునుపు, తాజాయైన మరియు నిర్మలమైన చర్మము, ఎక్కువ శోభాయమానమైన అందమగు దేహకాంతి మొదలైన వర్చస్సులో కలిగే అభివృద్ధిని మీరు చూడగలరు!



భారతదేశపు అపూర్వమగు సౌందర్య పోషక తైలములతో తయారైనది!






పూర్తిగా సౌందర్యముగా కనపడుటకు పామాలివ్ సబ్బుతో స్నానము చేయండి!

తెలుగు పత్రికలన్నిటిలోనూ ఆంధ్రసచిత్ర వారపత్రిక సర్క్యులేషన్ అత్యధికమైనది:

## జలుబు, గొంతు నొప్పులనుంచి పూర్తిగా విముక్తి పొందండి.

గొంతు నొప్పిగాని, హఠాత్తుగా జలుబుగాని వస్తే, 'ఆస్ప్రో' వేసుకొని తక్షణం ఉపశమనం పొందండి. మీకు గొంతునొప్పిగావుంటే 'ఆస్ప్రో' కరిగిన వెచ్చని నీళ్లతో పుక్కిలించండి. ప్రపంచంలో లక్షలాది మందికి కుటుంబ ఔషధం 'ఆస్ప్రో' మీ శరీరంలో బాధిత భాగాలమీద నేరుగా పని చేసి, తప్పకుండా ఉపశమనం కలిగిస్తుంది. ఇంటిల్లిపాదికోసమూ 'ఆస్ప్రో'ను దగ్గిరవుంచుకొనండి.

# 'ఆస్ప్రో'

## ఇంటిల్లపాదికీ



"ఆస్ప్రో" పనిచేసే విధం చూడండి







రోజా, తెలుపురంగులుగల సీలువేసిన పట్టీ ప్యాకెట్టు అడగండి

## 'ఆస్ప్రో' తీసుకొనండి

## తిరిగి నిజముగా స్వస్థత పొందండి



నికొలాస్‌వారి N తయారు నాణ్యతకు మరియు శుద్ధతకు మీకు గ్యారంటీ కంది

# ఉత్తరాలు

## ము ఖ చి త్రం

"సినిమా బాలెట్ ఫలితాలు ఎనలేని ఆనందాన్ని కలిగించాయి."

జి. వి. పి. శ్యామసుందరం (మద్రాసు)

* * *

"జాలరిపిల్ల" చిత్రించిన భాస్కర్ ప్రశంసనీయుడు. చిత్రకారుడు చిత్రించిన చిత్రము సజీవముగా ఉన్నది.

పి. నారాయణ (వంగిమళ్ళవారిపల్లె)

* * *

ఈవారం (జాలరిపిల్ల) ముఖచిత్రం చాలా బావుంది.

ఎ. వి. రంగయ్య (గుంతకల్లు)

* * *

సినిమా బాలెట్ ఫలితాల సంచిక ముఖచిత్రం చాలా బాగుంది. పక్కన ఫోటోలు కూడా బాగున్నాయికానీ, ఎస్. రాజేశ్వరరావుగారికి గడ్డం ఉన్నట్లు నల్లగా పడింది నిజంగా గడ్డంతో ఫోటో తీశారా?

సంకురాత్రి శ్రీనివాసరావు (రాజమండ్రి)

**నిజంగా గడ్డంతో తీసిందే.**

## వ్యా స ం

శ్రీ కృష్ణానంద్‌గారి 'టూరింగ్‌టాకీస్' చాలా సరదాగావుంది. అది చదువుతుంటే చిన్నతనంలో నాన్నగారితో వెళ్ళిన టూరింగ్ టాకీస్ జ్ఞాపకమొచ్చింది. జోడెద్దులబండెక్కి మువ్వలధ్వనిలో అమ్మ చేసిచ్చిన చేగోణీలు పొట్లంకట్టుకు పట్టుకెళ్లాం 'కృష్ణలీలలు' సినిమాకి. నాన్నగారు బెంచి అయితే క్రిందపడిపోతామని నేలటిక్కెట్లే కొన్నారు. నేలంతా బీచిలావుంది. మెత్తని ఇసుక, దానిమీద మేం కట్టుకెళ్ళిన చాప వేసుకొని (సొంతసీట్లు) కాళ్ళు చాపుకుని చేగోణీలు తింటూ సినిమాచూస్తే ఎంత బాగుందనుకున్నారు!

అయ్యగారి కనకవల్లి (ఏలూరు)

* * *

శ్రీకృష్ణానంద్‌గారు చెప్పినట్టు టూరింగ్ టాకీసులలో కాకుండా పర్మినెంటు హాళ్ళల్లోకూడా నల్లులు ప్రేక్షకులకు సన్మానాలు చేస్తున్నాయి. అదీకాకుండా ఆట మొదలుపెట్టిన అర్ధగంటవరకూ ఇంటర్‌వల్‌ముందు అర్ధగంటకు కాఫీ, బిస్కట్లగొడవలు, బ్లాకుమార్కెట్టు టిక్కెట్టు కొనుక్కోవలసిన అవసరము టూరింగుటాకీసుకు లేదు.

భట్లపెనుమర్తి శర్మ (విజయవాడ)

## కా ర్టూ న్లు

పద్మవ్యూహంవంటి చక్కని కార్టూన్లు కూడా పొరపాట్లు లేకుండా పంపినా మీ పత్రిక అంగీకరించటంలేదు. అది కేవలం నా దురదృష్టమే అనుకుంటాను!

ఇదివరలో పొరపాట్లతో పంపిన కార్టూన్లు, కథకానికథలు తిరిగి పొరపాట్లు లేకుండా పంపితే, మీ పత్రిక అంగీకరిస్తుందా!

దయవుంచి హాస్యాస్పందంగా మాత్రం జవాబివ్వకండి.

వి. విజయలక్ష్మి (కాకినాడ)

**ముందుగానే చెప్పడం ఎలా?**

## సం దే హ ం

మొన్న మా కాలేజి వార్షికోత్సవాలకు నే నొక నాటికలో ఒక మంచి విద్యార్థిపాత్ర వేశాను. అందులో తెర తియ్యగానే పది సెకెండ్లపాటు పుస్తకం తీసుకొని గట్టిగా చదవ్వల్సివస్తుంది. చదివాను కూడా! మిగతాపాత్రంతాకూడా చాలా బుద్ధిమంతుడిగా నటించాను. అప్పట్నించి నన్ను మా కాలేజిలో స్టూడెంట్సంతా నా అసలుపేరు మానివేసి "చదువుల్రావు" అని పిలవడము మొదలుపెట్టారు. ఇంతకూ నా పేరు చదువుల్రావా! లేక చదువులు రావా? అని సందేహము పట్టుకుంది.

రాజబాబు (విజయనగరము)

**మీకే తెలియాలి.**

* * *

మీ వారపత్రికలో "వనితావాణి" శీర్షికలో ప్రతివారం ముద్రించే కవరుపై ధర్మవరము పోస్టాఫీసుముద్రమాత్రమే వున్నది. మరి ఆఉత్తరంమీకు ఇంతవరకూ చేరలేదా? ఆ ఉత్తరముపై మద్రాసు తపాలాశాఖవారి ముద్రలేదు. లేక మద్రాసు పోస్టాఫీసు ముద్రలేకుండానే మీకు ఉత్తరములు చేరుతాయా?

కవులూరు దశరథరామయ్య, (హైదరాబాద్.)

* * *

పత్రికకు ఎటువంటి కథలు పంపిస్తే ప్రచురిస్తారో జవాబు ఈయవలెను.

జి. ఆర్. కృష్ణ (యలమంచిలి)

**మంచికథలు పంపిస్తే.**

## సరాగమాల

ఈ వారం, రంగారావుగారు 'పియానో'ని ఉపయోగించడంలోగల లోపాల్నిగురించి బాగా చెప్పారు. ఈ పియానోవిక్రమ పద్ధతిలో ఉపయోగించిన సంగీత దర్శకుడు రాజేశ్వరరావుగారే కదా! వారే బాణీకూర్చి, పియానోని చక్కగా ఉపయోగించి, శ్రీశ్రీగారి, "నాహృదయంలో నిదురించే చెలీ.." అనేపాటని, ఘంటసాల వారి కంఠంనుంచి మనకు వినిపించారుకదా! ఇటువంటి మరపురాని మధురగీతాన్నే రచయిత విస్మరించడం విచారకరమైన విషయం!!

"రాం, ధం అండ్ రత్నం—" (పిఠాపురం)

* * *

"సరాగమాల"లో "రాజనందిని" లో "చిక్కావు లేరా చక్కనిరాజా" అన్నపాట అంజలి (జిక్కి) పాడినప్పుడు కీర్తిశేషులు ఆర్. నాగేశ్వరరావు మధ్య మధ్య "సైతస్సల రవల" అంటుంటాడు. ఇంతకాలంనుండి, ఆవాక్యాలను కీ: శే: ఆర్. నాగేశ్వరరావు గారే అన్నా రనుకున్నాను. వి. ఎ .కె. ఆర్. ఆర్. మూలంగా బయట పడింది. శ్రీ వేదాంతం రాఘవయ్యగారి కంఠం అలాంటి మాధుర్యముతో నిండి వుందా! ఆమాటలోని మాధుర్యము యింకా చెవిలో గింగురు మంటోంది. రహస్యము బయటపెట్టినందులకు రచయితగార్కి నాఅభివందనములు.

బోనగిరి రాజారెడ్డి (మంచిర్యాల)

* * *

'మంచిమనసులు' చిత్రంలో హంపి దృశ్యములు జానకికి చూపించుతూ నాగేశ్వరరావు "శిలలపై శిల్పాలు చెక్కినారు" అనుపాట పాడుతాడు. ఆపాటలో సరిగమపదనిస అన్న తరువాత మనము స్వస్థ స్వరాలనుకూడ వింటాము. (స్తంభాలమీద) కాని ఈస్వరములను రికార్డులో వినము.

సి. ఎస్. సురేష్ (గుంటూరు)

* * *

భీష్మలోని లాలిపాట బాలసరస్వతి పాడిన "తెలుగు పాపాయి" (బంగారు పాపాయి — బహుమతులు పొందాలి) అన్నపాట వరసన్నపోలివుంది. కాని దానిసంగీతకర్త రంగారావుగారు వ్రాసినట్లు శ్రీ రాజేశ్వరరావుగారు కాదు. ఆయన సోదరుడు సాలూరి హనుమంతరావుగారు. ఈసవరణ ప్రచురిస్తారనుకుంటా.

జయంతి—సత్యవతి (బర్‌హాంపూర్)

* * *

లావాక్కింతయు లేదు. అనుపద్యమందు (గోపి) చివరకు సంరక్షింపుము భద్రాత్మకా అని వెంటనే ప్రాణేశ్వరీ అంటాడు.

భద్రాత్మకా అనేది సినిమాలో కాని పాటలపుస్తకములో కాని లేదు. ఇది కేవలము రికార్డులప్పు మాత్రమే—

కె. కోటిరెడ్డి (వలివేరు)

* * *

'సరాగమాల' శీర్షికలో రికార్డులుగూర్చి తెల్పుతున్నారు—కాని నాదొక సందేహం—పాతాళభైరవిలో—'ప్రేమకోసమై వలలోపడెనే పాపం పసివాడు' అన్నపాట మధ్యని 'హో.........' అని అన్నవారెవరో.........శ్రీ వి. ఎ. కె. రంగారావుగారు తెల్పుతారని ఆశిస్తున్నాను—పాట పాడిందెవరో ఆమాటన్నదెవరో దయచేసి తెల్పుతారని ఆశిస్తున్నాను.

ఆర్. వేణుగోపాల్ (వమరపల్లి)

* * *

"బాగప్పిరివినై" చిత్రంలోని సంగీత దర్శకుడు కే. వి. మహాదేవన్ అని చెప్పినారు. కాని, "బాగప్పిరివినై"కి సంగీత దర్శకుడు "విశ్వనాథన్—రామమూర్తి" అని గమనించ ప్రార్థన. ఇది రచయిత వి. ఎ. కె. రంగారావు తప్పా, లేక మీ తప్పా!

పి. విజయకుమార్ (చిత్తూరు)

## క థ లు

ఈవారం పత్రికలో ప్రచురించబడిన 'తొలకరి వానలు' చాల బాగుంది.

నిర్మల (గుంటూరు)

★

# ఆంధ్రసచిత్రవార పత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

*

శుక్రవారం : 15-6-62
సంపుటము : 54 సంచిక : 41
శుభ॥ సం॥ జ్యేష్ఠమాసం॥ శు॥ ద్వాదశి
స్థాపితము :
1908

*

ముఖ్య సంపాదకులు :
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

విడిప్రతి : 25 న. పై
సంవత్సర చందా : 13-0-0 రు.

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టివీధి, మద్రాసు-1





'మాయామోహిని'లో రాజశ్రీ

## మనలో మాట

'కాబోయే కథకులకు పనికొచ్చే చిట్కాలు' పంపించటం మొదలు పెట్టాము. ఈ సంచిక పాఠకులకు అందేసరికి శ్రీ ఆరుద్ర పుస్తకాలు కోరిన వారిలో చాలామందికి చేరుతాయి. ఈమధ్య మా కార్యాలయానికి కథలు ఎక్కువగా రావటం లేదు. వేసవివల్లనేమో అనుకున్నాముకాని 'చిట్కాలు' నేర్చుకునేందుకు వేచిఉన్నారనే అనుమానం కలుగుతోంది!

*　　*　　*

"సినిమా బాలెట్" ఫలితాలు ప్రకటించి రెండువారాలు అయినాయి. మాకు వచ్చే ఉత్తరాలను బట్టి మొత్తంమీద ఈ ఫలితాలు సంతృప్తికరంగానే ఉన్నాయని తెలుసుకోగలుగుతున్నాము.

*　　*　　*

శ్రీ బి. వి. సత్యమూర్తిగారి బొమ్మలకథ 'అగ్గిరాముడు' పాఠకులకు జ్ఞాపకం ఉండేఉంటుంది. ఈ వారం ఆయన బొమ్మలకథ ఇంకొకటి మొదలుపెడుతున్నాము. ఈ కథ ముగింపు అనుకోనివిధంగా-కాని ముందే చెప్పి లాభంలేదు! చదివి తెలుసుకోండి....

## లోకంపోకడ



"చౌకరకం కార్లకోసం కనిపెట్టుకుని కూర్చోక సైకిల్ తొక్కటం నేర్చుకునిఉంటే మీకీఇబ్బంది ఉండేదికాదుగదా!"

## విషయానుక్రమణిక


దేశరక్షణ తరవాతే పంజాబీ సుబా
చైనా, పాకిస్తాన్ లకు తారాసింగ్ చెంపపెట్టు.


మళ్లీ అతికించాలే!
కేరళ మిశ్రమ మంత్రివర్గం


నేపాల్ రాజ్యాంగం ముసాయిదా
ఓహో! గాడిద సింహం తోలు కప్పుకుందే
నేపాల్ కు కొత్త రాజ్యాంగం తయారైంది


ఒ ఎ ఎస్. లో చీలిక – వార్త
అల్జీరియా
ఒ.ఎ.ఎస్. సైనిక విభాగం
ఒ.ఎ.ఎస్. పౌర విభాగం



ఈ మధ్య ఢిల్లీలో జరిగిన జాతీయ సమైక్యతా మండలి సమావేశానికి హాజరైన శ్రీయుతులు సంజీవరెడ్డి, వినోదానందఝా, శ్రీ సి. బి. గుప్త మొదలైనవారు సమాలోచనలు జరుపుకున్న దృశ్యం.

# పనిచెయ్యకుండానే అలసిపోయే అమాత్యశేఖరులు; కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల సామరస్యం రహస్యం

**శ్రీ కృష్ణ**

**కాశ్మీర్‌లో** కొద్దిరోజులు విశ్రాంతి తీసుకుని ప్రధానమంత్రి రాజధానికి తిరిగివచ్చారు. ప్రచారం జరిగినంతగా ఆయన ఆరోగ్యం పుంజుకోలేదు. వచ్చిరాగానే పార్లమెంటు కార్యక్రమాలలో పాల్గొన్నారు. ఆయన స్వరం నీరసంగా ఉంది; తెరలు తెరలుగా దగ్గు వచ్చింది. ప్రధానమంత్రి ఇలా ఉంటే, బాబు సత్యనారాయణసిన్హా ఇందుకు పూర్తిగా భిన్నంగా కనిపిస్తారు. సంపూర్ణ ఆరోగ్యవంతు డెవరంటే శ్రీ సిన్హారూపం కళ్లకు కడుతుంది. ఈయన కాంగ్రెసుపార్టీ సచేతక్. పార్లమెంటరీ వ్యవహారాలమంత్రి అని మామూలుగా అంటూ అంటూ ఉంటారు. బాబూజీ ఆరోగ్యానికి ఒక రహస్యం ఉంది. పనిచేస్తున్నవారినిచూచి ఆయన అలసిపోతుంటారు. కీ॥ శే॥ భోలాభాయ్ దేశాయ్ ప్రతిపక్షనాయకుడుగా ఉన్నంతకాలం శ్రీ సిన్హా ఆయనకు దక్షిణహస్తంగా పనిచేశారు. అటుతరువాత సర్దార్ పటేల్‌ను ఆశ్రయించుకు తిరిగారు. సర్దార్ పటేల్ మరణానంతరం కేవలం ప్రధానమంత్రిని పొగడి కాబినెట్ మంత్రిపదవి సంపాదించుకున్నారు. అధికారపక్షం సచేతక్‌గా తమ అసమర్థతను విరూపించుకున్నారు. సభానిర్వహణకు తగినంత మంది సభ్యులను హాజరుపరచటం సచేతక్ ప్రధాన కర్తవ్యం. 1947 ఆగస్టు 15వ తేదినుంచి ఈనాటి వరకు లోకసభలో కాంగ్రెసుపార్టీకి కట్టుకపోయినంత మెజారిటీ ఉన్నా ఎన్నోతడవలు 'కోరం' లేక సమావేశాన్ని వాయిదావేయవలసివచ్చింది. గాంధీజీ కలలుకన్న సమాజవ్యవస్థకు అనుగుణంగా శ్రీ సిన్హా ఇప్పుడు అక్బర్ రోడ్‌లోని ఒక రెండస్థుల సౌధంలో కాలం వెళ్లబుచ్చుతున్నారు.

* * *

రాజ్యాంగాన్ని ఇప్పుడు ఎలా వ్యాఖ్యానించాలి అన్న సమస్య పార్లమెంటుమీద, ముఖ్యంగా అధికారపక్షంమీద ఆధారపడి ఉంది. ఫలానాచోట సంభవించిన కల్లోలాన్ని రాష్ట్రప్రభుత్వం అదుపులోకి తేలేకపోయిందని ఆరోపిస్తూ, ఆసంగతి చర్చకుపెట్టాలని ప్రతిపక్ష సభ్యులు ప్రయత్నించటం, శాంతి భద్రతలను కాపాడవలసిన బాధ్యత రాష్ట్ర ప్రభుత్వాలదే కనుక చర్చించేవీలులేదని దేశీయవ్యవహారాలమంత్రి వాదించటం పరిపాటి అయింది. సభాపతి మంత్రిగారి వాదాన్ని అంగీకరిస్తూ చర్చకు అనుమతించక పోవటంకూడా మామూలుగా జరుగుతున్నది. శాంతిభద్రతల వ్యవహారం రాష్ట్రాలదే కాబట్టి రైళ్ళలో జరిగే నేరాలను అరికట్టవలసిన బాధ్యత రాష్ట్రప్రభుత్వాలమీదనే ఉన్నదని రైల్వేమంత్రి సర్దార్ స్వరణ్‌సింగ్ ఇటీవల పునరుద్ఘాటించడంలో వింతేమీలేదు.

అలాగే విద్య, ఆరోగ్యం, నీటిపారుదల, విద్యుచ్ఛక్తి, వ్యవసాయం, ఆహారం, సమాజాభివృద్ధి మొదలైన విషయాలనుగూర్చికూడా పార్లమెంటు చర్చించే అవకాశం లేదు. 1921లోనే ఈ విషయాలన్నీ రాష్ట్రాలకు బదిలీ అయ్యాయి. కాని ఇక్కడ మంత్రులు తమకు అనుకూలంగాఉన్న సందర్భాలలో రాజ్యాంగాన్ని వర్తిస్తారు. సువిశాలమైన సామ్రాజ్యాన్ని సృష్టించుకుని వందలాది కోట్ల రూపాయలు ఖర్చుచేస్తున్నారు. ప్రభుత్వ ఆదాయంలో దాదాపు సగం రక్షణశాఖ మింగుతోంది. మిగతా సగంలో 50% ఈ రాష్ట్ర విషయాలక్రింద ఖర్చు అవుతోంది.

62—వ పేజీ చూడండి

# రాజ్యా-రత్నాలూ

పెద్దిభొట్ల సుబ్బరామయ్య

“ఇప్పు డెలా ఉన్నానో చెప్పండి” అంటూ దగ్గరికి వచ్చిం దామె.

నవ్వులు చిందే ముఖం, సొట్టలు పడుతున్న బుగ్గలూ .... ఇన్ని హంగులతో శ్రీదేవి కుందనపు బొమ్మలా సుకుమారస్వామి ఎదురుగా నిలబడింది. శంఖంవంటి ఆమె గళసీమను అలంకరించివుంది దీపపుకాంతిలో తళతళలాడుతూ వెలుగులను చిమ్ముతున్న ఒక కంఠహారం .... మరొక రెండు

—54 వ పేజీ చూడండి



# కథ కాని కథ

## గుండుచెంబు

### (మొదటి బహుమతి)

అవి మేము పి. యు. సి. చదివే రోజులు. మా పరీక్షలు పూర్తి అయినవి. మేము నలుగురు స్నేహితులం- సాయి, రాజా, శర్మ నేను-సెలవులలో విశాఖపట్టణం చూడటానికి వెళ్ళాం. మేము యూనివర్శిటీ భవనములు, కింగ్ జార్జి ఆస్పత్రి, కాల్టెక్స కంపెనీ మొదలగునవి చూశాం. ఇంక సింహాచలం వెళ్లాలి. మర్నాడు సింహాచలం వెళ్ళాము. మాలో సాయి దేవుడికి తలనీలాలిచ్చాడు.

ఆ సాయంత్రం మేము స్నానం చేయటానికి బావిదగ్గరకు వెళ్ళాం. నేను నా గుండు చెంబు నిండా నీళ్ళు తీసికొని, ఆ నీళ్ళ చెంబు బావిగట్టున పెట్టి ముఖానికి సబ్బు రుద్దుకున్నాను. మళ్ళీ చెంబు తీసికొనటానికి వంగేటప్పటికి, నున్నగా తగిలింది. నేను కోపంతో, "ఎవడ్రా నా చెంబు బోర్లించిందీ!" అని అరిచాను. కాని నాకు మా స్నేహితుల నవ్వులు వినిపించినవి. నా కోపం ఇంకా పెరిగిపోయింది. అసలు జరిగిందేమిటంటే, మా సాయి సరిగ్గా నేను చెంబుకోసం వంగే సమయానికి, వాడూ వంగి, వాడిచెంబు తీసుకుంటున్నాడు. నా చేతికి తగిలింది వాడి గుండే కాని నా గుండు చెంబు కాదు. గుండు చెంబును చూసినప్పుడల్లా, కడుపుబ్బ నవ్వుతుంటాను.

పన్నాల శ్యామసుందర్ (గుంటూరు)

* * *

## 'గోలకాదు...'

### (రెండవ బహుమతి)

నేనప్పుడు ఫస్టు ఫారం చదువుతున్నాను. మా డ్రాయింగు మాస్టారు పిరియడ్‌లో ఎవరో ఒకరు గోలచేయడం, ఆయన వాళ్ళను బాదడం మా క్లాసు రివాజై పోయింది.

ఈ సంఘటన జరిగిన క్రిందటి రాత్రి నేను మా వాళ్ళతో కలిసి డ్రామాకి వెళ్ళాను. తెల్లవార్లూ నిద్రలేకపోవటంచేత క్లాసులో కునుకుపాట్లు పడుతున్నాను.

ఎలా గడిచాయోగాని రెండు పీరియడ్లూ.. మూడో పిరియడ్లో మా డ్రాయింగు మాస్టారు వచ్చి బ్లాకు బోర్డు మీద ఏదో బొమ్మ వేస్తున్నాడు. అప్పుడు నేను ఈ లోకంలో లేను!

నా ప్రక్కన కూర్చున్న సామ్యూల్ "కూ" అంటూ ఒక పెద్ద పొలికేక వేశాడు. నేను ఉలిక్కిపడి లేచాను. మా మేస్టారు త్రుళ్ళిపడి "ఎవడ్రా వాడు?" అని గర్జించాడు. వెంటనే సామ్యూల్‌గాడు నన్ను వేలెట్టి చూపించాడు. ఆయన గబగబా నా దగ్గరికివచ్చి "ఏరా, గాడిదా! ఎవరో చచ్చినట్లు అలా గొంతు చించుకున్నావ్?" అంటూ నా వీపుమీద 'ధభీ'మని ఒక గ్రుద్దు గుద్దేడు. ఆ దెబ్బతో నా మత్తొదిలిపోయి "నేను అరవలేదు సార్, నిద్ర పోతున్నా!" నని అనేసరికి క్లాసు క్లాసంతా గొల్లుమంది.

జి. వెంకటేశ్వరరావు (విజయవాడ)

* * *

## తీరినకోరిక

### (రెండవ బహుమతి)

పోయిన సంవత్సరం నేను ప్రీ-యూనివర్సిటీ క్లాసు చదువుచున్నప్పుడు మా డివిజన్‌లో చలపతిరావు అనే ఒక కుఱ్ఱవాడుండేవాడు. అతనికి మార్కులు సరిగా వచ్చేవి కావు. కాని తాను డాక్టరు నవ్వాలని బాగా కోర్కె ఉండెడిది. తనకోరిక ఎలాను తీరదని వాడికే తెలుసు. కాని తన నోట్సులన్నింటిలోను "చలపతిరావు ఎం.బి.బి.ఎస్, ఎఫ్.ఆర్.సి.ఎస్" అని పేనాతో పెయింటు చేస్తుండెడివాడు. ఒకరోజున అతను క్లాసులో పాఠం వినకుండా పైన చెప్పినవిధంగా వ్రాస్తుంటే అది గమనించిన మా ఫిజిక్సు లెక్చరర్ గారు బుక్‌తో సహా తనవద్దకు రమ్మన్నారు. పాపం చలపతిరావు బుక్ తీసుకొని వెళ్లాడు. అతను వ్రాసిన విధముచూసి, లెక్చరర్ గారు "ఫర్వాలేదోయ్! నువ్వు సైన్‌బోర్డులు వెయ్యడానికి పనికివస్తావ్" అన్నారు.

[illegible] ★



# ప్రపంచ ప్రముఖులు—2

[వార్తలకు కారకులు వ్యక్తులు. వ్యక్తులను వ్యాఖ్యానిస్తే వార్తలను వ్యాఖ్యానించినట్లే. 'ప్రపంచప్రముఖులు' శీర్షిక ఒకవిధంగా అంతర్జాతీయ రాజకీయాల సమీక్ష అవుతుంది.]

స్టాలిన్ 'పరిపాలన'లో జరిగిన దారుణాలను బయటపెట్టిన నికిటా సర్జెవిచ్ క్రుశ్చేవ్ నేటి రష్యాకి నియంత. కాని ఈయన నిరంకుశాధికారమే స్టాలిన్ సృష్టించిన విధానాలు మార్చడానికి తోడ్పడుతోంది. మాలెంకోవ్, మాలటోవ్, బుల్గానిన్‌ల పతనం 'స్టాలినిస్టుల' నిష్క్రమణకి సూచనఅని నిస్సందేహంగా చెప్పవచ్చు: స్టాలినే అయితే వీరికి మరణదండన విధించేవాడు.

రష్యా ఆంతరంగిక విషయాలలో నియంతగా కనిపించినా విదేశాంగ విధానాలలో మాత్రం క్రుశ్చేవ్ అధికారానికి పరిమితులు అస్పష్టంగానైనా తెలుస్తూ ఉంటాయి. సహజీవనసిద్ధాంతానికి ఒకవైపు చైనా మొదలైన కమ్యూనిస్టుదేశాలు అడ్డుపడుతున్నట్టు తోస్తుంది. జర్మనీసమస్య విషయంలో క్రుశ్చేవ్‌కి అతని సహచరులకి అంగీకారం కుదరటంలేదని 'రష్యా నిపుణులు' కొందరు చెబుతున్నారు. అమెరికాతో చేసుకునే ఒప్పందాలకు జర్మనీ లోబడి ఉండదేమోననే భయమే రష్యాలో ఆయుధాల ఉత్పత్తి ఎక్కువచేసే నిర్ణయం వెనుక కనికనిపిస్తోందని ఈ నిపుణులు చెబుతున్నారు.

క్రుశ్చేవ్ చిరంజీవికాదు; ఆయన ఆరోగ్యం ఈమధ్య అంత బాగాఉండటం లేదని వింటాం. అందుకనే క్రుశ్చేవ్‌కు ఎంత విలువఇస్తే సహజీవనానికి, పశ్చిమయూరోప్ సమస్యల పరిష్కారానికి అంత మంచిదనే వ్యాఖ్యలో చాలా నిజం ఉన్నదనిపిస్తుంది.

క్రుశ్చేవ్ ఇంచుమించు 20 ఏళ్ళ వరకు చదువుకోలేదు. కాని నేడు రష్యాకు సంబంధించినంతవరకైనా ఈయనకు తెలియని విషయాలు చాలా తక్కువని అంటారు. ఐక్యరాజ్యసమితిలో చెప్పుపట్టుకుని బల్లమీద కొట్టడం; సమావేశాలలో మోటుగా మాట్లాడటం; ఇవన్నీ క్రుశ్చేవ్ 'వ్యక్తిత్వం' ఎంత క్లిష్టమైనదో సూచిస్తాయి. ★

# హరివంశము

హారీత శివశర్మ

## సాందీపని పర్వం-62

పౌండ్రకుడు తనమందిరములకు చేరుకొనెనే గాని, అక్కడ నిమిషముపాటుగూడ నిల్వలేదు. నిల్వక తన మంత్రాలోచనామందిరములకు బయలుదేరి వెడలినాడు. అచ్చట వాచాలుడును, చారులును అప్పటికే కూర్చుండియుండినారు. ఆ చారులు అలసియున్నారు. వారి యొడళ్లు ధూళిచేత దూసరములై యున్నవి. వారు దీర్ఘప్రయాణమేదో చేసి వచ్చినట్లున్నారు. శ్రమచేత వారి శరీరములు విశ్రాంతిని కోరుచున్నట్లు లున్నవి. వారి ముఖములలో వారి మనోభావములు రంగముమీద నటకులవలె సర్వసాత్త్వికభావాభిరామముగా కదలులాడుచున్నవి. రాజు తమకు చెప్పిన కార్యమును సాధింపలేకపోయితిమే యన్న అగడుపాటుతోపాటు, ఏదియో అద్భుతమును చూచివచ్చుటచేత కల్గు విచిత్ర సాత్త్వికభావము వారి సర్వశరీరములందును గోచరించుచున్నది. రాజు రాగా వారు లేచి నిలుచుండిరి. వాచాలుడేదియో అనబోయెనుగాని, పౌండ్రకుని ముఖమును, కన్నులను, శిరశ్చాలనమును చూచి కంఠములోని మాటను కంఠములోననే దిగ్రమింగెను. చారు లెవ్వరును మాటాడలేదు. పౌండ్రకుడు వారిని మాటాడనీయలేదు. వారివంక అదియొక విధముగా చూచి, అవహేళనా విధ్నముగ సకృదసకృద్హాసముల చేత, కార్యహానివేళాజనితనై రాశ్యనూచి దక్షిణహస్తచాలనవిశేషములచేత, ఇంతగా ఆలోచనలు చేసి తలపెట్టిన కార్య మిట్టులైనదన్న వైక్లబ్యముతోడి అవుడుకరచుటచేత, ఓష్ఠములను 'వ్చ్' కారములతో విరచుటచేత, వారియందు తనకు కల్గిన అభిప్రాయమును వ్యక్తముచేయుచు, మందిరమునందు అవిరళపాదచారముగా తిరుగాడెను. వారి నేమియో అనవలయునని ఆతని ఊహ.

త అనుటకు మాటలు దొరుకక, ఆ దొరుకకపోవుటవలనకల్గిన విచిత్రభావముగా నాతడు మందిరమునందంతటను తిరుగాడెను. తన ఈచారులు సామాన్యులుగారు. సర్వసమర్థులు. వారు ఇట్లు వ్యర్థులయివచ్చిరనగా, తాను వారికి చెప్పిన కార్యము, తాను అనుకొనినంత తేలిక కాదనిన భావ మిప్పు డాతనికి కల్గినట్టులున్నది. అతని ముఖము ప్రశాంతమైనది. ఆతనిలో ఉగ్రభావము శమించినది. అతడు విచిత్రముగ వాచాలుని దిక్కు చూచెను. చూచి గల్లున నవ్వెను. నవ్వి ఇట్టులనెను:

"వాచాలా! ఇంతయు నీకోసము చేసితిని."

"అవును! అవును" అన్నాడు వాచాలుడు.

చారులలో యొక్కడు విచిత్రముగ నవ్వెను. పౌండ్రకు డప్పుడు వారిదిక్కు చూచెను. అది అందరిని ఒక్కసారిగా, ఒక్కొక్కరిని ఒక్కొక సారిగా చూచుటగా నుండెను.

"ఎవరురా! ఆ నవ్విన వారు!"

ఎవ్వరును మాటాడలేదు. పౌండ్రకుడు మరల యడిగెను. మరల యెవ్వరును మాటాడలేదు. పౌండ్రకునకు నవ్వు వచ్చెను.

"ఆ నవ్వినవాడెవడో నాకు తెలియును. ఎందుకు నవ్వినది గూడతెలియును. వాచాలుడా! నేను ఇంత పని నీకై చేసితిననగా వీరు నమ్ముటలేదు. ఓరి! మాతలి! ఈవలకు రమ్మురా!"

మాతలి ఆ చారులలో ఒకడు. వాడు రథకారవృత్తివాడు. సూతుడు. రథములను తోలుటయందే గాక, చారవిద్యయందుగూడ వా డారితేరెను. వానికి పెద్ద వయస్సు లేదు. పౌండ్రకుని వయస్సువాడు. పౌండ్రకుని సారథి. వానిని పౌండ్రకుడు ప్రేమించును. అనగా అమితముగా గౌరవించును. ఎందుచేతననగా, పౌండ్రకునకు వాడు ఒకవిధముగా మంత్రివంటివాడు. నిజమునకు సూతుడైన ప్రతివాడును మంత్రియే. మంత్రితో సమానమే. మాతలి మరియును. పౌండ్రకునకు ఆతడన్న గౌరవము. మరియు భయము. భయము ఏలననగా, పౌండ్రకుడేమి యాలోచించునో, ఎట్లు ఆలోచించునో, అది వానికి తెలియును. అందువలన వాడు నవ్వగా, పౌండ్రకునకు కోపము వచ్చినది. కోపము రాలేదు. ఆతడు ఆతనిని సంబోధించి పిలచెను. మాతలి ముందునకు వచ్చెను. 'ఏమి! మహారాజా!" అనెను.

పౌండ్రకు డాతనిని తీక్ష్ణముగజూచి, "ఏల నవ్వితివిరా?" అనెను.

"మహారాజా! చెప్పమందురా?" అనినాడు మాతలి.

అందరును నవ్వుటయో, మాటలాడుటయో చేతురు. ఆ రెండు కార్యములు యుగపత్తుగా జరుగుట యుండదు. మరియు మాటాడుటయే నవ్వుటగా యుండదు. మాతలి మాటాడుటయే నవ్వుటగా నుండెను. వాడు మాటలనే నవ్వెను. పౌండ్రకునకు అతని ఆ వాలకమును చూడగా కోపము పోయినట్లయినది. అతనికిని నవ్వు వచ్చినది. నవ్వినాడు. సాయంసూర్యుని కిరణములు మంథరములై చెట్లయాకులపై బడి, ఆ ఆకులలో సందుచేసుకొని దుసికింతలు పోయినట్లున్నది ఆతని ఆనవ్వు. అందరును ఊర్పు తీసుకొనినారు. కార్యము చెడినదని మహారాజునకు కోపము రాలేదనుకొన్నారు. పౌండ్రకుడును, వారి మనోలక్షణములను కనిపెట్టి మాతలితో తిరిగి ఇట్టులనినాడు:

"మాతలి! ఏమియో చెప్పుదునంటివికదా!"

"మహారాజా! తమరు చెప్పుము అనిన చెప్పుదును."

"సరియే! చెప్పుము."

"తరువాత నన్ను మాట అనరాదు"

—59వ పేజీ చూడండి



విజయవారి 'గుండమ్మకథ'లో యన్. టి. రామారావు.

చిత్రసమీక్ష

# కథాగమనంలో కొత్తదనంగల 'గుండమ్మకథ'

శ్రీకాకుళం తరం వచ్చేకా, "పేరులోనేగలదు పెన్నిధి నమ్మ" అనేది ఒక హిట్మంత్రంగా సినీ జానపద 'జాలం'లో చెలామణీ అవుతున్నది. వెనుకటికి 'మిస్సమ్మ' కథను విజయవంతంగా ప్రదర్శించిన విజయావారు 'గుండమ్మకథ'ను ఇప్పుడు విడుదల చేస్తున్నారు. సాంఘిక పక్షంగా తీసిన ఈ ఆకర్షణీయమైన నామకరణంగల చిత్రంలో పేరుకు తగ్గట్లు అనగా బహుళార్థక—సార్థకనామకరణాను గుణంగా గుండమ్మపాత్రకు నిర్మాతలు అత్యంత ప్రాధాన్యత ఇచ్చారు. ఆ పాత్రకు ప్రాణప్రతిష్ఠ చేసిన శ్రీమతి సూర్యకాంతం కూడా ఆద్యంతం ప్రేక్షకుల సానుభూతిని పెంచుకొనేలా నటించింది. ఈ చిత్రంలో ఇంకా నాగేశ్వరరావు, జమున, సావిత్రి, రామారావు, రంగారావు, ఛాయాదేవి, రమణారెడ్డి, విజయలక్ష్మి, హరనాథ్, రాజనాల, హేమలతాదేవి మున్నగువారు నటించారు. వెనుక విజయావారి చిత్రమైన చంద్రహారం చిత్రాన్ని డైరెక్టు చేసిన శ్రీ కె. కామేశ్వరరావు ఈ చిత్రానికి దర్శకత్వం వహించారు. శ్రీ చక్రపాణి కథ సమకూర్చగా, శ్రీ నరసరాజు మాటలు, శ్రీ పింగళి పాటలు రాశారు. శ్రీ ఘంటసాల పాటలకు బాణీలు ఇచ్చారు. వాటిలో కొన్ని ప్రేక్షకులకు సుపరిచితంగా స్ఫురించుతూ, సరళంగా సాగిపోయాయి.

అనగా అనగా గుండమ్మకు ఒక "మారుటి కూతురు", ఒక సొంత కూతురూ, మాతృభక్తి ఏ కోశానాలేని ఓ కొడుకు ఉంటారు. ఆమె సవతి సోదరుడు కంచు గంటయ్య గుండమ్మ కన్నకూతురు సరోజను, జైల్లో ఉండటానికి అలవాటుపడ్డ తన కన్న కొడుక్కు చేసుకోవాలనే సదుద్దేశంతో, ఆ పిల్లకువచ్చే సంబంధాలు చెడగొడుతూ ఉంటాడు. ఐతే రామభద్రయ్య అనే ఇద్దరు కొడుకుల తండ్రి ఈ గుండమ్మగారి స్వర్గస్థుడైన భర్తమీదగల విశ్వాసంతో తన ఇద్దరు పుత్ర రత్నాలను "కుట్ర" పన్ని, గుండమ్మగారి కూతుళ్లను పెళ్ళి చేసుకోమని పంపుతాడు. ఇల్లరికం తెచ్చుకుందామనుకున్న గుండమ్మ చిత్తంలోని "పాత్ర" లందరి కుట్రలకు గురియై, చివరికి, కోడలి మేనత్త (ఛాయాదేవి)తో సాలలేక, నిరాశపడిపోతుంది. ఐతే ఈలోగా కొన్ని నాటకాలు, పాటలూ ఫార్సులూ ఆడటం పూర్తి చేసుకున్న రెండు తరుణ జంటలూ (కూతుళ్లూ—అల్లుళ్లూ) తిరిగివచ్చి గుండమ్మగారి కోడలి మేనత్తను, కంచు గంటయ్య కొడుకునూ తన్ని, తగిలేసి గుండమ్మతోసహా రామభద్రయ్యగారి ఇంటికి చేరుకుని కథను సుఖాంతంగా ముగిస్తారు.

గయ్యాళిగా, ఆదిని పరిచయమైన 'గుండమ్మ'లో చిత్రమంతటా కూడా కేవలం స్త్రీ సహజమైన చపలతా, వెర్రి అహంకారం, మమకారం, చెప్పుడు మాటలు వినే నైజం, బేలతనం మొదలైనవి అగుపిస్తాయేతప్ప, వెనుకటి చిత్రాల్లో శ్రీమతి సూర్యకాంతం ధరించిన రాక్షస లక్షణాలు ఈ పాత్రకు లేవు. ప్రేక్షకులకు ఆద్యంతమూ ఈ పాత్రపట్ల సానుభూతి కలుగుతుంది. పోతే గుండమ్మ సవతిబిడ్డ లక్ష్మిని సరిగ్గా చూడదనే నెపం, ఆ పిల్లతప్ప అందరూ గుండమ్మ కన్నకొడుకుతోసహా వేయడం కేవలం నీలాపనిందగా తోస్తుంది. ఇతివృత్తాన్ని మల్చుకోడంలో రెండు మూడు బలమైన మలుపులు తిప్పి, ప్రతి సీనులోను (పామర) జనరంజకమైన మాటలూ, సన్నివేశాలూ కూర్చి 15 వేల అడుగుల ఈ చిత్రాన్ని చాలావరకూ సరదాగా ప్రేక్షకులు చూడగలిగేటట్లు నిర్మించటంలో నిర్మాతలు కృతకృత్యులయ్యారు.

చిత్రంలో ఏ మూల, ఏ కోణంలో హాస్యం దాక్కున్నాసరే, దానిని ఉవతలికి ఈడ్చి, తెర కెక్కించడంలో అందరూ (నటీ నట సాంకేతిక బృందమంతా) పూర్తి ప్రయత్నం చేశారు. 'గుండమ్మ'గారి "మొగుడు" సినిమా ప్రారంభించుతూ వుండే సరికే గోడని చిత్రపటమై వ్రేలాడుతూ ఉంటాడు. కాని, ఒక దశలో క్లైమాక్సులో ఎందుకో తెలీదు మరి! అచ్చం సిం ఎస్. ఆర్. లాగ ఆ బొమ్మ "నా ఖర్మ అన్నట్లు నెత్తిన చెయ్యి తాటించుకుంటుంది. విజయలక్ష్మి చేసిన నృత్యం ఒకటేఐనా, ప్రేక్షకులను బాగా ఆకర్షించగలదు.

ఈ చిత్రం విజయావారి బ్రహ్మాండమైన 'కథా' చిత్ర తోరణంలో మరో మణిపూస.

—కృష్ణానంద్.

# సినిమా వార్తలు

## సమాచార చిత్రాల అభివృద్ధి

భారత ప్రభుత్వ చలన చిత్రాలశాఖ సాలీనా తయారయ్యే సమాచార చిత్రాలసంఖ్యను 100 నుంచి 120 కి పెంచదలుచుకుంది.

గ్రామీణ ప్రాంతాల స్థితిగతులను ప్రజలకు తెలియజేయటంకు ఈ ఏడు ఎక్కువ ప్రాముఖ్యం ఇవ్వటం జరుగుతుందని తెలుస్తున్నది. ఇందులో కొన్ని చిత్రాలు, ప్రజలు సామాజిక కార్యకలాపాల్లో ఎలా పాల్గొంటున్నదీ, వారి రాజకీయ పరిజ్ఞానం ఎంత అభివృద్ధైంది చూపిస్తాయట.

ఇవిగాక, ప్రభుత్వ చలన చిత్రాలశాఖ మూడవ ప్రణాళికాకాలంలో రేఖా చిత్రాలతో సాలీనా నాలుగు స్వల్పకాల చిత్రా(షార్ట్స్)లు తయారు చేస్తారట.

మార్చి 1962 తో అంతమయ్యే సంవత్సర కాలంలో ప్రభుత్వ చలన చిత్రశాఖ 96 సమాచార



అంజలీపిక్చర్సు 'స్వర్ణమంజరి'లో మత్స్యకన్య జయంతి.

చిత్రాలు తయారు చేసింది. ఇందులో 80 నలుపు తెలుపు చిత్రాలు, 16 వర్ణ చిత్రాలు. ఇవికాక 52 సంక్షిప్త వార్తా చిత్రాలు, 12 మ్యాగజైన్ చిత్రాలు తయారయ్యాయి. (అన్ని వార్తా చిత్రాల్లోను వున్న కొన్ని ముఖ్య ఘట్టాలను ఏర్చి కూర్చినవి మ్యాగజెన్‌లు.)

ఈశాఖ "ది వాలీ ఆఫ్ గాడ్స్" అనే సినిమా స్కోప్ (ఈస్ట్‌మన్) వర్ణ సమాచార చిత్రం కూడా నిర్మించింది.

## ప్రదర్శనశాలల మూసివేత

ప్రదర్శనశాలల యజమానులు ఇప్పటివరకూ ఇస్తున్న టిక్కెట్ల పుస్తకాలను ప్రభుత్వానికి అప్పజెప్పి, అధికారముద్రతో తయారైన టిక్కెట్టు పుస్తకాలను తీసుకొని అమ్మవలసిందిగా వాణిజ్య సుంకాధికారులు కన్నతూర్, వాలాజాబాద్ పంచాయతీ ప్రాంతాల్లోని చలన చిత్ర ప్రదర్శనశాలల యజమానులకు తాఖీదులు పంపారు. తత్ఫలితంగా ఆ రెండు ప్రాంతాల ప్రదర్శనశాలలను యజమానులు 1 వ తేదినుంచి మూసివేశారట. మద్రాసు ప్రభుత్వం, వినోదపు పన్నులపై సర్‌ఛార్జీ విధిస్తూ, చేసిన చట్టం ఫలితమే ఇది.

## ఇంగ్లీషుచిత్రాల తయారీ

భారతదేశంలో ఆంగ్ల చిత్రాలు నిర్మించేందుకు ప్రముఖ భారతీయనటుడు ఐ. యస్. జోహార్ ప్రయత్నిస్తున్నాడు.

ప్రస్తుతం లారెన్సు ఆఫ్ అరేబియాలో నటిస్తున్న ఈ నటుడు త్వరలో, సంగీతం లేకండా 8 వేల అడుగుల్లో "బాచులర్ బ్రైడ్స్ ఆఫ్ బాంబే" అనే చిత్రాన్ని నిర్మిస్తాడట.

## ప్రభాత్ స్టూడియోలో కథాచిత్రాలు

కేంద్ర ప్రభుత్వం, చలనచిత్ర సాంకేతిక శిక్షణా కేంద్రంగా ఏర్పాటు చేసిన ప్రభా (పూనా) స్టూడియోలో కథాచిత్రాలు తయారవబోతున్నాయి)

మహారాష్ట్ర చలనచిత్ర సహకార సంస్థ తయారు చేస్తున్న కథా చిత్రానికి 'రంగాభ్యరాత్రీషియా' ఈ చిత్రం మహారాష్ట్ర సంగీత, నాటకాల కాలపు మంచి రోజులు చూపిస్తుందిట.

రణజీత్‌దేశాయ్ రచించిన సంగీత రూపకం ఆధారంగా తయారయ్యే ఈ చిత్రంలో సాహుని మోడక్, అరుణ్‌సార్నిక్, వసంత్‌షిందే, మినూ ముంతాజ్ పాల్గొంటున్నారు. దర్శకుడు: రాజా ఠాకూర్, ఛాయ: యం. యం. కరాకర్.

## విశేషణాలపై మక్కువ

మన తెలుగు చిత్రాలకు పెట్టే నామవాచకపు పేర్లే అర్థంకాక తన్నుకుంటున్నాం. ఆ పేరెందుకు పెట్టారో చిత్రం అయ్యేదాకా (అయింతర్వాత కూడా) తెలీదు. కానీ, హాలీవుడ్‌లో విశేషణాలపైన మక్కువ జాస్తిట. నిర్మాత జోపాస్టర్ నాక్ నిర్మించే చిత్రంలో ఈ విశేషణాలఘాటు విశేషంట. ఆతని మొదటి చిత్రం త్రీ స్మార్ట్‌గర్ల్‌స్ (ముగ్గురు చలాకీ పిల్లలు) తరువాత విశేషణాలతో వచ్చిన చిత్రాల్లో నైస్‌గర్ల్ (అతిమంచి అమ్మడు), త్రీ డేరింగ్ డాటర్స్ (ముగ్గురు సాహస పుత్రికలు) ది కిస్సింగ్ బాండెట్ (ముద్దాడేదొంగ) లాంటివి కొన్ని. —ఈ సూత్రం ఇంకా తెలుగు వాళ్ళకు అబ్బినట్టు లేదు.

# విదేశీ చిత్రరంగం

## పత్రికలలోని చిత్రకథలు ఆధారంగా చిత్రం

సాధారణంగా వార్తాపత్రికలలో కనిపించే చిత్ర కథ లాధారంగా ఆంద్రీ హనెబెల్లి "మిస్టరీస్ ఆఫ్ పారిస్" అన్న చిత్రం నిర్మిస్తున్నాడు.

49 —వ పేజీ చూడండి

# సరాగమాల

వి. ఎ. కె. రంగారావు

విజయవాడనుంచి తంగెళ్ల పాండురంగశర్మగారు వ్రాసిన ఉత్తరానికి జవాబు.

ఎటువంటి రికార్డులనుతీస్తే, శ్రోతలకు వినసొంపుగా ఉంటుందో 'సరాగమాల'లో వ్రాయటం లేదుకాని, ఆ యా కంపెనీల రికార్డింగ్ శాఖాధిపతులతో యెప్పటికప్పుడు చెవినిల్లుకట్టుకొని పోరి మరీ చెప్పుతున్నాను. కాని, వినేదెవరు? కొనేదెవరు మీరు చెప్పినటువంటి 'క్లాస్' పాటలను రికార్డు చేస్తే అని పైగా అడుగుతారు ఆ అధిపతులు. ఇందులో కొంతవరకు నిజంలేకపోలేదుగాని, ఆనిజం చేసే నిష్కారాన్ని ఆ అధిపతులు, కొంతవరకు కొనే ప్రజలు, భరించాలి.

ఎందుకంటారా? ఇందుకు. సినిమా రికార్డులు కాక, విడి రికార్డులు కొనేది చాల తక్కువమంది. ఈ కొద్దిమందిలోను, పెళ్లిళ్లలోను, పార్టీలలోను, బహిరంగ సభల పూర్వాపరభాగములందున ఏంప్లిఫైయర్లద్వారా చెవులు బద్దలుచేసే "లౌడ్ స్పీకర్ల" రాయళ్లే ఎక్కువ. వీరికి నచ్చేవి ప్రతి పదములోను అశ్లీల ద్వంద్వార్థముండే అవక తవక హాస్య గీతాలు.

మూడువారాలక్రిందట కాకినాడలో ఎవరిపెళ్లికో వెళ్తే ఇటువంటి రికార్డే గర్భాదాన ముహూర్తమట వేశారు. ఎలాంటిచోటూ, ఆడా, మగా యెడా, పెడా కూర్చునివున్నచోట. పెద్దలంతా ముఖాలు మాడ్చుకున్నారు. ఆడవాళ్ల ముఖాలు కందగడ్డలయినవి. కొడిముూక గాడిద అరుపులు అరిచారు. నాకు చెప్పలేని యేహ్యభావం కలిగింది. అంత జుగుప్సాకరమైన హాస్యం, హాస్యంకాదది, మురికికాలువనుంచి బయట కీడ్వబడిన మాలిన్యం, నే నెక్కడా వినలేదు, కనలేదు, చదవలేదు.

ఇటువంటి పాటలగురించి అడుగుతే ఆ అధినేతలు, పేరుగల పాటకుల పాటలకన్నా నాలుగింతలు ఇటువంటివే అమ్ముడుపోతున్నాయని సమాధానమిచ్చారు. నిజమే కావచ్చు. బట్టలు విప్పుకొని, నడిబజారులో నాట్యమాడితే, నాలుగు వందలమంది పోగవ్వచ్చు. అంతమాత్రాన అలాగ చేయటం బుద్ధిమంతుల లక్షణంకాదు. అదీ సద్వ్యాపార దక్షతనీ అనిపించుకోదు. ఈ పాటలు రావటానికి కొంత కారణం వీటిపై 'సెన్సారు' లేకపోవటం. కొంత కారణం సందువున్నదికదా అని చెత్త పాటలు చేరిగిస్తున్నవారి బుద్ధిమాంద్యం. మిగిలిన కారణం చెత్తను యేరి, కోరి కొనుకుంటున్నవారి మనోవికారం.

కామిక్ పాటలు ఉండాలి. ఉండకూడదు అని మడి కట్టుకోడం భావ్యంకాదు. కాని, హాస్యం అంటే అశ్లీలత అని యెందుకు అర్థం చెప్పుకోవాలి? పాతిక ముప్ఫయేళ్లక్రిందట వచ్చిన కామిక్ పాటలు, డాక్టర్ సి. హెచ్. వి. వెంకటాచలం పాడిన "నా కాలమునాడు", "ఏరాజు వేసినాడో ఈ మల్లెపూల తోట", "చిక్కితిని నీ చేతిలోనే బావా"లాంటివి ఈ నాటికీ ఎంత సరదాగా ఉంటాయి! అటువంటివి విడుదలచేస్తే ఎవరు కాదంటారు? కాదనగలరు? తదుపరి వచ్చినవికూడ అంటే పిఠాపురం పాడిన 'నవ్వుట', దేవరపాడిన "అనకాపల్లి సినిమా చిత్రాలు" బాగానే ఉంటాయి. బూతుపదమనేది ఉండదు. ఎటొచ్చీ గత మూడు నాలుగేళ్లనుంచి వస్తున్న రికార్డుల నైతిక ప్రమాణమే నానాటికీ దిగజారుతూ వచ్చి, నేటికి మురుగుకాల్వలో మునిగింది.

ఇంతకన్నా ఘోరమైనది పుణ్యపురుషులమీద, పురాణస్త్రీలమీద వస్తున్న "పేరడీ" రికార్డులు. మచ్చుకుపేర్లు: "సిగినల్ చింతామణి", "కలికాల హరిశ్చంద్ర", 'డూప్లికేట్ రతీమన్మథ', "మాడర్న్ మండోదరి", "గలాటా సావిత్రి." పొద్దల్లా ఈ పాటలు వింటున్న చిన్నవాళ్లకు ఆ పావనమూర్తులంటే ఏమి గౌరవం మిగులుతుంది?

మంచి రికార్డులు విడుదలకావాలంటే, అవి అమ్ముడుపోవాలంటే, ఇటువంటి చవకబారును మార్కెటులోంచి తీసివెయ్యాలి. తీర్పరులైన రచయితల సాహిత్యాన్ని, నేర్పరులైన సంగీతకారులచే వరవలు కట్టించి, ప్రవీణులైన గాయకులచే పాడించాలి. ఎందుకు అమ్ముడుపోవు? తప్పకుండా ఢంకా వాయించి మరీ అమ్ముడు పోతాయి.

పై సూచన చేసిన పాఠకులే మరొక సలహా నిచ్చారు. పది పదిహేనేళ్లక్రితం చేస్తున్నట్టు, పేరున్న కళాకారులతో తులాభారం, లీలలు మొదలైన డ్రామా సెట్లు ఇస్తే బాగుంటుందని. అలాంటి సెట్లు రాకపోవడానికి కొన్ని కారణాలు వున్నవి. మొదటిది, ముఖ్యమైనది ఖరీదు. అటువంటి సెట్లకు కనీసం ఆరు రికార్డులైనా ఉండాలి. అంటే $4.65 \times 6 = 27.90$. దాదాపు ముప్ఫయిరూపాయలు. సాధారణ ప్రజలకు అందుబాటులోవున్న మొత్తంకాదది. సెట్లు ఉధృతంగా వస్తున్న రోజుల్లో ఆరు రికార్డులది పదిరూపాయలు, మహావుంటే పదిహేను ఉండేది. (అకాలంలో రైల్వేస్టేషన్లలో కూడ అమ్మేవారని గుర్తు.) రెండవ కారణం ఈనాటి శ్రోతలు వినే పాటల్లో, కొనే రికార్డులలో వైవిధ్యం కోరుతున్నారు. ఆరు రికార్డుల సెట్టు వినాలంటే సుమారు నలభై నిమిషాలు పడుతుంది. అంతసేపు తీరికగా గ్రామఫోనుని అంటిపెట్టుకు కూర్చొని ఓపికగా వినేవారెందరు ఈ రోజుల్లో!? కొద్ది గమనం హెచ్చించి, రెండు రికార్డులతోనే పరిపెట్టు కుందామంటే ఈమధ్యనే వచ్చిన కొ...... 'లవకుశ'లాగ తయారవుతుంది. విన్నారా! పద్యాలకు పద్యాలు, మాటలకు మాటలు, విడిగా వింటానికి బాగానే ఉన్నాయి. కాని, కలిపివింటే ఒకటే వడి, గొడవ. ఆ దూకుడులో మాధవపెద్ది కంఠం శ్రీనివాస్‌లాగ, శ్రీనివాస్‌ది జానకిలాగ, జానకి కంఠం పిట్టకూతలాగ, తక్కినవారిది వట్టిమోతలాగ వినిపించింది.

మూడవ కారణం. ఇది సినిమాలయుగం. పాటకాలమీద మోజుతగ్గింది. ప్రజాదరణపొందిన సినిమాలలో పాటలుకూర్చి సెట్లుగా విడుదలచేస్తే కొంతయినా కొంటున్నారు. ఏడాదిక్రితం "శాంతినివాసం" సెట్టు వచ్చింది. ఇటువంటి అనుకరణ సంగీత చిత్రాలసెట్లు వచ్చినా వాటికి లభించే ఆదరణ అంతంతమాత్రమే. "విప్రనారాయణ", "మల్లీశ్వరి"వంటి ఉత్తమ చిత్రాలని సెట్లు విడుదలచేస్తే ఈ నాటికైనా ఆపురావురుమని కొనేవాళ్ళంటారు. కాని యింత నిశితంగా ఆలోచించే అవసరం ఆ అధిపతులకు కనబడటంలేదు. ఎందుకు కనబడుతుంది, యాంత్రికంగా నొక్కేస్తున్న చచ్చురికార్డులన్నీ అమ్ముడు పోతుంటే?

* * *

బందరు కె. మార్కండేయ శాస్త్రిగారికి చిన్న మాట. ఒకరికార్డుకి యెడాపెడా రెండు పాటలుంటాయి. రెండుభాగాల పాటయితే తప్ప. నేను వ్రాసిన నాటికి "గుండమ్మకథ"లోని మూడు రికార్డులే విడుదలైనవి. మీరు వ్రాసినవి వాటిలోనివే. త్వరలోనే మరొకటి విడుదలకానున్నది.

* * *

కొందరు పఠితలు లిఖితా ముఖతా ఈవందేహాన్ని వెలిబుచ్చారు. నేను ప్రతిపాటనూ విశేష విశేషణాలతో పొగుడుతున్నానట. ఇందువలన వారికి మానసికముగా రెండు సంశయములు కలిగినవట. నావుద్దేశములో అన్నీ మంచి పాటలేనా అన్నది ఒకటి, చెడ్డపాటలు లేనేలేవా అన్నది రెండవది.

"సరాగమాల" కోసం ప్రత్యేకించబడిన స్థలం పరిమితం. ఈ పరిస్థితిలో మంచి పాటల గురించి వ్రాసి ఆ స్థలాన్ని సద్వినియోగం చేయాలికాని, చెత్తవాటిని సమీక్షించి యిటు వ్రాసే నాకు, మధ్య చదివే మీకు, అటు ఎవరిగురించి వ్రాసేనో వారికి శిరోవేదనకు కారకుడిని అవటం యేమంత సమంజసం? సమీక్షించే రికార్డులలో సాధ్యమైనంతవరకు రెండు ప్రక్కలా మంచి పాటలే వున్నవే యేరవాలికి ప్రయత్నిస్తున్నాను. అందువలన

—53వ పేజీ చూడండి




## జరిగిన కథ

ఐదు వాటాల లోగిలియిల్లుగలావిడ వరదమ్మగారు మనుమడు సూర్యానికి తల్లీతండ్రీ తానే అయి పెంచింది. శంకరం గారు హెడ్క్లర్కుగావున్న కంపెనీలో చేరిన సూర్యానికి ఆయనంటే గురి. ఆ ఐదు వాటాల లోగిలిలో రకరకాల కుటుంబాలున్నాయి. అందులో సాంబశివంలలితాంబా వాళ్ళ రాజ్యలక్ష్మికి వరదమ్మగారంటే చనువూ, భక్తీ. ఆపిల్లకి సూర్యం బావంటే సిగ్గూ నిర్మలంటే స్నేహం. సాంబశివం గారికి గతం గాయం. సూర్యానికి నిర్మలంటే సానుభూతి. అదివరకు తెలియని మేనమామ జయరావు రాక, పరిచయం సూర్యానికి గతమంటే భయాందోళనలను కలిగిస్తుంది. నిర్మలకి ట్యుటోరియల్ కాలేజీలో అవమానం జరుగుతుంది. నిర్మలకి పాఠాలు చెబుతూంటాడు సూర్యం. జానికమ్మకి సూర్యమంటే ఆసక్తి కలిగింది. సూర్యం ఆఫీసులో 'రీటా' అనే పిల్ల టైపిస్టుగా చేరింది.

## 26

"ఒరేయి సూర్యం! సూర్యం!" అని ఆకోసంచి గొంతు చించుకుని పిలిచేడు జగన్నాధం.

"అరె! జగూ! .... సారీ .... పరధ్యానంలో ఉన్నా ...." నంటూ, తన పాతమిత్రుణ్ణి పలకరించి చేతులు కలిపేడు సూర్యం.

"పెళ్ళి చేసుకో ...." మన్నాడు జగన్నాధం వెంటనే.

"ఏడిశావులే! నీకు పిల్లలుకూడా ఉన్నారా ఏం? నీ వాలకం అలాగే ఉంది ...." సూర్యం

46-వ పేజీ చూడండి





అయ్యా మేమొక పెద్ద సమస్యలో ఇరుక్కున్నాం ఆ సమస్య పరిష్కరించగలిగిన వారికి అర్ధనూట పదహార్లిచ్చేదమని ఇందుమూలంగా తెలియజేస్తున్నాం
జరిగిన ప్రమాద క్రమం చెప్తాడిదిగో నా కుర్రాడే




పల్లెటూళ్లో ఉద్యోగమయి మా శంకరం ఇంట్లో జరిగేను
నాకే ఊళ్లో ఉద్యోగం అవుతుందనుకున్నా, మీలాంటివాడు ఇదే సమయానికి పుట్టించి కెళ్ళడం నిజంగా నా అదృష్టం అనుకో లేకపోతే ఈ పల్లెటూళ్లో ఉండడానికి గతి ఎవడిస్తాడు.
పల్లెటూళ్లో ఉద్యోగం దొరకడం అదృష్టమే అనుకో, ఐనా నాలాంటి ప్రేమ్యుడికి ఇది జైలనుకో ఓయ్ ఎంతోగాని పెరుగు తాగా...




ఓయ్ ఆరోగ్యం బాగుంటుంది, పిప్పున్నాం ఫైన్ బ్రీజ్. సంతోషించాం.. ప్రకృతి సౌందర్య
ఫుల్
ఓయ్ మరి
ప్రకృతి




ఈ ప్రకృతి. ఓయ్ హూ ఆర్ యు. వాట్ గాళ్
ఎవరోయ్




ముద్దుబుగ్గ రమ్మాయి కాని. అలా చూస్తే ముక్కాలి రగడన్నే జాగ్రత్త




చూస్తేనే ఏంతారేమిటి?
అదే వద్దన్నది అసలు చూడమన్న దెవరంట?




## అల్లుళ్ళూ - అలుకలూ

మామగార్లను పీక్కుతినే అల్లుళ్ళనుగురించే చెప్పేరు. కాని కొందరు మామగార్లకు అల్లుడికి పండగలకు బహుమానాలివ్వడం దేముడెరుగు, కనీసం సంవత్సరానికి ఒక మంచి సూటుపెట్టాలన్నధ్యాసే ఉండదు. మరి వారి మాటేమిటి? ఈ రోజులలో అలిగే అల్లుళ్ళు చాలా అరుదు. మామగారి ఎదురుగా భార్యను కొట్టేవాళ్ళు ఉన్నారంటే చాలా ఆశ్చర్యకరమైన విషయం. వ్యాసంఅంతా అల్లుళ్ళ మీదనే సాగింది. బీదవాళ్ళు స్తోమతులేనివాళ్ళు పెట్టేలేదంటే బాగానేవుందికాని,స్తోమతుఉండికూడా అల్లుడి ముద్దుముచ్చట్లు తీర్చని మామగార్ల మాటేమిటి? అటువంటి మామలూ ఉన్నారు. అనవసరంగా చీటికిమాటికి అలిగే అల్లుళ్ళు కూడా ఉన్నారు.

యస్. ఇందిరాదాస్ (విజయనగరం)

*    *    *

మా బంధువుల అమ్మాయి పెళ్ళిఅయింది. ఆ అల్లుడికి గొంతెమ్మకోరికలు ఎక్కువ. మూడు నిద్దర్లకి వచ్చాడు; సైకిలుకావాలి అని అడిగాడు. ఆ మామగారు బాధ ఏమి చెప్పను! కొత్త అల్లుడు ఎవరైనా ఆ బాధను గుర్తించాలి. అందులో వాళ్ళు మధ్యతరగతి కుటుంబీకులు. కొంతమంది అల్లుళ్ళు అలకలు తీర్చలేక మామలు బాధపడుతున్నారు.

యస్. జయలక్ష్మి, (తెనాలి)

*    *    *

విజయగారు వ్రాసిన అల్లుళ్ళు—అలుకలూ అను వ్యాసము చక్కగాఉంది. ఆవిడ అనుభవంమీద నిజంగా వ్రాసారు అనుకుంటున్నాను. ఈకాలంలో అల్లుళ్ళు చాలమట్టుకు వారు వ్రాసిన ప్రకారంగానే ఉంటారు. మామగారు సరదాగా ఇచ్చిన వస్తువులకు సంతోషించక, తృప్తిలేక ఇంకా, ఇది కావాలి, అవి కావాలి అంటే మామ మాత్రం ఎంత అని పెట్టకలడు. పెళ్ళికోసమే చాల డబ్బు అయిపోతుంది. అల్లుళ్ళు అలకలు తీర్చడం కోసం కూడ చాలా డబ్బు ఖర్చు పెడితే, మిగిలిన పిల్లల గతి ఏంకాను?

సి. విద్యావతి (రాయచోటి)

*    *    *

పాతకాలపు పద్ధతిలో అలిగే అల్లుళ్ళు, అత్తమామలను అలసటపెట్టే అల్లుళ్ళు ఉన్నారనవచ్చును. కాని, అంతా అటువంటి వారే ఉంటారంటే అతిశయోక్తి కాదనుకుంటాము. ఒక్కొక్కమారు అల్లుళ్ళు ప్రవర్తించే విపరీతమైన, అక్రమమైన విధానాలకు అత్త మామ కారణమయ్యే సందర్భాలు కూడా మనము చూస్తూఉంటాము. కొందరు అల్లుడిమీద ఎంత అధికారం సంపాదించుతారంటే పెండ్లికాకపూర్వము ప్రేమతో చూచుకొనేవాని తలిదండ్రులను, సోదర సోదరీమణులను పరమ శత్రువులుగా చూచుకొనేటట్లు చేసేవారు కూడా ఉన్నారంటే పాఠకులు నమ్ముతారనుకుంటాము.

టి. శైలజ, గిరిజ (రాజమండ్రి)

*    *    *

ప్రతి ఇంటిఅల్లుండూ అలా ఉండరు. మంచి వారు కూడా ఉంటారు. అల్లుళ్ళను దశమగ్రహముగా పోల్చారు అని వ్రాయుట బాగులేదు. మా ఇంటి సమాచారం తీసుకోండి. మాకు ఇద్దరు అల్లుళ్ళు ఉన్నారు. (మా అడబిడ్డల భర్తలు) వారిని చూస్తే విజయగారు వ్రాసిన వ్యాసం తప్పనిపిస్తుంది. కారణం మా అల్లుళ్ళు ఇంటికివస్తే సంతోషముతో ఉంటారు. ఏదీ కావలయునని కోరరు. అందరు అల్లుళ్ళు చెడ్డవారుకారని శ్రీమతి విజయాగారు తెలుసుకొనవలయునని కోరుచున్నాను.

శ్రీమతి జూలుగంటి కస్తూరిరాజా (తిరుపతి)

*    *    *

"అల్లుళ్ళూ—అలుకలపై" 'విజయ'గారి వ్యాసం చదివాను. కాని, కొన్నిచోట్ల అసందర్భంగావుంది. విశ్వాసమైనది కుక్క, విశ్వాసహీనమైనది అల్లుడు" అనడం అంత సమంజసంగాలేదేమో! మరి అంతగా న్యూనత పరచడం భావ్యంకాదు" "నవగ్రహాలు కాకుండ దశమగ్రహం అల్లుడు" అంటారు పెద్దలు. నిజమే. కాని, నేను చూస్తున్న కుటుంబాన్ని చూస్తే "నవరత్నాలు కాకుండ అల్లుడు మరొక రత్నమనవచ్చుననిపిస్తుంది.

"అలుక పాన్పు" నేర్పరచింది మామ రక్తాన్ని పీల్చడానికికాదన్న సత్యాన్ని అల్లుడు గుర్తిస్తే మామ మేరు పర్వతాన్నెక్కగలడు. ఈకాలపు అల్లుడు మామస్థితి నెరిగి ప్రవర్తించగల నేరిమి—కూరిమీ కలవాడు. ఈ కాలపు సంస్కారమలాంటిది. కాని, ఈ సంస్కార నాగరికతలను సరిగా అర్థంచేసికొని ఆచరింపగలిగిన అల్లుని పొందడం అదృష్టం! అల్లుని అలుకలకూ, కోర్కెలకూ మధ్య నలిగిపోయే తండ్రినిచూసి, మగువ మనశ్శాంతిని కోల్పోగలదు. కాని, నిజం ఆలోచిస్తే స్త్రీకి ఆ 'నలత'లోనే ఓ విధమైన తీయని విచిత్రానుభూతి కల్గుతుంది జీవితములో. అసలు ఆడవారు అల్లుని అలుకలలో నలుగకతప్పదుకదామరి. అల్లుని అలుకలను విమర్శించడం తప్పుకాకపోయినా ఎందుకో ఆ వ్యాసం చదువుతుంటే శోచనీయమనిపిస్తుంది.

కుమారి పి. సుమతి (కూచిపూడి)

*    *    *

అల్లుళ్ళయిన వారి కోరికలకూ, అలుకలకూ కాస్త అంతూ, పొంతూ ఉండాలి.

శ్రీమతి అన్నపూర్ణా రంగయ్య (గుంతకల్లు)

*    *    *

'విజయ'గారు అల్లుళ్ళను దశమగ్రహముతో పోల్చడము, అందులోనూ ఒక మగవాడు తన అల్లుడు గ్రహం బ్రతికినంతకాలము పీక్కుతింటుందని అన్నాడని వ్రాయడము చాలా అన్యాయముగా తోస్తోంది. అలా అన్నవాడుమాత్రం తన మామగారిని గ్రహంలా పీక్కుతినలేదా?

తర్వాత 'విజయ'గారు అన్నట్లు అన్నిటికన్నా విశ్వాసమైనది 'కుక్క' కావచ్చునుగాని, అందరికన్నా విశ్వాసహీనుడు అల్లుడు మాత్రముకాదని మనవి చేయుచున్నాను. ఒక 'అత్తగారు' మాత్రము ఎందుకు కాకూడదు?

'ఎంతటి వంకర కర్రఅయినా పిల్లనిచ్చేసరికి నిటారుగా నిలుచుంటుంది' అని అత్తవారు అనుకోవడము మామూలేకాని, అలా ప్రవర్తించకపోతే (అంటే 'బెట్టు' చేయడమన్నమాట') 'ఎంత సిగ్గుమాలినవాడమ్మా' అని వారే ఆడిపోసుకోవడమో, లేకపోతే అల్లుడు చనువుగా ఉన్నాడుకదా అని, వాడిచేత అడ్డమైన పనులు చేయించుకోవడమో జరుగుతుంది.

'స్త్రీ స్వాతంత్ర్యము, స్త్రీ జనోద్ధరణ, వరకట్న నిషేధము మొదలగు చట్టములు అమలులో గల నేటి సంఘములో అల్లుళ్ళు అలిగే చిన్న చిన్న విషయములపై ఎంతమంది స్త్రీల హృదయాలు దెబ్బ తింటున్నాయో' అని, 'విజయ'గారు విచారమును వెలిబుచ్చారు. కాని, పై చట్టములన్నీ కావాలని పోరాడటం చేతనైన ఈ 'వనితలు' వాటివల్ల

సహాయము పొందగలిగేవారు స్త్రీలే అని తెలిసినప్పుడు వారి వివాహవిషయములలో ఎందుకు చొరవ చూపరో తెలవడములేదు. అల్లుళ్లకు కట్నాలిచ్చే బదులు, వారి అలుకలను తీర్చేబదులూ, ఆ డబ్బుతో వారు (అనగా 'వనితలు') శుభ్రముగా చదువుకోవచ్చుగా! ఈ విషయాలను పాఠకులు ఆలోచించగలరు.

ఏమైనప్పటికీ 'విజయ'గారు వ్రాసిన వ్యాసము చదవడానికి సొంపుగా ఉంది. "నాకు కథలు, వ్యాసాలు వ్రాసే అనుభవం బొత్తిగా లేద"ని వూరుకోక, ఇప్పటివలె, ఇకముందు కూడా 'విజయ'గారు చక్కని వ్యాసాలు వ్రాస్తారని ఆశిస్తున్నాను.

'ప్రపుల్ల' (విజయవాడ)

* * *

బాబూ! అన్యాయం! అయినా వాళ్లనని ఏం ప్రయోజనం చెప్పండి. కలికాలం. ప్రతిదానికీ మగవాళ్లని, అందులో కుర్రవాళ్ళని దుయ్యపట్టటం "వనితాలోకం"కో సరదా అయిపోయింది. "విజయ" గారు పొరపాట్లు పడటం తగ్గించుకుంటే మంచిది.

అల్లుళ్ళు అలుగుతారంటే అది వాళ్ల తప్పుకాదు. ఆచారంపేరిట పెద్దవాళ్ళు చేస్తున్న అన్యాయం. "ఒరే నాయనా, పెళ్లిలో రిస్టువాచీ, పండక్కు రేడియో........ఇమ్మని మీ మామదగ్గర అలగరా" అని చెప్పే తలితండ్రులు ఎందరులేరు? వాళ్లే మళ్లీ అల్లుళ్లకివ్వటానికి ఏడుస్తారు! ముందు ఇటువంటి అలవాట్లు తప్పితేతప్ప, "నిత్యకల్యాణం పచ్చతోరణం" అసంభవం.

అంకు (విశాఖపట్నం)



# వంటలు

## అడ

### కావలసిన వస్తువులు

| | | | |
|---|---|---|---|
| పచ్చిబియ్యం | — | ½ | అర్ధాకు |
| కందిపప్పు | — | ¼ | అర్ధాకు |
| సెనగ పప్పు | — | ¼ | అర్ధాకు |
| ఉప్పు | — | 1½ | చెంచాలు |
| పచ్చిమిరపకాయలు | 4 | లేక | 5 |
| కర్వేపాకు | — | | కొన్ని రెమ్మలు |
| ఇంగువ | — | | చిటికెడు |

బియ్యం, పప్పులు నీటిలో పోసి, సుమారు నాలుగు గంటలసేపు నాననివ్వాలి. అటుతరువాత నీరు ఒంచేసి మిగతా వస్తువులన్నీ కలిపి నీళ్ళు చిలకరిస్తూ మెత్తగా రుబ్బుకోవాలి. పెనం కుంపటిమీద పెట్టి నూనెవేసి పిండి పోసుకోవాలి. పిండి మరీ పల్చగా ఉండదు కాబట్టి దోసె మాదిరిగా కాక, కాస్త మందంగా వస్తుంది. ఒకవైపు ఎర్రగా కాలినతరువాత రెండోవైపు కాల్చాలి. పెనంమీద పిండిపోసి చదును చేశాక మధ్యలో కంత చేసి నూనెవేస్తే మరికాస్త చమురు పీల్చి అడ చాలా రుచిగా ఉంటుంది.



ఎప్పుడూ ఇంతే

శంకర్

ఈ కాయల్లో తేడా ముదురూ ఎలా తెలుస్తుందండత్తయ్యా?

వాటినడుగమ్మా - తేపొతే అలాగే వండు కడుపు నొప్పివస్తే ముదురన్నమాట

# అద్భుతము!




## గృహములకు – హోటళ్లకు

# బ్రూక్ బాండ్

# స్పెషల్ హోటల్ బ్లెండ్

డస్ట్ టీ

- ఒక్కొక్క ప్యాకెట్టు ఎక్కువ కప్పుల టీ ఇచ్చును
- ఏమాత్రము తడి తగలని ప్యాకింగువలన సంపూర్ణ స్వచ్ఛత ధృవపడుచున్నది.
- అతిలాది గృహములను ఆనందింపజేయుచున్నది.

**3 సైజులలో లభించును**

500 గ్రాములు, 100 గ్రాములు,
50 గ్రాములు

JWT BB 389

# కట్నాల వేలంపాట

పద్మ

ఆనాడు నేను, మా అమ్మ కొత్తగా బదిలీ అయి మావూరు వచ్చేరని తెలిసి టూ దూరపు చుట్టాలింటికి వెళ్ళేం. ఏదో పెద్ద అభిమానం ఉండను కొనేరు—అట్టే అదేం లేదు. వాళ్ళింట్లో పెళ్ళికెదిగిన ముగ్గురు (మగ) పిల్లలు ఉన్నారని తెలిసి. కొత్తగ వెళ్ళినరోజునే పెళ్ళివిషయాలు మాట్లాడడం మర్యాదకాదని మా అమ్మ ఆవిడ (పిల్లలతల్లి)తో మిగతా విషయాలు చాలా మాట్లాడుతూ కూచుంది. నే నలా చెవు లప్పగించి వింటున్నాను.

ఉన్నట్టుండి ఆవిడే అంది, "చూడు మీనాక్షీ నా ముగ్గురిపిల్లలకి పెళ్ళి చేసేద్దాం అనుకుంటున్నాను ఈ ఏడు. ఇన్నాళ్ళూ అంటే వాళ్ళ ఏదో ప్రమోషను, చదువు అవి అడ్డువచ్చేరుగాని, ఈ మారుమాత్రం ఎలాగో అలాగ ఒప్పించేను పెళ్ళికి. నీ ఎరికిన ఎవరైనా ఆడపిల్లలుగలవారుంటే కొంచెం చెప్పు మా అబ్బాయిల సంగతి" అని ఆవిడ చెప్తుండగానే మా అమ్మ చేటంతమొహం చేసుకొని, మా శశినే వాళ్ళు చేసుకుంటారని లోన గాబరాపడిపోయి, పైకిమాత్రం "ఓ అలాగేనండి" మీ రోమారు మా ఇంటికి రండి" అంటూ మనఃస్ఫూర్తిగా ఆహ్వానించి ఇంటిముఖం పట్టింది.

త్రోవల్లా మా అమ్మ మా చెల్లాయిపెళ్ళి నిశ్చయమైపోయినట్టే అనుకొని, పెళ్ళికి కావలసిన సామానంతా ఏకబిగిని వర్ణించింది. ఆవిడ చెప్పిన దానికి పైకిమాత్రం "ఓ" అనేసినా, మా అమ్మ ఆవిడ చెప్పిన సంగతిమాత్రం ఎవరికీ చెప్పలేదు (ఆఖరికి ఆడపిల్లలు లేనివారికి కూడా).

కారణం నేను వేరే చెప్పక్కరలే దనుకుంటా. ఎందుకంటే ప్రస్తుత పరిస్థితులలో పెళ్ళికొడుకులు దొరకడం, కట్నాలిచ్చినాసరే ఎంత కష్టమో అందరికీ తెలిసినదే. కట్నాలాట్టే అక్కరలేదంటూ లాంఛనాలన్నీ యథావిధిగా జరపాలని మా అమ్మ మరోమారు వాళ్ళింటికి వెళ్ళినప్పుడు చెప్పిం దావిడ చావుకబురు చల్లగా అన్నట్టు. ఆవిడ మాటలవల్ల, ఆవిడ ఆశలు చాలా పెద్దవిగా కనిపించేయ్. మా చెల్లెలి (శశి) మాట ఎత్తేసరికి "అలాగే మీనాక్షీ ఏ సంగతీ తరవాత చెప్తాలే" అంటూ ఆప్యాయంగా చెప్పిం దావిడ మూడొంతులు నిశ్చయమే అన్నట్టు ధ్వనింప చేస్తూ.

పై సంగతి జరిగిన కొద్దిరోజులకే ఆవిడ అందరికీ (అంటే మా బంధువులకే సుమండీ) ఇలాగే చెప్తున్నట్టు తెలిసింది. అందరూ ఆశతో ఆవిడ ఇంటికి ఒకమారు కోమారు వెళ్తుండడం లేనిపోని అభిమానం చూపించడం ఆవిడకి చాలా గర్వకారణం అయింది. అదీగాక, వచ్చినవారందరితో ఆవిడ "ఫలానావాళ్ళు ఇంత కట్నం ఇస్తానంటున్నారు లాంఛనాలు మినహాయించి, ఫలానావాళ్ళు ఇంత....' అంటూ అందరితో చెప్పడం ఆరంభించింది.

దీనినిబట్టిచూస్తే మీకేం అనిపిస్తున్నది? ఆవిడ ఒకవ్యాపారంపెట్టినట్టు లేదూ?? దీనిని వ్యాపారం అనేకంటే "వేలం" అంటే సరిగ్గా సరిపోతుంది కదూ??? ఏమంటారు? ఇలా అందరితో ఒక కాంపిటీషను (పోటీ) పెట్టి మెల్లిగా కట్నకానుకల రేటు పెంచడానికి చూస్తున్న ఆవిడ తెలివితేటలకు అభినందించాలో, లేక మధ్యతరగతి కుటుంబాలను దృష్టిలో పెట్టుకోకుండా ఇలాటి తెలివిమాలిన పనులు చెయ్య తలబూనినందుకు విచారించాలో తెలీడంలేదు.

ఇలాటి పనులను నిషేధిస్తూ ప్రభుత్వం చేసిన చట్టాలు కాగితాలు దండగకే అని అనిపించటంలో ఏమీ ఆశ్చర్యంలేదు. పూర్వంకన్నా మనలో (ఆడవాళ్లలో) చదువు, విజ్ఞానం, సంస్కారం(కొంత) హెచ్చినా, మనం ఇంకా నేర్చుకోవలసినది చాలా ఉందనే విషయం ఇలాటి సంఘటనలే ఋజువు చేస్తాయి. ఎందుకంటే, కట్నకానుకలకి మనం ఆశపడ్డంత మగవారు ఆశపడరని మనకే తెలుసు. కాదంటేమాత్రం అవుతుందా?

వ్యాపారంలా ఉన్న ఈ కట్నాలు అలా ఉండకుండా ఆఖరికి వేలంపాటలా తయారైతే మరి మధ్యతరగతి కుటుంబాల సంగతి ఏమికావాలి.? ★



## తెలుగు పత్రికలన్నిటిలోనూ ఆంధ్రసచిత్ర వారపత్రిక సర్క్యులేషన్ అత్యధికమైనది!

# మనము - మన దేహస్థితి

డా॥ గాలి బాలసుందరరావు

## జీవకణ కార్యక్రమము: విద్యుచ్ఛక్తి

జీవకణంపైపొర విచక్షణశక్తితో కూడిన అర్ధవ్యాపన శక్తిగల పొర అని ఇదివరకే తెలుసుకున్నాము. కొన్ని లవణములు నీటిలో కరిగి ద్రావణములయినప్పుడు, 'అయాను' లనే విద్యుద్వాహకములయిన రేణువులుగా మారుతవనీ తెలుసుకున్నాము. ఇప్పుడు విద్యుచ్ఛక్తితో జీవకణంలో జరిగే కార్యక్రమమును గురించి తెలుసుకుందాము. శరీరంలో జరిగే కార్యకలాపమంతా ఈ రసాయనికమైన విద్యుచ్ఛక్తివల్లనే జరుగుతున్నది. మన వంటిమీద ఈగ ప్రాలినప్పుడు స్పర్శేంద్రియం ద్వారా ఆ వార్త మెదడుకు చేరుతుంది. ఈ వార్త మెదడుకు నరములద్వారా చేరుతుంది. నరములలో ఈ వార్త పోవడానికి విద్యుచ్ఛక్తే కారణం. శరీరంలో జీవకణము లన్నింటిలోకీ, కండరములూ, గ్రంథులూ, నరములూ అతిముఖ్యములయినవి. అందులో కార్యములన్నీ విద్యుచ్ఛక్తివల్లనే జరుగుతున్నవి. జీవకణంలో ఈ విద్యుచ్ఛక్తి ఉత్పత్తి కానినాడు శరీరకార్యక్రమము సాగదు.

ఈ విద్యుచ్ఛక్తి ఎల్లా పుడుతుందో తెలుసుకోవాలంటే కొన్ని వైజ్ఞానిక రహస్యములు తెలుసుకోవాలి.

మనం ఆహారంలో ఉపయోగించే ఉప్పు ఒక సోడియం అణువూ, ఒక క్లోరిన్ అణువూ చేరి ఏర్పడ్డది. దానిని ఇంగ్లీషులో సోడియంక్లోరైడ్ అంటారు. సోడియంక్లోరైడ్ ఒక లవణము. అది నీటిలో కరగంగానే, సోడియం అయానులుగానూ క్లోరిన్ అయానులుగానూ మారిపోతుంది. సోడియంఅయాను పాజిటివ్ ఛార్జి కలది. క్లోరిన్ అయాను నెగెటివ్ ఛార్జి కలది. "బలభేదము" ఉన్న రెండు సోడియంక్లోరైడ్ ద్రావణముల మధ్య ఒక అర్ధవ్యాపనశక్తిగల పొర ఉన్నదనుకోండి. అప్పుడు నీరు మాత్రమే ఒక ప్రక్కనుంచి మరొకప్రక్కకు రెంటిమధ్యా బలసామ్యము ఏర్పడేదాకా ప్రవహిస్తుంది. కాని, పొరకు ఒకప్రక్క పాజిటివ్ అయానులు అధికంగానూ, రెండవప్రక్క నెగెటివ్ అయానులు అధికంగా ఉన్నవనుకోండి. అప్పుడు ఆ ద్రావణములమధ్య విద్యుద్రీత్యా స్వస్థత ఉండదు. పాజిటివ్ అయానులు అధికంగా ఉన్నవైపుకు నెగెటివ్ అయానులు ఆకర్షించబడి ఆవైపుకు పోతవి. ఈమధ్యలో ఉన్న పొర ఒకవైపు పాజిటివ్ పోలుగానూ, రెండవవైపు నెగెటివ్ పోలుగానూ మారిపోతుంది. అంటే దాని పార్శ్వములు బేటరీపోలులలాగా ప్రవర్తిస్తవి. అటువంటి పొరను, మెంబ్రేన్ పొటెంషియల్ అంటారు. ఈ విధంగా ఒక పొర, మెంబ్రేన్ పొటెన్షియల్‌గా పనిచేయాలంటే దానికి ఇరువైపులా ఉన్న అయానుల విద్యుద్వైఖరిలోనూ, సంఖ్యలోనూ వ్యత్యాసం ఉండాలి. అంటే పాజిటివ్ అయానుల సంఖ్యగాని నెగెటివ్ అయానుల సంఖ్యగానీ సమంగా ఉంటే కరెంటు ఏర్పడదు. అంటే శక్తిభేదం ఏర్పడదు. ఈ భేదం అనేక రకములుగా ఏర్పడవచ్చును. పైన చూపించిన చిత్రములో ఒకే రకమయిన లవణము అయనీకరించిందికాని ఆ ద్రావణములలో బలభేదము ఉన్న అనేక లవణములు ఉంటే 'ఏనయానుల' సంఖ్య, కేటయానుల సంఖ్య వ్యత్యాసంగా ఉండవచ్చును. లేక పొర యొక్క విచక్షణశక్తిలో భేదం ఏర్పడ్డప్పుడు పొరలో ఉన్న రంధ్రములలోనుంచి పాజిటివ్ అయానులు పోగలిగి నెగెటివ్ అయానులు పోలేనప్పుడూ, నెగెటివ్ అయానులు పోయి పాజిటివ్ అయానులు పోలేనప్పుడూ, పొరకు ఇరుప్రక్కల ఉన్న అయానుల విద్యుత్ స్వభావమూ, సంఖ్యా కూడా మారుతూవుండి, విద్యుచ్ఛక్తి నిత్యమూ ఒకప్రక్కనుండి మరొకప్రక్కకు ప్రవహించడం జరుగుతూనే ఉంటుంది. జీవకణంలో గుజ్జుగానీ, జీవకణములు తేలుతూవుండే టిష్యూ ఫ్లూయిడ్‌గానీ ఒకే లవణముతో ఒకే బలంగల ద్రావణంతో ఏర్పడివుండవు. అందులో అయనీకరించబడిన అనేక వస్తువులూ అనేక బలభేదములలో ద్రావణీకరించబడి ఉంటవి. ఇంతేకాదు. జీవకణ కార్యక్రమము సాగుతున్నకొద్దీ జీవకణం పొరకు ఇరువైపులా ఉండే అయానుల విద్యుత్ స్వభావమూ అయానుల సంఖ్యా అనుక్షణమూ మారుతూనే ఉంటవి. అయానుల సంఖ్యలోనూ వాటి సైజులోనూ ఉండే వ్యత్యాసమే పొరలోనుంచి వాటి రాకడ పోకడలలో భేదం కలిగిస్తుంది. ఈ అయానులలో కొన్నింటికి నీటితో సంపర్కం కలగగానే కొన్ని రసాయనికవికృతులు పొంది, నూతన కణములుగా మారిపోయే గుణం ఉంటుంది. నీటిసంపర్కంలేని ఒక అయాను పొరలోనుంచి దాటిపోగలిగినా, నీటితో కలిసి ఏర్పడిన కొత్త అయాను దాటిపోలేక పోవచ్చు. ఈవిధంగా కూడా పొరకు అటూ ఇటూ ఉన్న అయానులమధ్య విద్యుద్రీత్యా భేదం ఏర్పడుతూనే ఉండవచ్చు.

జీవకణం పైపొరలో వెలుపలివైపు ఒక పొర లోపలివైపు ఒకపొర ఉంటుందని ఇదివరకే తెలుసుకున్నాము. సాధారణంగా జీవకణం పొరలలో లోపలివైపుది నెగెటివ్‌ఛార్జికలదై ఉంటుంది. వెలుపలివైపు పొర పాజిటివ్‌ఛార్జి కలదై ఉంటుంది. ఈ రెంటిమధ్య ఏర్పడిన 'శక్తిభేదం' (Potential Difference) జీవకణం పొరలో ఉండే రంధ్రములద్వారా వివిధములయిన అయానులు, లోపలికి రావడానికి లోపలిప్రక్కనుంచి బయటికి పోవడానికీ వాటి అంతర్గమన బహిర్గమన వేగమునూ, పరిమాణమునూ నిర్ణయించడానికీ హేతువౌతుంది. ఒక్కొక్కప్పుడు ఈ భేదంవల్ల కొన్ని అయానులు అధికంగా జీవకణంలోకి పోవచ్చు. మరికొన్ని సమయాలలో లోపలికిపోకుండా అటకాయించబడవచ్చును. జీవకణం సజీవమై తనకార్యక్రమమును సాగిస్తున్న సమయంలో ఒక్కొక్కప్పుడు జీవకణంపొర లోపలిప్రక్క పాజిటివ్ ఛార్జి యేర్పడవచ్చు. బయటప్రక్క నెగెటివ్ ఛార్జి ఏర్పడవచ్చు. మరికొన్ని సమయాలలో క్షణలేశంలో ఏ ఛార్జీ లేకుండా విద్యుద్రీత్యా తటస్థవైఖరి కూడా ఆ పొర అవలంబించి తన ప్రసార శక్తిని అధికమో, అల్పమో చేసుకోవచ్చును. అంటే జీవకణంపొరకు విద్యుద్రీత్యా మూడు స్థితులు ఉండవచ్చును. (1) పాజిటివ్ స్థితి, (2) నెగెటివ్ స్థితి (3) తటస్థస్థితి. జీవకణంలోపల ఏనయానులు అధికంగా ఉంటే టిష్యూఫ్లూయిడ్‌లో కేటయానులు అధికం అవుతవి. జీవకణంలో కేటయానులు అధికం అయితే టిష్యూ ఫ్లూయిడ్‌లో ఏనయానులు అధికమవుతవి; ఇల్లాగే టిష్యూ ఫ్లూయిడ్‌లో ఏనయానులు అధికంగా ఉంటే, దానిలోకి ద్రవపదార్థమును విడిచే కేపిలరీలలో కేటయానులు అధికం అవుతవి. అంతేకాదు. కేపిలరీ కొనలలో ఒకటి వెయినుతోనూ ఒకటి ఆర్టెరీతోనూ కలిసి ఉంటుందికదా. టిష్యూ ఫ్లూయిడ్‌ల కొన్ని వస్తువులు కేపిలరీ వెయినుకొనలోకి పోతవి. మరికొన్ని ఆర్టెరీ కొననుండి టిష్యూఫ్లూయిడ్‌లోకి వస్తవి. మరికొన్ని వస్తువులు లింఫు నాళములలోకి పోతవి. ఏసందర్భంలోనూ ఏవస్తువూ ఆర్టెరీ కొనలోకిపోదు. ఈ అతినిగూఢమయిన సంక్లిష్ట కార్యక్రమమంతా శరీరంలో సన్నిహితములయిన జీవకణంలోవున్న అయానుల సంఖ్యమీదా వాటి స్వభావంమీద ఆధారపడి ఉంటుంది. ఆసంఖ్య స్వభావం కేపిలరీనుంచివచ్చే ఆహారపదార్థములమీద, ఆక్సిజనుమీద, ఆధారపడిఉంటవి. ఆ ఆహారపదార్థములూ, ఆక్సిజనూ మనం తీసుకునే ఆహారంమీదా పీల్చేగాలిమీదా ఆధారపడి ఉంటవి. ఈ కార్యక్రమం అంతా అనేక అంగోపాంగములలోవుండే అసంఖ్యాక జీవకణములలో జరిగే విద్యుద్రసాయనిక వికృతుల మీద ఆధారపడి ఉంటుంది.

విద్యుచ్ఛక్తి ప్రవహించే 'కండక్టరు' చుట్టూ ఒక అయస్కాంతమండలం ఏర్పడుతుందని ఇదివరకే తెలుసుకున్నాము. సూదంటురాయిని ఇనపమేకుదగ్గరకు తెస్తే ఆమేకు ఒకకొన సన్నిహితమైన సూదంటురాయి కొనను అంటుకుంటుంది.

—44వ పేజీ చూడండి

# చదువుల్రావు


సత్యమూర్తి


అరెరెరెరెరె చదువుల్రావు
రైలు పట్టాలమీద తలపెట్టి
ఆత్మహత్య చేసుకుంటున్నాడే
ఏటి? పరీక్ష లో ఫేలయ్యాడా?!


మన కాలేజీకి ఫస్ట్‌క్లాస్‌లో పాసయ్యాడురా
మరి ఎందుకు ఆత్మహత్య చేసుకుంటున్నాడా?


ఏరా బాబూ ఫస్ట్‌క్లాస్‌లో పాసయ్యావు కదా
ఆత్మహత్య చేసుకోవడం ఎందుకు?


యూనివర్సిటీ మొత్తం
మీద ఫస్ట్ క్లాస్ రాకపో
యేకా ఇంకా నా బతు
కెందుకు?


సరే బాగానే ఉంది ఇంత ఆత్మహత్య చేసు
కుని చచ్చిపోవాల
నుకున్నప్పుడు
తినడానికెప్పుడు
యకజని ఎందు
కు తెచ్చిపెట్టు
కున్నావేళ?


రైలువచ్చేలోగా నేను ఆకలేసి చచ్చిపోతానేమో!
నని తినడా ని
కి తెచ్చుకున్నా



# హమేషా తమాషా



## పన్నీటి జల్లు

తుషారధవళ వేషంతో
హుషారుగా
హమేషా తమాషాగా
ఒకదినం.

ఒక నీటైన నేటి విద్యార్థి బయలుదేరాడు
ఆదినం కురుస్తోంది కుంభవృష్టిగా వర్షం
ఆ ధీర విద్యార్థి హృదయంలో కూడా
కురుస్తోంది ఆనంద వర్షం

వానజోరు అధికమైంది
గాలిహోరు అందుకు తోడైంది
విద్యార్థి విచారంతో ఆగిపోయాడు
అదేగతి పట్టింది వర్షానికి
పట్టపగ్గాల్లేవు అతని హర్షానికి
బలేహుషారుగా ఈలవేస్తూ బయలుదేరాడు
'బజ్' అన్నశబ్దం వినవచ్చింది వెనుక
లారీ ఒకటి వస్తూంది
రానీ! ఏంచేస్తుందిలే అనుకున్నాడు
మరుక్షణంలో అతనిమీద పడ్డాయి నీళ్ళు
పెళ్ళిలో పన్నీటి జల్లులాగా,
'బొట, బొట'మన్నాయి కన్నీళ్ళు
'ఎఱ్ఱని' బురద, 'తెల్లని' బట్టలమీద
ఎఱ్ఱబడిం దాతని వదనార విందం
వెనుతిరిగాడు విద్యార్థి విఫలమనోరథుడై
'ఈ పట్నాల్లో చాలాగా ఎంతమంది
దుఃఖిస్తారో కదా!'

అని వాపోయాడు, పాపం!
'సేల్సుటేక్స్' వర్షంతో నా బ్రతుకు
ఇంతే ఐపోయిందికదా!'

అని తలపట్టుకొన్నాడు ప్రక్కనే
పోతున్న వ్యాపారస్థుడొకడు.

వి. నాగగోపాల్ (రాజమండ్రి)

* * *

## నిత్య సత్యాలు

నలభీమపాకశాస్త్రము
పలుమారులు చదివి చదివి-పండితు
డైనన్,
ఇలలోన పురుషుడెప్పుడు
లలనామణి సాటి రాడు-లంబోదరుడా!
బలవంతుడ నాకేమని
నలుగురిలో జబ్బ చరచి-నడచెడు
వాడే,
ఇలుచేరు క్షణమునందున
లలనామణి దాసుడౌను - లంబో
దరుడా!
నిలిపితి నా మానసమున
కలికీ! నీ రూపమనెడు - కాంతుని
పలుకుల్,
కలనైన నమ్మజాలరు
లలనలు తమ ముదుపుగొనక-లంబో
దరుడా!

"లలనల ఆధిక్యతను గొప్పగా ప్రచారం చెశావంటే హోమ్ డిపార్టమెంటులో నీ విలువ తగ్గుతుందని గ్రహించరా భక్తా!" అన్నారు స్వామి లంబోదరులవారు.

కె. రామమోహనశాస్త్రి, (దొండపాడు)

* * *

## ప్రశ్నావళి

ఏమిచేయక వృథామేటి నీరేగును
భూపాలుడేటికి పుట్టువాండు
తుంగ ముసైల్రపితి తొలకాడు వేనికి
సభవారి నవ్వించు జాణయెవరు
కలహంస నివసించు కాసారమెయ్యది
వీరు డెద్దానిచే విజయమందు
లజ్జయెవ్వరి కమ్యూలపు టలంకారంబు
దేవాంగులకు దేనజీవనంబు
అన్నిటికి జూడ నైదేసి యక్షరములు
ఒనర నిరుదెస జదివిన నొక్కటిరె
చెప్పగలిగిన నేనిత్తు చిన్నమాడ
చెప్పలేకున్న నవ్వుదు చిన్ననవ్వు"

జవాబులు: కట్టకట్టక, నేలనేలనే. కిటికోటికి, వికటకవి. సురసరను. చేతిహేతిచే, కులస్త్రీలకు. నేతచేతనే.

కూర్పు: అయ్యగారి సుబ్రహ్మణ్యం (ఏలూరు)

* * *

## సాక్ష్యాధారాలు

హాలీవుడ్‌లో ఏదైనా పుకారు పుట్టిందంటే ఇరవై నాలుగు గంటల్లో ప్రపంచమంతటా వ్యాపిస్తుంది. కొంతకాలం క్రితం ఒక అందాల తార ఉండేది. నలుగురూ తిరిగే చోట అసభ్యంగా ప్రవర్తించిందని ఆమెనుగూర్చి ఒకప్పుడొక పుకారు పుట్టింది. ఇంకేం మర్నాటికల్లా ఈ వార్త అమెరికా అంతటా పాక్కి-పోయింది. సుమారు 1300 మహిళా సంఘాల కార్యకర్తలు ఆమె ప్రవర్తనను విమర్శిస్తూ, మళ్లీ ఏ సినిమాలోనూ ఆమెకు అవకాశం ఇవ్వరాదని స్టూడియోకు ఉత్తరాలు రాశారు.

స్టూడియో నిర్వాహకులు ఈ ఉత్తరాలన్నీ చదివి ఒక సమాధానం తయారుచేసి, దాని నకళ్లు మహిళా సంఘాలకు పంపారు. సమాధానంలో ఇలా ఉంది: "మీరు తెల్పిన సంఘటన గూర్చి మేమూ విన్నాం. ఆ తారకు తగిన బుద్ధిచెప్పాలని మాకూ ఉంది. కాని ఆ వచ్చినపుకారును రుజువుచేసే ఆధారాలేవీ ఇంతవరకు మాకు లభించలేదు. అయినా మీవంటివారు ఏ ఆధారం లేకుండా

ఇలాంటి ఆలోచనలు చెయ్యరు కాబట్టి మీకు తెలిసిన వివరాలు, అవసరమైన సాక్ష్యం వెంటనే అంద జేస్తారని ఆశిస్తున్నాం."

ఈనాటివరకు స్టూడియో నిర్వాహకులకు ఒక్క సమాధానం కూడా రాలేదంటే ఆశ్చర్యమేముంది!

బి. కాంతారావు (విశాఖపట్నం)

* * *

## మూఢ భక్తి

జార్జి బెర్నార్డ్ షాతో తనకు పరిచయం ఉన్నదని చెప్పుకుంటూ ఒక పెద్దమనిషి అదేపనిగా మురిసి పోయేవాడు. అంతటితో ఆగక షా నాటకాల గొప్పతనాన్ని చాటి చెప్పవలసిన బాధ్యత తనమీద ఉన్నదనికూడా అతడు నమ్మేవాడు. అతని కొక స్నేహితుడు ఉండేవాడు. ఆయన జాన్ గాల్స్‌వర్దీ భక్తుడు. ఇద్దరూ ఎప్పుడు కలుసుకున్నా తమతమ అభిమాన రచయితలను సమర్థిస్తూ వాదించుకునే వారు. ఒకసారి వాళ్లు కలుసుకున్నప్పుడు షా భక్తుడికి గొంతు నొప్పి చేసింది. మాటరావటం కష్టంగా ఉంది. అందుచేత అతడు తన వాదాన్ని కాగితంమీద రాసి గాల్స్‌వర్దీ భక్తునిముందు ఉంచుతున్నాడు. చర్చ జోరుగా సాగుతోంది. గాల్స్‌వర్దీ భక్తుడు మామూలుగా మాట్లాడితేనే ఫర్లాంగు దూరంలో ఉన్నవారికికూడా వినిపిస్తుంది.ఇక చర్చలో దిగినప్పటి సంగతి చెప్పాలా? పాపం షా భక్తునికి రాను రాను మరీ ఇబ్బందిగా తోచింది.

వాదోపవాదాలు పతాకస్థాయికి వచ్చాయి. "జాన్ గాల్స్‌వర్దీని లోకం మర్చిపోయి చాలకాలమైన తరువాత కూడా బెర్నార్డ్ షా కీర్తి గొప్పగా ప్రకాశిస్తుంది" అని షా భక్తుడు కాగితంమీద రాశాడు. స్నేహితుడు కోపం పట్టలేకపోయాడు. కాగితం తీసుకుని దాని వెనుక వైపున తాటికాయంత అక్షరాలలో "అసంభవం" అని రాసి అతడి కిచ్చాడు.

"సరే! సరే! ఎందుకలా పొలికేకలు పెడతావు" షా భక్తుడు స్నేహితుణ్ణి శాంతపరచడానికి ప్రయత్నించాడు!

జోగారావు (హైదరాబాదు)

* * *

పిప్పి పన్ను పీకించుకొనడానికి పద్మనాభం దంతవైద్యుడు దగ్గరకు వెళ్లాడు. అంతా సలక్షణంగా జరిగిపోయింది. ఒకమూల రేడియోలో సినిమా పాటలు వస్తున్నాయి. వైద్యుడు అతడికి ఇన్‌జక్షన్ ఇచ్చి నిమిషంలో పిప్పి పన్ను వూడబెరికాడు. పద్మనాభం కళ్ళలో గిర్రున నీళ్లు తిరిగాయి.

'ఏం నొప్పిగా ఉందా?' వైద్యుడు ఆదుర్దాగా అడిగాడు.

"అబ్బే అందుక్కాదు! ఆ పాట వస్తోందే—అది ఎప్పుడు విన్నా నాకు ఏడుపొస్తుంది!"

ఆర్. లక్ష్మీదేవి (నూజివీడు)






దైవజ్ఞపాతూరి శ్రీరామమూర్తి

**15-6-1962 శుక్రవారము మొదలు**
**21-6-1962 గురువారము వరకు**

### మేషం :

**(అశ్వని, భరణి, కృత్తిక 1 పా.)**

ఈవారం మీరు ఓర్పుతోనూ, కొన్ని సమయాలలో సాహసంతోనూ ప్రవర్తించవలసి ఉంటుంది. రకరకాల ప్రశ్నలతో మీ రహస్యాలను బయటకు లాగటానికి ప్రయత్నించేవారుంటారు. ముందే ఖర్చులు ఎదురుచూస్తుండటంవల్ల ఎంత డబ్బు వచ్చినా, చేతిలోనిలిచే అవకాశం తక్కువ. వ్యవహార రంగంలో సహాయం లభిస్తుందనే ఆశ వదులుకోవలసి వస్తుంది. వృత్తి, వ్యాపారాలలో క్రొత్తవారి వల్ల అనుకూలత ఉంటుంది. ప్రయాణాలు అనుకూలిస్తవి. మిమ్ములను పైకి గౌరవిస్తు, పరోక్షంలో చులకనగా మాట్లాడేవారుంటారు. మిమ్ములను మొహమాటపెట్టి, మీచేత సహాయం పొందేవారు తటస్థపడతారు. చెప్పుకోతగిన కారణాలు లేకపోయినా కుటుంబంలో అశాంతి తోస్తుఉంటుంది. 15, 16 తేదులలో సంతోషవార్తలు, కలహప్రసంగాలు.

* * *

### వృషభం :

**(కృత్తిక 2, 3, 4 పా., రోహిణి, మృగశిర 1, 2 పా.)**

మీ నిబ్బరమే మిమ్ములను అన్ని విధాలా కాపాడుతుంది. మాట నేర్పుతో ఎదటివారిని వశపరచుకోగలుగుతారు. విరోధులు కొందరు మిమ్ములను నష్టపరిచే ప్రయత్నాలు చేస్తున్నట్లు తెలుస్తుంది. దైవానుగ్రహంవల్ల వృత్తిలో మీ ప్రయత్నాలు

> **గ్రహస్థితి**
>
> మేషంలో అంగారకుడు, వృషభంలో బుధుడు, మిథునంలో సూర్యుడు, కర్కాటకంలో శుక్ర, రాహువులు, మకరంలో శని, కేతువులు, కుంభంలో గురువు, తుల, వృశ్చిక ధనుర్మకరాలలో చంద్రుడు.

సులభంగా నెరవేరుతవి. ముందు ముందు లాభించగల భారమైన పనులు ఆరంభించగలుగుతారు. ఇతరుల సలహాలను తొందరపడి ఆచరణలో పెట్టటం మంచిదికాదు. పిల్లలమూలంగా సంతోషం లభిస్తుంది. బంధుమిత్రులు మీరు అనుకున్నంత సహాయం చేయలేకపోతారు. వారం రెండవభాగంలో అనారోగ్య సూచనలు కనుపిస్తవి. 17, 18 తేదులలో వృథా ఆలోచనలు, లాభవార్త.

* * *

### మిథునం :

**(మృగశిర 3, 4 పా., ఆరుద్ర, పునర్వసు 1, 2, 3 పా.)**

ఈ సమయంలో కుటుంబంలో ధనవ్యయం అధికంగా ఉంటుంది. సుఖము, గౌరవము బాగుంటవి. సాధ్యమైనంతవరకు ఇతరుల వ్యవహారాలలో జోక్యం పెట్టుకోకుండాఉండటం అవసరం. సంఘంలో మీ ఆలోచనలకు, మాటకు పదిమందియొక్క ప్రోత్సాహము లభిస్తుంది. అయితే త్రిప్పట, దేహశ్రమ అధికంగా ఉంటవి. సాహస కార్యముల విషయంలో ఇతరుల ప్రేరేపణ, ప్రోత్సాహము ఉంటవి. కాని, తొందరపడటం మంచిదికాదు. శుభ, సంతోషాలపేరుతో ఖర్చులు పెరుగుతవి. వృత్తి, ఉద్యోగాలలో మీ బాధ్యతలను మరచిపోతూ ఉండటంవల్ల చికాకు కలిగే అవకాశాలున్నవి. వారాంతంలో విలువగల వస్తువులు కొంటారు. ఉష్ణాధిక్యంవల్ల అసౌఖ్యం కనుపిస్తుంది. 19, 20 తేదులలో ధనలాభం, ప్రయాణం.

* * *

### కర్కాటకం :

**(పునర్వసు 4 పా., పుష్యమి, ఆశ్లేష)**

న్యాయం మాట్లాడగలిగామనే సంతృప్తి మాత్రం కలుగుతుంది. కాని, విరోధాలు వస్తవి. వృత్తిలో ఇతరులమనస్సుకు కష్టం తోచకుండా కార్యం సాధించుకొనటం అవసరం. పిల్లలమూలంగా శుభసంతోషాలు లభిస్తవి. అయితే తలవని తలంపుగా కుటుంబంలో అనారోగ్యకారణాలవల్ల మనశ్శాంతి లోపిస్తుంది. బంధువులవద్దనుంచి శుభవార్తలు తెలుస్తవి. ఆదాయం క్రమంగా పెరుగుతుంది. క్రొత్తవారితో భాగం కలసి ఏ వ్యవహారము సాగించదగిన సమయంకాదు. ముఖ్యమైన రికార్డు కాని, వస్తువులుకాని సమయానికి లభించక ఆందోళనపడతారు. ప్రయాణాలు ప్రస్తుతం అనుకూలించకపోవచ్చు. 20, 21 తేదులలో అనారోగ్యం, కలహప్రసంగాలు, వస్తునష్టం.

* * *

### సింహం :

**(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)**

అవకాశాలు బాగా ఉన్నా, మీ మనస్సులో అనుమానాలు వస్తుఉంటవి. మొత్తంమీద స్నేహితుల ప్రోత్సాహంతో ముందుకుపోగలుగుతారు. కుటుంబంలో సుఖము, శాంతి లభిస్తవి. కొన్ని సమయాలలో వృథాగా శ్రమ చేస్తున్నామనేభావంతోస్తుంది. కాని, మొత్తంమీద మీ ఆదాయానికి లోపంరాదు. ఎదుటివారికి ఉపకారం చేసి కూడా మంచిపేరు లేకపోవటంవల్ల విసుగుదల తోస్తుంది. వ్యవహార రంగంలో ఎదుటివారి అభిప్రాయాన్ని తెలుసుకొని ముందు జాగ్రత్తతో వ్యవహరించగలుగుతారు. తూర్పు, దక్షిణ దిక్కులనుంచి సంతోషవార్తలు,

ధనరూపంలో సహాయము వస్తవి. పుణ్య కాలక్షేపా లలో పాల్గొంటారు. వారాంతంలో ఇతరుల మోసం నుంచి తప్పించుకుంటారు. 18, 19 తేదులలో వ్యవహార విషయాలలో అభ్యంతరాలు, దేహశ్రమ,

* * *

## కన్య :

**(ఉత్తర 2,3,4 పా, హస్త, చిత్త 1, 2 పా.)**

అనేకవిషయాలలో పెత్తనం నిర్వహిస్తారు. మీ ధనమును ఇతరుల నిమిత్తం వినియోగించవలసి వస్తుంది. క్రొత్తగా భారమైన పనులను ఆరంభించటానికి యోచిస్తారు. కాని, కావలసిన హంగులు అన్నీ సమకూరవు. పట్టుదలలుమాత్రం పెరిగే అవకాశాలున్నవి. ఏది ఎలాఉన్నా, స్వబుద్ధితో వృత్తి, ఉద్యోగాలలో విరోధులవల్ల వచ్చే చిక్కులను తప్పించుకోగలుగుతారు. ధనాదాయము, ఖర్చులు గత వారం మాదిరిగానే ఉంటవి. మీకు సంబంధించిన వారు చేసిన పొరపాట్లవల్ల మీ మాటకు భంగం వచ్చే అవకాశాలున్నవి. మీరు ఏ ఆలోచన చేసినా, వెంటనే అందుకు విరుద్ధమైన భావాలు వెంటాడుతూ ఉంటవి. వ్యవహారరంగంలో సాహసం పనికిరాదు. 16, 17 తేదులలో ధనలాభం, నెరవేరని ఆలోచనలు, ఎదటివారియందు దయ చూపటం వల్ల వచ్చే చిక్కులు.

* * *

## తుల :

**(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ, 1, 2, 3 పాదాలు)**

మామూలుగా చేస్తున్న పనులు కూడా క్రొత్తగా నేర్చుకొంటున్నట్లుగా తోస్తుఉంటవి. ఏ మాట మాట్లాడితే ఎవరికికోపం వస్తుందోననే సందిగ్ధావస్థలో చిక్కుకుంటారు. దైవానుగ్రహంవల్ల ధన సంబంధమైన చిక్కులు ఏమీ ఉండవు. ఎప్పుడు ఏదో ఒక కార్యభారం ఉంటూఉంటుంది. మీ విద్యా ప్రాభవాలవల్ల నలుగురిలో గౌరవస్థానం పొందగలుగుతారు. సాధారణంగా కలహప్రసంగాలకు అవకాశం లేకుండా చూచుకొనటం మంచిది. కుటుంబంలోనివారి అనారోగ్య కారణాలవల్ల ఖర్చులు పెరుగుతవి. ఇతరుల వ్యవహారాల విషయాలలో బాధ్యతలుపైన పెట్టుకొనతగిన సమయంకాదు. జాగ్రత్తగా ఉండండి. 15, 16 తేదులలో గౌరవము, కార్యసిద్ధి, ఇష్టవస్తుప్రాప్తి.

* * *

## వృశ్చికం :

**(విశాఖ 4–వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ.)**

సంపూర్ణంగా పెత్తనం నిర్వహించటానికి వీలుకాదు. బాధ్యతలను వదులుకొనటానికి అంతకన్నా వీలుకాదు. అంచనాకుమించి ధనవ్యయం చేసినా మొత్తంమీద కార్యసిద్ధి అనేది ఉంటుంది. ఉత్తర దిక్కునుంచి శుభ, లాభ వార్తలు తెలుస్తవి. నౌకరులు మొదలయినవారితో పేచీలు వస్తవి. మెదడుకు పని అధికం అవుతుంది. చెప్పుకోతగిన అనారోగ్యం ఏమీ ఉండదు. ఈ సమయంలో సుఖము, ప్రశాంతత లోపిస్తవి. మధ్య మధ్యలో రక రకాల వార్తలుచెప్పి, మీ మనస్సును కంగారుపెట్టేవారుంటారు. అధికారులను సంతృప్తిపరచటంలో మొదట శ్రమతోచినా, జాగ్రత్తగా కార్యం సాధించగలుగుతారు. 17, 18 తేదులలో పుణ్యకార్యాలు, ఇండ్లు, భూములు మొదలయినవి కొనే ప్రయత్నాలు.

* * *

## ధనుస్సు :

**(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)**

ఒకప్రక్క సాధారణమైన చిక్కు సమస్యలు కనిపిస్తున్నా, వాటిని ఎదుర్కొనగల శక్తి, సామర్థ్యాలు లభిస్తవి. సమయంచూచి మీ డబ్బును వినియోగించగలుగుతారు. వ్యాపారవృత్తులలో ముందు అనుకున్నమాటను నెరవేర్చుకొనటం నిమిత్తం శ్రమపడతారు. కుటుంబ శుభకార్యాలు చక్కగా పూర్తి చేస్తారు. ఆధారంలేని వార్తలను చెప్పి, నమ్మించేవారుంటారు. ముందుగా డబ్బుకాని, వస్తువులుకాని చేయిదాటిపోకుండా చూచుకొనండి. వారం రెండవభాగంలో విందులు, వినోదాలు మొదలయినవాటిలో పాల్గొంటారు. అన్నివిధాలా గౌరవము, శాంతి లభిస్తవి. విలువగల వస్తువులు కొంటారు. ధనాదాయం పెద్దగా పెరిగే అవకాశాలు కనుపించవు. 19, 20 తేదులలో సంతోష వార్తలు, దేహశ్రమ.

* * *

## మకరం :

**(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా)**

ఇంతకుముందుకన్నా మీ స్థితి చాలా బాగుంటుంది. కుటుంబ సమస్యలు తీరిపోయి సుఖం పొందగలుగుతారు. లోగడ విరుద్ధంగా మాట్లాడినవారే ప్రస్తుతం మిమ్ములను ప్రోత్సహించి సహాయం చేస్తారు. దైవబలంవల్ల మీరు ఎవరితో మాట్లాడినా, అవతలివారికి మీయందు ఆదరాభిమానాలు కలుగుతవి. సాధ్యమైనంతవరకు సమయం మించకుండా మీ మాటను నెరవేర్చుకొనటానికి ప్రయత్నించండి. వ్యవహార విషయాలలో పనులు చురుకుగానే తెలివిపోవటంవల్ల ముందు ముందు చేయవలసిన కార్యక్రమాలకు మార్గం లభిస్తుంది. దేహసౌఖ్యం బాగుంటుంది. ప్రస్తుతం ఇతరులకు సహాయం చేయగలమనే ఉత్సాహం తగ్గుతుంది. 20, 21 తేదులలో ధనలాభం, వృత్తిలో క్రొత్తవారితో సంబంధం.

* * *

## కుంభం :

**(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా.)**

గ్రహబలం బాగున్నది. స్నేహవర్గంలో మీ మాట సాగుతుంది. అధికారము, అంతస్తు బాగుంటవి. ప్రయాణాలు అనుకూలంగా జరిగి, తలపెట్టిన కార్యం నెరవేరుతుంది. కొన్ని సమయాలలో అవతలవారి ప్రశ్నలకు సమాధానం చెప్పవలసి వస్తుంది. కాని, నిబ్బరంతో వ్యవహరించి గౌరవం పొందగలుగుతారు. పిల్లల ఆరోగ్యం సరిగా యుండదు. పడమర, ఉత్తర దిక్కులనుంచి ధనలాభ సూచనలున్నవి. స్థిరాస్తులుకొనటం, అమ్మటంవంటి కార్యక్రమాలు లాభదాయకంగా నెరవేరుతవి. బంధువులవద్దనుంచి శుభవార్తలు వింటారు. 17, 18 తేదులలో అపవాదులు, ముఖ్యకార్యకలాపాలలో అభ్యంతరాలు.

### — ఈ వారము ధరలు —

బంగారుధర ఈవారం మొత్తంమీద పెరుగుదలలోనేనిలుస్తుంది. వెండిధర వారం ఆరంభంలో పెరిగి చివరిభాగంలో తగ్గుతుంది. ప్రత్తిధర గతవారంవలె ఉంటుంది. పసుపుధర వారం రెండవభాగంలో మందీ అవుతుంది. నూవులధర ముందుపెరిగి, క్రమంగా తగ్గుతువస్తుంది. వేరుశనగపప్పుధర మంచిలో నిలుస్తుంది. నూనెధరలో పెద్దమార్పులు ఏమీ ఉండవు.

* * *

## మీనం :

**(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి.)**

ఆర్థికస్థితి పెరుగుతుంది. మనశ్శాంతి, దేహసౌఖ్యము బాగుంటవి. బంధుమిత్రులతో లోగడ ఏర్పడిన పేచీలను ప్రశాంతంగా పరిష్కరించుకోగలుగుతారు. వృత్తిలో వృధాగా శ్రమపడుతున్నట్లు తోస్తుంది. కాని, ముందు ముందు తగినంత అనుకూలత కనుపిస్తుంది. అధికారులతో ఏర్పడే వాద ప్రతివాదాలలో యుక్తితో మీ కార్యం సాధించుకొంటారు. ఎవ్వరినీ, సహాయం కోరకుండా స్వయంకృషితో ఉన్నతస్థితికి పోగలుగుతారు. మాటలలో తొందరపడటం అనేది జరుగకుండా చూచుకొనండి. వారాంతంలో సుఖభంగం కలుగుతుంది. 15, 16 తేదులలో కష్టవార్తలు, తొందరపాటువల్ల ధననష్టం. ★

---

"రామయ్య పెద్ద నిరాశావాది" అన్నాడు మూర్తిగారు. "అతను గాలిలో నిర్మించేవి కారాగారాలు."

కమల యం. వి. (చోడవరం)

---

# చెమటకాయలను పోగొట్టుటకు ప్రత్యేకమైన
## సబ్బు మరియు పౌడరు...




# జాన్సన్స్ ప్రిక్లీ హీట్
## సోప్ మరియు పౌడర్

సౌమ్యమైన మరియు రోగక్రిమిహరమైన అడ్డే జాన్సన్స్ ప్రిక్లీ హీట్ సబ్బు చెమటకాయల వలన కలిగే బాధకు కారణమైన చర్మముమీది సూక్ష్మ రంధ్రములు మూసుకొని పోవుటను అడ్డును...వేడిన చర్మమునకు వెంటనే ఉపశమనము కలిగించును! సౌమ్యమైన మరియు గుణకారియైన జాన్సన్స్ ప్రిక్లీ హీట్ పౌడరు చెమటకాయలనుండి వెంటనే ఉపశమనము కలిగించును...మిమ్మల్ని రోజంతా చల్లగా, సౌఖ్యముగా ఉంచును!

**జాన్సన్ & జాన్సన్ ఆఫ్ ఇండియా లిమిటెడ్**

# హాయవాతా అద్భుతగాథ



మూలం: లాంగ్ ఫెలో

అనుసరణ: పి. గణపతిశాస్త్రి

## జరిగిన కథ

'జాబిల్లి' చిన్నారి భార్య నోకోమిస్ ముద్దుల కూతురు వినోనా. పడమటిగాలి అనే తుంటరివాడు వినోనాను మోసగించి మటు మాయమవుతాడు. వినోనా హాయవాతాను కని దిగులుతో మరణిస్తుంది. నోకోమిస్ మనుమణ్ణి చేరదీస్తుంది. ఒకరోజున హాయవాతా అడవిలో తప్పిపోతాడు. అతణ్ణి ఒక బ్రహ్మరాక్షసి పెంచుకుంటూ ఉంటుంది. నోకోమిస్ ఒక భూతవైద్యునివల్ల ఈ సంగతి తెలుసుకుని బ్రహ్మరాక్షసి గుహకు ఒంటరిగా వెడుతుంది. తన నేర్పువల్ల భూతవైద్యుని మంత్రప్రభావంవల్ల బ్రహ్మరాక్షసిని మోసగించి తిరిగి తన మనుమణ్ణి తెచ్చుకుంటుంది. హాయవాతా క్రమక్రమంగా పెరిగి పెద్దవాడవుతాడు. వీరోచిత విద్యలన్నీ నేర్చుకుని ఆ చుట్టుపట్ల అంతటి వీరుడు లేడనిపించుకుంటాడు. పక్షుల భాషలు, జంతువుల భాషలూ కూడా నేర్చుకుని వాటన్నిటితో చెలిమి చేస్తాడు. నోకోమిస్ భవంతికి దగ్గరగా ఇయాగూ అనే విచిత్రవ్యక్తి ఉంటాడు. అతను ఒకరోజున పెద్ద విల్లొకటి తయారుచేసి హాయవాతా కిస్తాడు. అరణ్యంలో పొడుగాటి కొమ్ములుకల ఎర్రని జింక ఉన్నదనీ, అది మహా చెడ్డదనీ చెప్పి, దాన్ని చంపిరమ్మంటాడు. హాయవాతా ఉత్సాహంతో అడవికి వెడతాడు. చిన్ననాటి బ్రహ్మరాక్షసి అక్కడ కనిపించి అతడిమీద మమకారంతో ఆ జింకను ఎలా చంపాలో చెబుతుంది. హాయవాతా జింకను చంపి, దాని కొమ్ములు తీసుకుని ఇంటికి వెడతాడు. ఇయాగూ సంతోషంతో అతణ్ణి కౌగలించుకుని మెచ్చుకుంటాడు.

హాయవాతా కిప్పుడు ఎలాంటి వస్తాదులనయినా ఇట్టే చిత్తు చేసేటంతటి అత్యద్భుత శక్తి కలిగింది! చెవిదాకా నారి లాగి బాణం ప్రయోగించి దానికంటె బాగా వేగంగా పరిగెత్తగల బలం వచ్చింది! ఆపైన భూతవైద్యు డతనికి రెండు మోచేతికవచాలు బహూకరించాడు. అవి జింక చర్మంతో తయారుచేసిన ఉక్కు ముక్కల్లాంటి కవచాలు! అవి రెండు మోచేతులకు బిగించుకొన్నప్పుడు హాయవాతా ఎంతెంత పెద్ద బండరాళ్లయినా ఇట్టే ముక్కలుముక్కలుగా బద్దలుగొట్టి వెయ్యగలడు! ఒకనాడు హాయవాతా ఒక పెద్ద కొండలాంటి బండరాయి పిండిపిండిగా నలగగొట్టి వేశాడు! భూతవైద్యుడు ఆవిడ్డూరం చూసి నిలువునా నిర్ఘాంత పడ్డాడు. 'హాయవాతా! నీకింతటి గొప్ప శక్తి కలుగుతుందని కలలోకూడా ఊహించలేక పోయాను సుమా!' అని మెచ్చుకొన్నాడు.

ఆపైన అతనికి ఒక విచిత్రమైన జోళ్ళజత బహుమతిగా ఇచ్చాడు. అవి ఎర్ర జింక చర్మంతో మలిచిన పాదరక్షలు! హాయవాతా కవి తొడుక్కోగానే ఒకేఒక అంగలో క్షణంలో మైలుదూరం సాగిపోగల

—38వ పేజీ చూడండి




ఆఫీసుకెళ్తూనే 'షా', "హలో! గుడ్‌మార్నింగ్" అని షేక్‌హాండ్‌చేసి, "కాఫీ ఇప్పించాలి" అన్నాడు. వీళ్ళందరికి ఇదొక పెద్ద దురలవాటై పోయింది. ఉత్తరాలబోర్డులోవున్న జాబులుతెచ్చి, "జాబొచ్చింది, కాఫీ ఇప్పించ"మంటారు. కాఫీ ఇస్తేనేగాని, ఉత్తరమివ్వరు. కాంటీనుకు తీసికెళ్ళి కాఫీ ఇప్పించి ఉత్తరం తీసుకున్నాను. కాఫీ 'వర్తే' అనిపించింది. వచ్చింది 'పాణి' వివాహానికి ఆహ్వానపత్రిక. ఆహ్వానపత్రికయినా బుక్‌పోస్టులోరాక, మూసిన కవరులో వచ్చింది. కారణం పత్రికతోపాటు పాణి—ఉత్తరం కూడ వ్రాశాడు.

'ప్రియమైన రఘూ,

నెలరోజులముందు పట్నంవచ్చి నిన్ను కలుసుకున్నప్పుడు కూడ పెళ్ళి త్వరలో వుండవచ్చని మాటమాత్రమయినా మన మనుకోకపోవడంవల్ల, పత్రిక చూసి మహాశ్చర్యపోతావని నాకు తెలుసు. ఇక్కడకు వచ్చిన వెంటనే అన్నీ అనుకోకుండా జరిగిపోయ్యాయి. పెళ్ళి నిశ్చయమయిపోయింది. అమ్మాయిని నీకు చూపకుండానే పెళ్ళి నిశ్చయించుకున్నందుకు నీవు బాధపడ్తావు. కాని, రఘూ అమ్మాయిని చూసివుంటే చేసేసుకొమ్మని నీవూ అనేవాడివే. పెళ్ళి మావూర్లోనూకాదు, పెళ్ళికూతురు వూళ్ళోనూ కాదు. 'తంగెడంచ' అనే గ్రామం ఇక్కడికి దగ్గర్లోనే వుంది. అక్కడ దేవాలయంలో పెళ్ళి. పెళ్ళినాటికి కనీసమొకవారంరోజుల ముందయినా బయల్దేరివస్తే, పెళ్ళినాటికి అందరంకలసి ఇక్కణ్ణించి తంగెడంచ కెళ్దాము. ఇదంతా వ్రాయకున్నా నీవు నా పెళ్ళి కొస్తావని నాకు తెలుసు.

ఇట్లు

నీ, రఘు.'

ఇదీ ఉత్తరం.

నాకు ప్రపంచంలో అందరికన్నా ముఖ్యమయిన వ్యక్తి పాణి. పాణిపెళ్ళికి వెళ్ళకుండా వుండడమనేది అసలు వీల్లేదు. కాబట్టే ఇన్స్పెక్షన్ రోజులయినా వారంరోజులకు శలవుచీటీ సమర్పించుకున్నాను. ఆఫీసరుగారి గదిలోనుండి దరఖాస్తు బయటికి రాగానే చూద్దునుగదా, స్నేహితునిపెళ్ళి అన్నచోట, వారంరోజులు అన్నచోట ఎర్రని సున్నలు చుట్టబడి వున్నాయి. అదే ఎర్రసిరాతో మూడురోజులుమాత్రం



మంజూరు అని కూడా క్రిందే వ్రాసివుంది. 'పాణి నా స్నేహితుడు' అన్న వాక్యంలో 'స్నేహితుడు' అన్న పదానికి నా నిఘంటువులో ఎంత అర్థముందో అంతా మా ఆఫీసరుగారికి తెలిసివుంటే ఒకనెల శలవు మంజూరు చేసేవాడేమో. కాని ప్రపంచంలో ఎవరెవరికి, వాళ్ళవాళ్ళ నిఘంట్లువు ఉంటాయి కాని ప్రతివాళ్ళు మన నిఘంటువునుచూసి అర్థాలు తెలుసుకోరు కదా.

ఈమూడురోజుల కాలాన్ని ప్రయాణము, పెళ్ళి అన్న రెండు పనులతో ఏవిధంగా భాగించినా, పెళ్ళి ముందే పాణిపూరు చేరడానికి శేషం సున్నామాత్రమే మిగుల్తూంది. కాబట్టి విధి బలీయమనుకొని పెళ్ళినాటికి ముందురోజు తిన్నగా తంగేడంచకే ప్రయత్నం రావలసొచ్చింది.

కర్నూలు చేరేసరికి సాయంత్రం సరిగా అయిదు గంటలయింది. బస్టాండు చేరగానే, హోటళ్ళన్నీ ఆహ్వానిస్తున్నట్టే కన్పిస్తున్నాయి. ఫలహారంమాట తర్వాత సావధానంగా చూడవచ్చు. ముందు తంగేడంచకు బస్సులు, వాటి పరిస్థితులు ఏవిధంగా వున్నాయో విచారించడం మంచిదని నిర్ణయించుకున్నాను.

చెయ్యెత్తి బస్టాండులోవున్న ఒకానొక బస్సును చూపి, "అయిదు నిమిషాల్లో అది కదుల్తుంది. దానితర్వాత రేప్రొద్దున ఏడుగంటలకు మొదటి బస్సు. తంగేడంచకు ఇవ్వాళ్టికి ఇదే లాస్టు బస్సు. దీనితర్వాత ఇంక కటువైపుకు బస్సు లేదు. ఇది సాయంత్రం ఏడుగంటలకు తంగేడంచ చేరగలదు" అని వివరించాడు అడగ్గానే అక్కడేవున్న ఒక పెద్ద మనిషి.

కర్నూల్లో సావధానంగా టిఫిను చేయవచ్చుని, దారిలో రైల్వే రెస్టారెంటు లన్నింటినీ ఉపేక్షించిన నా మనస్సును మనసులోనే తిట్టుకుంటూ, బస్సులో వెళ్ళి కూర్చున్నాను.

పగలంతా ఎండవేడికి ఉడికిపోయిందేమో నా శరీరం, చీకటిపడుతున్న ఆ చల్లనివేళలో పైదావాల్లో మెలికలుతిరిగిన ఆ రోడ్డువెంట పరుగిడుతున్న బస్సుప్రయాణం ఎంతో హాయిగా వుంది. గొర్రెలకాపర్లు ఇంటికి తోలుకపోతున్నప్పుడు, గొర్రెలు చేసే వింత వింత శబ్దాలు, కీచురాళ్ళమోత ఎక్కడో విన్పిస్తున్నాయి. బస్సుప్రయాణం అంత ఆనందంగా ఉందనిపించడానికి కారణం చల్లని పిల్లతెమ్మెరలు మాత్రమే కాదేమో. నా కెదురు సీట్లో ఒంటరిగా కూర్చొని పైదావాల్లోకి, అప్పుడప్పుడే మెరుస్తున్న చుక్కలవైపు, కొడవలి ఆకారంలోవున్న చంద్రునికేసి చూస్తున్న అమ్మాయి కూడ కారణమనుకుంటాను.

ఆ అమ్మాయి అందచందాలు వర్ణించాలంటే బంగారుఛాయ, సన్నని నడుమూ అంటూ ప్రారంభించుకపోవాలనుకుంటాను. కాని, అంత వివరంగా వర్ణించడం అనవసరం. ఆ అమ్మాయి చాలా అందంగా వుంది.

అమ్మాయివైపు చూడ్డం ఆట్టే అలవాటు లేదనుకునేవాణ్ణి అంతవరకు. కాని, ఆదినం ఎందుకో గాలికి ఎగిరిపడుతూన్న ఆ అమ్మాయి ముంగురుల పైనుండి తిరిగి రావని నా చూపులు తిరుగుబాటు చేశాయి.

నందికొట్కూరులో బస్సాగింది. ఆకలితో అవురుమంటూన్న నా కడుపుకు సమాధానం చెప్పడానికి అవకాశ ముంటుందనుకున్నాను. 'కాఫీతాగి రావడానికి టైముంటుందా' అన్న నా ప్రశ్నకు, "లేదుసార్. బండి కదుల్తూంది" అన్న కండక్టరు జవాబు, బస్సుతోనుండే మల్లెపూలు కొంటున్న ఆ అమ్మాయికూడా వినిందనుకుంటాను.

ఏడు గంటలకు తంగేడంచలో ఆగింది బస్సు. నాతోపాటు అయిదుమందిని అక్కడే వదలి తన దారిన కదిలిపోయింది. ఆ అయిదుమందిలో ఆ అమ్మాయి కూడా వుంది.

వెన్నెల్లో అల్లంతదూరాన దేవాలయ గోపురం కన్పిస్తూంది. సన్నాయి, మద్దెలమోతలు దూరంగా విన్పిస్తున్నాయి. రోడ్డుకు కొంతదూరంలోనే ఒక

# పా కీ పెళ్ళి

చెరువుంది. వంగిపోయిన ఒక కానుగచెట్టుకొమ్మ చిటారు రెమ్మలు చెరువునీటిలో మునిగివున్నాయి. పట్నంలో ఇరుక్కిరిసిన ఆ వాతావరణంనుండి రావడం వల్లేమో ఆ ప్రశాంత వాతావరణం ఎంతో మనోహరంగావుంది.

ప్రకృతిసౌందర్యం మాట యెలావున్నా, అప్పటి నా పరిస్థితిమాత్రం ఏమంత ఉత్సాహకరంగాలేదు. నాతోపాటు బస్సుదిగిన అయిదుమందిలో అందరినీ 'బాబాయ్' అనో, 'మామయ్యా' అనో పలకరిస్తూ పెళ్ళికి సంబంధించినవాళ్ళే ననుకుంటాను ఎవరో తీసికెళ్తూనే వున్నారు.

"పొద్దున్నుండి ప్రతిబండిలో దిగుతావనే చూస్తున్నాను. ఇంత ఆలస్యమయిందేమే" అందొక ముత్తయిదువ.

"పిలుపల్లే దత్తయ్యా"

ఎవరైనా వీణ మీటారా అని చుట్టూ కలయజూశాను. తత్వం పాడుకుంటున్న బిచ్చగాడుతప్ప సంగీతసాధన చేస్తున్న వాళ్లింకెవ్వరూ నా కాప్రాంతాల్లో కనిపించలేదు. కనుకే, అది ఆ అమ్మాయి ఇచ్చిన సమాధానమని నిర్ణయించాలి సొచ్చింది. సరి, ఆ అమ్మాయి కూడా ఎవరో తటస్థపడ్డారు. ఒంటరిగాణ్నిగా వుండి పోవలసొచ్చింది నే నొకణ్ణే కడుపులో ఆకలి దహించేస్తోంది. పాణి కుటుంబంతో నా కెరుకవున్న వ్యక్తుల్లో ఎవ్వరూ ఇంకా ఈ తంగెడంచ చేరిఉండకపోతే, నే నెవరిదగ్గరికి ఏమని పోవడమన్నది సమస్యగా కన్పించింది. 'హొటల్' అన్న పదం ఆ గ్రామానికి క్రొత్త అన్న విషయం పరిసరాలే చాటుతున్నాయి.

'పెళ్ళికేకదండీ?'

తిరిగి చూద్దునుకదా అడుగుతున్నది పన్నెండేళ్లపాటి అబ్బాయి.

"అవును. నీ పేరేమిటి?" అన్నాను.

"జనార్దన్."

"ఆపద్బాంధవ" అన్నట్టు విన్పించింది నాకు. ఆపదలో దింపబోయేది ఆ అబ్బాయేనని నా కప్పుడేం తెలుసు.

"వెళ్దాం పదండి" అన్నాడు మళ్లీ ఆ అబ్బాయే

ముంగిట పందిట్లోనే యెదురయ్యాడు ఇంకో అనాదరక్షకుడు. నలభయ్యేపడిలోపడ్డ పెద్దమనిషి ఆయన.

"నా మిత్రుడు పట్నంనుండి వస్తాడు గమనించి ఉండండని' అబ్బాయి పదేపదే అన్నాడు. నేనూ ఎదురు చూస్తూనేవున్నాను. రండి. ఇంత ముందుగా రావడానికి వీలుపళ్లేదా. అయినా చాలా అలసిపోయిఉంటారు స్నానం చేయండి" అంటూ ఏకధాటిగా మాటాడేశా రాయన.

నా చేతిలోవున్న సూట్కేస్ తీసుకొని ఏదో లోపలగదిలోకి అంతర్ధానమయిన జనార్దనుడు ఇంతలో తిరిగివచ్చి, నన్ను స్నానాలగదిలోకి తీసికెళ్లాడు. గదిలో వెలుగుతున్నది హరికేన్ దీపమే అయినా, ఘుమఘుమలాడుతున్న క్రొత్త సింథాల్ సబ్బు, ఇస్త్రీ

మదతలీయని టర్కిష్ టవలు, కాగిన వేడినీళ్ళు, లోటులేని సత్కారాన్నే చాటుతున్నాయి.

వరండాలో ఒకవైపు వేసివున్న ఒకానొక పరుపు పైన మేను వాలుస్తూనే బడలికంతా ఒక్కసారి తీరిపోతున్నట్లనిపించింది. ప్రక్కనే ఒక పరుపుపైన ఆసీనులయ్యారు అనాదరక్షకులవారు. (పరంధామయ్య గారని ఇకముందు వ్యవహరిస్తాను.)

"పెళ్ళివిషయం కదండీ, వంటా వ్యవహారమూ మామూలుగా కొంత ఆలశ్యమే అవుతుంది. ఒక గంట మీరు విశ్రాంతి తీసుకుంటే, భోజనాలకు ఏర్పాటు చేస్తాం" అన్నారు పరంధామయ్యగారు.

కాస్త కాఫీ అన్నా లేకుండా, ఇంకా ఒక గంట బ్రతగ్గలవా అనిపించింది.

'బాబాయ్'

మళ్ళీ అదే వీణానాదం. ఏమూలనుండో విని పించింది.

"వస్తున్నా" అంటూ వెళ్ళారు పరంధామయ్య గారు.

మరచెంబునిండా కాఫీ, ఒక వెండిగ్లాసుతో తిరిగి వచ్చారు.

"భోజనానికి ఆలశ్యమవ్వచ్చుని కాఫీ చేశారు లాగుంది" అంటూ కాఫీ అందించా రాయన.

నందికొట్కూరు బస్టాండులో కాఫీకొరకు నా తాపత్రయాన్ని ఈవిడగారు దయతోనే గమనించి నట్టున్నారు. ఏమయితేనేమి కాఫీ సేవిస్తూనే కాస్త మాట పెగిలిరావడం మొదలయింది.

"పిల్లింకా రాలేదా" అన్నాను.

"మీకు తెలీందేముంది. రివాజుప్రకారం ఎద్దు బళ్ళల్లో రావలసిందేనాయె. ఆరుగంటలకే బయ ల్దేరివుంటారు. బాగా ఆలశ్యమవుతుంది రావడానికి. పన్నెండు కావచ్చేమో. మీరు భోంచేసి విశ్రాంతి తీసుకుందురుగాని. ఈ సందడి అంతా లేకుండా. మీ కా యెదుటవున్న విడిదిగదిలో పడక వేయిస్తాను. తెల్లవారి కలుసుకోవచ్చు మీ మిత్రుణ్ణి" అన్నారు పరంధామయ్యగారు.

రాష్ట్రరాజకీయాలు, పంచాయతీ యెలక్షను లు తదితర విషయాలమీద ఉపన్యాసాలిస్తుంటే మంత్రిపదవికాకపోయినా కనీసం ఎమ్మెల్యే అయినా ఎప్పుడో చేసే వుంటారనిపిస్తుంది పరంధామయ్య గారు.

సుష్టుగా భోంచేసి, తాంబూలచర్వణానికి కూర్చున్నాము. ఇంతసేపూ పందిట్లోనే, ప్రక్క గదుల్లోనో ఎక్కడో అక్కడ అప్పుడప్పుడూ ఆ వీణతంత్రులు మ్రోగుతూవుండడం గమ నిస్తూనే ఉన్నాను.

చిట్టచివరి ఆకుకు సున్నం వ్రాసుకుంటూవుం డగా యెక్కడో మృదంగం సన్నాయిలకు సంబం ధించిన శబ్దాలు లీలగా వస్తున్నట్లు వినిపించింది.

"వస్తున్నట్టున్నారుకదండీ" అన్నాను.

"అవి ఇటువైపునుండి వస్తున్న మేళాలు. కడు మూరువాళ్ల దెవరిదో ఇంకో పెళ్ళికూడా ఇక్కడే వుంది రేపు. అయినా వాళ్ల ముహూర్తం తెల్లవారి ఆరుకే నమకుంటా" అని శలవిచ్చారు పరంధా మయ్యగారు.

## ఆంధ్రసచిత్ర వారపత్రికలో ప్రకటనలు
## మీ వ్యాపారాభివృద్ధికి తోడ్పడుతాయి

# పాణి పెళ్ళి

పెళ్లిపందిరి, విడిది, పరువూ అంతా నా చుట్టూ గిరగిరా తిరగడం ప్రారంభించాయి.

ఇంకొక పెళ్లి, కడుమూరువాళ్లది. ముహూర్తం ఆరుగంటలకు.

హే భగవాన్! అయితే తప్పు గుడారంలోవచ్చి పడ్డానన్నమాట. నా మజిలీ ఇది కాదు.

ఇప్పు డేవిటి కర్తవ్యం. జనార్ధనుడు బస్టాండులో వివరాలడిగి తీసుకొస్తున్నాడని పరంధామయ్య గారు తలపోసి ఉండవచ్చు. వట్టి అర్భకుడు. వాడికెక్కడిది అంత తెలివి. ఎవరితెలివి ఎంతయినప్పటికీ, ఇప్పు డసలు కర్తవ్యమేమిటి.

ఇంత అతిథి సత్కారాలుపొంది, ఇప్పుడు నేను ఈ పెళ్ళికి రాలేదు' అని చెప్పి పక్కవిడిదికి వెళ్ళిపోవడమా. అబ్బో! అది సాధ్యంకాదు.

ఇప్పు డిక్కడికి ఈ అసలు అతిథి వూడిపడితే నా గతేమికాను. సినిమాలో నాయకుని వేషధారియై, నాయకి పడకగదిలోకిపోయిన దుష్టుడు కిటికీ చువ్వలగుండా అసలునాయకుని రాక గమనించినట్లుంది నా పరిస్థితి. తంగెడంచకు కర్నూలు నుండి ఇక బస్సుల్లేవన్నవిషయం గుర్తుకొచ్చి, అట్టి ప్రమాద మిప్పుడిప్పుడే వుండబోదని సమాధానపడ్డాను.

ఈ మిధ్య సత్యాలమధ్య అప్పుడే కళ్లు తెరచి దారికానని పరిస్థితుల్లో కొట్టుమిట్టాడుతున్న నన్ను చూసి, "నిద్ర వస్తున్నట్టుంది, ఇక మీరు వెళ్లి విశ్రమించండి. నాకూ బోలెడన్ని పనులున్నాయి. పొద్దున్నే మాటాడుకోవచ్చుని" పరంధామయ్య గారు నిష్క్రమించారు.

కాసేపు తీరిగ్గా ఆలోచించి, మొదట ఇక్కణ్నుంచి పారిపోవడమే తక్షణ కర్తవ్యమని నిర్ణయించుకున్నాను.

నేను పారిపోయింది గమనిస్తానే, అసలు అతిథి వస్తానే, ఆ అమ్మాయిగాని, పరంధామయ్య గారుగాని, నన్నుగూర్చి ఏమనుకుంటారో? ఏది ఏమయినా పారిపోయి పాణిదగ్గరపడ్డం మొదటి పని, కాబట్టి అదే చేయడానికి నిర్ణయించుకున్నాను.

"జనార్ధన్" అన్నాను.

"జానీ! ఆయన పిలుస్తున్నారు" తగ్గు స్థాయిలో అదే వీణానాదం యెక్కడో వినిపించింది. కాసేపటికి అగ్గాకు డొచ్చాడు.

"ఎక్కడున్నావు. కనిపించన లేదబ్బాయి. భోం చేశావా?"

ఏదో జవాబిచ్చాడు.

"అయితే ఆ కడుమూరువాళ్ల పెళ్లికూడా రేపేనన్నమాట. వాళ్ల విడిది యెక్కడో!" అన్నాను. ఏదో లోపాయికారిగా అడిగినట్లు.

"ఈ వెనకే, ఇలా ప్రక్కనుండి వెళ్తే వస్తుంది"

"ఆ! పోనీలే. అన్నట్లునా సూటుకేసెక్కడ పెట్టావు. ప్రొద్దున్నే గుడ్డలు తీసుకోవడానికి."

"ఈ ప్రక్కగదిలో" అన్నా డొక గది చూపుతూ.

ఆరాలు తీయడమయింది. ఇక వీణ్నిక్కణ్నుండి పంపడం ముఖ్యం.

"సరే ఇక వెళ్ళబ్బాయి. ఏమన్నా పనులుండ వచ్చు."

'నాకేం పనులండీ' చాపమీద కూర్చుంటూ అన్నాడు.

దీర్ఘంగా ఆలోచించి, "జనార్ధన్, కాస్త సిగరెట్లు తెచ్చిపెట్టగలవా" అన్నాను అలవాటు లేకున్నా.

"ఓ ప్రక్కవీధిలో కొట్టుంది" అని పరుగు తీశాడు.

ఎవరూ చూడ్డంలేదు. దీపముండగానే ఇల్లు సద్దుకోమన్నారు. సరాసరి ఆ చీకటిగదిలో కెళ్లాను. చీకట్లోనే తడుముకుంటూ, లెదరు సూటుకేసందుకున్నాను.

ఆ చీకట్లోనే ఎక్కడో ఒకమూల గాజులు ఘల్లుమన్నాయి. నా గుండె ఆగినంతపనయింది. రోటియందు తలదూర్చి, రోకటిపోటునకు వెరువ కూడదనే నిర్ణయించుకున్నాను.

తిన్నగా పందిరి బయటకొచ్చి ప్రక్కగుండా వెనకవైపు విడిదికేసి వెళ్లాను. చీకటిలోనుండి రెండు అందమయిన కళ్లు నన్ను గుచ్చి చూస్తున్నట్లేవుంది నాకు.

మిత్రబృందం మధ్యన ఆసీనుడై వున్నాడు పాణి.

"ఇట్లా చేస్తావనుకోలేదురా రఘూ. ఇదేంపనిరా. మూడుగంటలముందయినా రాలేకపోయావా" అంటూ ప్రారంభించి ఏదేదో మాటాడేస్తున్నాడు పాణి. నేనింకా నార్మల్సి అందుకోలేదు.

సన్నాయి వాయిద్యాల సందడిలో అయిదుకే నిద్ర లేచాను. పాణిని పెళ్లికొడుకును చేస్తున్నారు. నేనూ స్నానంచేసి, బట్టలు మార్చుకుందామని సూటు కేసు తెరిచాను.

చీరలు, రవికెలు.

"హే భగవాన్! ఏమిటీ పరీక్ష. ఈ భక్తునికి ఇంకా మోక్షంలేదా. ఎందు కీ విషమపరీక్ష. రక్షించవా. ఆపద్బాంధవా!

ప్రక్కన పిట్టగోడవతల మాటలు వినిపిస్తున్నాయి.

"ఏమే ఇంకా ఇక్కడున్నావు. స్నానంచేసి, బట్ట మార్చుకోరాదూ."

"బట్టల్లేవత్తయ్యా" అదే వీణానాదం

"బట్టల్లేకపోవడమేమిటే. ఉండు నా వీరొకటి చూసి తెచ్చిస్తాను" సమాధానం.

ఒక్క ఉదుటున సూట్‌కేస్‌తో పరుగిడి, పిట్ట గోడమీదుగా ఉంచాను. అందమైన రెండు చేతులు సూట్‌కేసు నందుకున్నాయి.

కాసేపట్లో ఆ రెండుచేతులే మరియొక సూట్‌కేసు నందిచ్చాయి.

వచ్చి సూట్‌కేసు తెరిచిచూద్దునుగదా, పాణికి కానుకకొరకు తెచ్చిన రిస్టువాచిపెట్టెలో వాచి ప్రక్కనే ఒక చిన్న కాగితంపైన

'ఆతిథ్యంపొంది చెప్పకుండా పారిపోయినందుకు మీరు దగాకోర్లని అనుకోవడంలేదు కాని నిర్దయులనుకుంటున్నాను. మన్నవకండి

వీణ

అన్న అక్షరాలు ముద్దుగా వ్రాయబడి వున్నాయి.

★

శక్తి వచ్చింది! అప్పటినించి హయవాతా ఎందరెందరో బలవంతుల్ని సునాయాసంగా ఓడించి పెద్దపెద్ద జెట్టీలందరిచేత 'ఓహో!' అనిపించుకున్నాడు.

అయితే హయవాతాని ఒక పెద్ద మనోవ్యాధి అస్తమానము అదేపనిగా పట్టుకుని వేధించింది. తన తల్లిదండ్రులెవరో అతనికీమాత్రము తెలియలేదు. నోకోమిస్‌ని అడిగితే వినీవిననట్టు మాట్లాడకూరుకుంది! మళ్ళీమళ్ళీ అడిగాడు. తల్లి వెనోనా వల్లమాలిన మనోవ్యాధివల్ల కుమిలి కుమిలి తీసుకుని తీసుకుని చనిపోయిందని చివరికి నోకోమిస్ చెప్పింది. హయవాతా ఆ మనోవ్యాధి కేమి కారణమని మళ్ళీ అడిగాడు. జరిగినదంతా ఉన్నది ఉన్నట్టుగా చెప్పేదాకా విడిచిపెట్టలేదు. నోకోమిస్ కిక గత్యంతరం కనబడలేదు. పడమటిగాలి సంగతి, అతను చేసిన మోసము, ద్రోహము అన్నీ పూసగుచ్చినట్టు ఏకరువు పెట్టింది.

ఆ దారుణకథ వినగానే హయవాతా గుండె పట్టరాని కోపంతో భగ్గుమని మండింది. కళ్లు రెండు చింతనిప్పులై బుసకొట్టాయి. మరుక్షణంలోనే తన మోచేతి కవచాలతో, పాదరక్షలతో, విల్లమ్ములతో, కత్తులతో, కఠారులతో పడమటిగాలితో పోరాడడానికి బయలుదేరాడు. 'వాడిసంగతేమిటో కనుక్కుని తీరుతాను!' అని గొంతెత్తి గర్జించాడు. నోకోమిస్ హయవాతా ధోరణి కనిపెట్టి లోలోపల గజగజ వణికింది. తొందరతొందరగా ఎదురుగా వెళ్ళిపాదాల దగ్గిర కూలబడి వలవలా ఏడ్చింది:

# హయవాతా అద్భుతగాథ

31-వ పేజీ తరువాయి

'నాయనా! హయవాతా! పుట్టినప్పటినించి నీకన్నీగండాలే! ఆ దైవం దయవల్ల ఎలాగో అలాగ అవన్నీ గడిచి బయటపడ్డావు! ఆ పడమటిగాలి సంగతి నీకు తెలియదు. వాడు మహామాయలమారి! వట్టి కఠినాత్ముడు! ఇక్కడ పడమటి దిక్కుగా కొన్ని వందల మైళ్ళ దూరం సాగిపోతేనే గాని నువ్వు వాడి కోటదగ్గిరికి చేరుకోలేవు! దాని

---

పున్నయ్యగారు ఆఫీసు కాగితాలలో మునిగిపోయారు. వారి కుమారరత్నానికి అరేబియా సముద్రం ఎక్కడ ఉన్నదో అంతుపట్టకవచ్చి తండ్రిని అడిగాడు.

"వెళ్ళి మీ అమ్మ నడగరా. అదే ఎక్కడో పడేసుంటుంది!" పున్నయ్యగారు చిరాకు పడ్డారు.

ఎం. లీలాకుమారి (హైదరాబాదు)

---

చుట్టురా గాలి కూడా చొరలేని కీకారణ్యం! దానిలో ఎన్నెన్నో చిత్రచిత్రమయిన క్రూరమృగాలున్నాయి. కట్టుకున్న భార్యనే చంపివేసిన తరవాత వాడికి నీమీద జాలికలుగుతుందా? కలగదు! ఏదో మాయచేసి నిన్నుకూడా ఇట్టే పొట్టబెట్టుకుంటాడా దుర్మార్గుడు! నా మాట విను నాయనా! వాడి దగ్గిరికి వెళ్ళకు! మరి ఒక్క అడుగు వేశావంటే నన్ను చంపుకున్నట్టే!"

ఆ తరవాత ఆమె హయవాతా కాళ్ళమీదపడి వెళ్ళవద్దని అదే పనిగా మొరపెట్టుకుంది. హయవాతా లక్ష్యపెట్టలేదు! ఒక్క అంగవేసి కన్నుమూసి తెరిచేలోగా మైలుదూరం సాగిపోయి కీకారణ్యంలో పడి అదృశ్యుడయినాడు. పాపం నోకోమిస్ ఇక చెయ్యగలిగిన దేదీలేక కుమిలికుమిలి ఏడుస్తూ తిరిగి తన మేడలోకి వెళ్లిపోయింది.

ఆపైన హయవాతా గాలివానకన్నా వేగంగా పరుగు ప్రారంభించాడు. లేళ్లుకూడా అతనితో సమానంగా పరిగెత్తలేక బాగా వెనకపడిపోయాయి! హయవాతా రివ్వుమని దూసుకుపోతూంటే గాలి రెండు వైపుల హోరుమని మారుమోగింది! ఆ మహాబలశాలి అలాగే విద్యుద్వేగంతో అడవులు, కొండలు, ఎడారులు, మైదానాలు, నదులు, ఎన్నెన్నో దాటిపోయాడు! అలాగలాగ పోగాపోగా కనుచూపుమేరలో అతనికొక పెద్ద కోట కనిపించింది. ఆ కోటమీద ఎవడో ఒక వ్యక్తి పొడుగాటి కొండలాగ నిలబడి ఉన్నాడు! అతన్ని చూడగానే హయవాతా గుండె ఆగింది! కాని అంతలోనే తమాయించుకున్నాడు. ఆ కొండలాంటి మనిషి గిరజాలు హోరుగాలికి అటు ఇటు కదులుతూ ఆకాశంలో చుక్కలదాకా వెళ్లిపోతున్నాయి! 'అతడేలావుంది పడమటిగాలి!' అని లోలోపలే గొణుక్కున్నాడు హయవాతా!

ఆ పరాక్రమశాలి వైఖరి గమనించి పడమటిగాలి 'ఇతడెవరా?' అని కొంచెంసేపు జాగ్రత్తగా పరకాయించి చూశాడు. అతనిలో వెనోనాపోలికలు కనపడగానే పడ

మటిగాలి ఒళ్లుజలదరించింది! ఆనందం పట్టలేక ఎగిరి గంతువేసి ఒక్క గావు కేక పెట్టాడు. ఆ ధ్వని ఆ ప్రక్కనే ఉన్న కొండగుహ లన్నిటిలోను భోరుమని మారుమోగింది! మరు క్షణంలోనే పడమటిగాలి ఒక్క గంతువేసి హాయవాతా దగ్గరికి వచ్చి గాఢంగా కౌగలించుకుని స్వాగతం చెప్పి తనఘోష వెళ్ళబోసు కున్నాడు:

'నాయనా! ఎన్నాళ్ళకి వచ్చా వురా ఇక్కడికి! నీకోసం కళ్ళు కాయలుకాచి పోతున్నాయిరా! నిన్ను చూడగానే పాపం, ఆ అందాల బరిశె వెనోనా జ్ఞాపకం వచ్చిందిరా! పాలపొంగులా మిస మిసలాడుతున్నావురా నా చిట్టి తండ్రీ! నే నప్పుడే కొంచెం పెద్దవా ణ్ణయ్యాను! ఇదేమిటి! అలాగ నిలబడి పోయావేమిటి? రా! కోటలోపలికి రా! దూరప్రయాణం చేసి బాగా అలసినట్టున్నావు! రా! ముందుగా ఏదైనా ఫలహారం చేద్దువుగాని! అన్నట్టు మీ అమ్మమ్మ బాగా కులాసాగా తిరుగుతోందా?'

అంతలోనే పడమటిగాలి హాయ వాతా చెయ్యి దొరకబుచ్చుకుని కోటలోకి తీసుకువెళ్లి ఫలహారాలు తీసుకువచ్చి అతనిముం దుంచవలసిన దని పరిచారకుల కాజ్ఞాపించాడు. హాయవాతా మర్యాదకోసం కొంచెం ఫలహారం చేస్తున్నాడన్న మాటేగాని లోలోపల అతని గుండె భగ్గుమని మండుతూనే ఉంది. అయినా కిమ్మనకుండా పడమటి గాలి చెప్పే మాటలన్నీ చాలా జాగ్రత్తగా విన్నాడు.

తరవాత క్రమక్రమంగా పడ మటిగాలి అదేపనిగా తన గొప్పలు చెప్పకోవడం మొదలుపెట్టాడు. ఆవిధంగా మరికొంతసేపు గడిచిన తరవాత హాయవాతాకి ఒళ్లు మండింది. అయినా చిరునవ్వు నవ్వుతూ మాట్లాడ కూరుకున్నాడు. అవుననికాని కాదనిగాని అనలేదు! ఇంకా కొంతసేపు గడిచినతరవాత మరి ఉండబట్టలేక 'సరేగాని పడ మటిగాలీ! మరి ఈ ప్రపంచంలో నీకు ప్రాణభయం కలిగించేది ఏది లేనేలేదా?' అని కుండ బద్దలు కొట్టి నట్టు అడిగాడు! 'ఏం? ఎందుకలా అడుగుతున్నావు?' అన్నాడు పడ మటిగాలి.

'అబ్బే ఏమీలేదు! నీ మాటలు కోటలుదాటిపోతున్నాయి. అందు కని అడుగుతున్నాను. అంతే!'

'అయితే చెబుతాను విను! ఈ ప్రపంచంలో నన్నేది భయపెట్ట లేదు! కాని అదిగదిగో! కారు మబ్బులా నల్లగా ఉన్న ఆ కొండ శిఖరం చూశావా! దానివేపు చూడ గానే నా ఒళ్లు జలదరిస్తుంది!'

అది విని హాయవాతా మాట్లాడ కూరుకున్నాడు. అంతలోనే పడమటి గాలి అతనికేసి బాగా పరిశీలనగా చూశాడు:

'మరి నీమాట!'

'నా కలాంటి భయాలేవి లేవు!'

'నిజమేనా?'

'నిజమేగాని అదిగో అక్కడ జడలు విరబోసుకొన్న దెయ్యంలా ఉన్న ఆ పొడుగాటి చెట్టుకేసి

## మల్లె మొగ్గ

టి. రామకోటీశ్వరరావు

మల్లె మొగ్గా! నీవు మాటాడు మొకసారి
మనసువిప్పి నిన్ను పలకరించాను.
పాపాయి నవ్వులా తీగపై విరిసేవు
పాపాయి పలుకులా పరిమళించేవు.
విరిసేవు తీగపై మురిసేవు లోలోన
గండుతుమ్మెద రాక పరవశించేవు
చిరుగాలితో తేలి నయ్యాటలాడేవు
పాపాయి నడకలా మురిపించివేసేవు.
జాబిల్లి వెలుగులా మనసు లన్నీ దోచి
క్రొంగొత్త వలపులా కరగించివేసి
విరిసేవు మురిసేవు మరపించి మురిపించి
కనికట్టు కట్టేవు ఒకచూపుతోనె
అల్లారు ముద్దుగా తీగ పొత్తిళ్ళపై
బోసినవ్వుల నన్ను పలుకరించావు
నీ సొంపు-నీ చూపు-నా జూకు దనము
మనసు నీపై మాకు మరలి నిలిపాయి.

## హాయవాతా అద్భుతగాథ

చూస్తూంటే లోలోపల కొంచెం గుబులు బయలుదేరుతూంది!'

ఆమాట వినీవినగానే పడమటిగాలి తటాలున లేచినిలబడి అదే పనిగా వెర్రిగా నవ్వడం మొదలు పెట్టాడు. అతడెందుకలాగ నవ్వుతున్నాడో అని హాయవాతా లోలోపల కొంచెం భయపడ్డాడు కాని ధైర్యం తెచ్చుకుని—

'ఎందుకలా విరగబడి నవ్వుతున్నావు!' అని గద్దించి అడిగాడు. పడమటిగాలి మరి ఆ మాటే వినిపించుకోలేదు. తల వంచుకొని నెమ్మదిగానెమ్మదిగా అడుగులు వేసుకొంటూ ఆ పొడుగాటి చెట్టు మొదలు చేత బుచ్చుకొని అటు ఇటు ఊగించాడు. ఆ చెట్టు పెల్లగించి దానితో తనని చంపివేయాలని చూస్తున్నాడేమో అని హాయవాతా లోలోపల ఎంతో భయపడ్డాడు. అతనికి ముచ్చెమటలు పోశాయి. ఎంత ప్రయత్నించినా నోట మాట పెగలలేదు! అయినా ఎలాగోఅలాగ ధైర్యం చిక్కబట్టుకుని పెద్దగా అరుస్తూ బతిమాలుకున్నాడు:

'పడమటిగాలీ! పడమటిగాలీ! ఆ చెట్టు పెల్లగించుకు! వద్దు వద్దు! నువ్వు అడగగానే అబద్ధం ఆడకుండా ఉన్నది ఉన్నట్టు చెప్పినందుకేనా నాకీ మరణశిక్ష! నీ వంటి మహాబలశాలి కిది న్యాయమేనా! పెల్లగించవద్దు! ఆ చెట్టు పెల్లగించవద్దు! అయ్యయ్యో! ఎన్నిసారులు మొరపెట్టుకున్నా నా మాట వినిపించుకోవేమిటి! రా! రా! త్వరగా తిరిగి రా!'

ఇంకా ఉంది

# వెండిమబ్బు

24-వ పేజీ తరువాయి

"ఇందిర ఏది?"

ఇంటికి రాగానే తండ్రి అడిగిన మొదటిప్రశ్న అది.

పుట్టయ్య బదులు చెప్పాడు.

"తోటలోకి వెళ్ళింది."

"కులాసాగా ఉందికదా?"

ఎన్నోఏళ్ళుగా కూతుర్ని చూడనట్టు యోగ క్షేమం విచారించారు.

"ఆ, మీ స్నేహితుడు......ఆయన......"

"ఓ! ఆ అబ్బాయి వచ్చాడా?" అంటూ ముందుకు నడిచా రాయన.ఆయన వెంబడే పుట్టయ్య, లలితమ్మ వచ్చారు. మోహన్ రెండడుగులు ముందుకు వచ్చి, చెయ్యి చాపాడు. రావుగారు చాచిన చెయ్యి అందుకొని, గట్టిగా పట్టుకొని,

"క్షమించండి మోహన్‌రావ్! అర్జంట్‌పని తగలటంవల్ల మీరు వచ్చేసరికి ఇంట్లో ఉండలేక పోయాను. మీకేమీ ఇబ్బంది కలుగలేదుకదా?' అన్నారు.

"ఆయన వచ్చినప్పుడు నేనుకూడా లేను" లలితమ్మగారు అందుకొన్నారు.

రావుగారు గబుక్కున ఆమెవైపు తిరిగి, "ఏం, ఎక్కడికి వెళ్ళావు?" అన్నారు.

"చిక్కమగళూరువెళ్ళాను. ఇందిర ఉంది."

ఇందిరపేరు వింటూఉండగానే ఆయన వయస్సు పదేళ్ళు తక్కువయినట్టు కనిపించింది ఆయన ముఖం.

"పుట్టయ్యా ఇందిరకు నేను వచ్చానని కబు రంపండి. మోహనరావ్! మీరు వచ్చినందుకు చాలా సంతోషం. ఏం చేయను నేను వెళ్ళక తప్పలేదు."

"ఫరవాలేదు. నాకేమీ ఇబ్బంది కలుగలేదు."

"భోరా, సూట్‌కేస్ లోపలపెట్టు. స్నానానికి నీళ్ళు తోడమని చెప్పు."

ఆయన మాట్లాడుతూనే టై, ముడి విప్పు తున్నారు.

రావుగారి వయస్సు సుమారు 52 ఏళ్ళు. తలవెనుకభాగంలోని వెంట్రుకలు కొద్దిగా నెరి శాయి. కాని, ఆయన పొడుగు, చలాకీతనంవల్ల ఇంకా చిన్నవారిలాగానే అగపడేవారు. చిన్నగా, సొంపుతీరిన కళ్ళల్లో వ్యవహారదక్షతా, నేర్పూ, దర్పమూ ఇమిడి ఉన్నాయ్.

"రామారావుగారు రాలేదా?"

"రాలేకపోయారు. నాకో ఉత్తరం ఇచ్చి వెళ్ళ మన్నారు."

"సరే. స్నానం చేశాక చూస్తాను" అంటూ లోపలికి వెళ్ళారాయన.

ఆయన స్నానంచేసి వచ్చేసరికి మోహన్ సూట్ కేసులోంచి ఉత్తరం తీశాడు.

రావుగారు స్నానంచేసి, శుభ్రమైన దుస్తులు ధరించి నోట్లో సిగార్‌తో బయటకు వచ్చారు.

"ఇదిగో ఉత్తరం."

"పుట్టయ్యా, నా కళ్ళజోడు ఇలా తీసుకురండి."

కళ్ళజోడు పెట్టుకొని, కవరుచించి ఉత్తరం చదివారు. చదివాక,

"సరే. కాని, కమిటీవాళ్ళు ఏదో నిర్ణయించి వక్చే ఉన్నారు. కనుక, ఇప్పుడే ఏమీ చెప్పలేము" అన్నారు.

"మీరు రెకమెండ్ చెయ్యడానికి వీల్లేదా?"

"చెయ్యవచ్చు. కాని నే వొక్కణ్ణేచేసి ఏం లాభం? మిగతా పదిమందికూడా ఒప్పుకోవాలిగా చూద్దాం. నా చేతనయినంతవరకూ చేస్తాను. కాని, మీరేమీ ఆశ పెట్టుకోకండి. తరువాత బాధ పడాల్సొస్తుంది."

నిరాశతో మోహనుని ముఖం వెల్లబడింది. అది గమనించిన రావుగారు, "అంత నిరాశపడ కండి. చూద్దాం" అన్నారు.

"కమిటీ మీటింగ్ మళ్ళీ ఎప్పుడు?"

"ఇంక పదిహేనురోజుల్లో. ఏ సంగతి తేలి పోతుం దనుకుంటా."

మోహనుడు కాస్సేపు మెదలకుండా ఊరు కొని, తరువాత,

"నేను వచ్చిన పనయిపోయింది. ఇక వెడతాను" అన్నాడు.

రావుగారు నవ్వి, "పని కాలేదే?" అన్నారు.

"కాని నేను ఉండి ఏం చెయ్యాలి. కమిటీ తీర్మానాన్ని మీరు ఉత్తరంద్వారా తెలిపితే చాలు. మధ్యాహ్నంబండికి నేను వెడతాను."

"మాతోట అంతా చూసుకొని వెళ్ళండి."

"అంతా చూశాను" అంటూ లేచాడు మోహన్.

"నాన్నా"అంటూ బైటనుండి వచ్చిందిఇందిర.

రావుగారు అక్కరగా, "ఎండలో తిరుగుతా వెందుకమ్మా?" అని, "అమ్మతోచెప్పు. మోహన్ మధ్యాహ్నం ఊరికి వెడతారని. డ్రైవర్‌తోకూడా చెప్పు..............."

"ఒద్దు, ఒద్దు మీకెందుకు శ్రమ? బస్సు లుంటాయిగా."

"పల్లెటూళ్ళకు వచ్చిపోయే బస్సులుంటాయను కోండి. కాని కారుండగా, ఆ బాధ లెందుకు?"

మోహన్ మళ్ళీ మాట్లాడలేకపోయాడు. ఇందిర అతనిమోహంలో కనిపిస్తున్న నిరా శను గమనించింది. అందమైన అతని మోహం, వాడిపోయింది. ఇందిర ప్రశ్నార్థకంగా తండ్రివేపు చూసి లోపలికి వెళ్ళిపోయింది.

లలితమ్మ వంటగదిలో ఏం వండాలో చెప్పు తున్నారు.

"అమ్మా! మోహన్‌రావుగారు వెడుతున్నారట."

ఆమె ఆశ్చర్యంతో, "ఇంత తొందరగానా?" అంది.

"ఊఁ ఆయన వచ్చిన పని కాలేదేమో. చాలా బాధపడుతున్నట్టున్నారు."

"రెండురోజులు ఉండి వెళ్ళచ్చుగా."

"ఎందుకూ, ఊరికే ఇక్కడ ఉండటానికి ఇంటిఅల్లుడా ఏమిటి?" పరిహాసంగా నవ్వుతూ అంది ఇందిర.

లలితమ్మ పలుకలేదు. ఏమిటో ఆలోచిస్తూ ఉందామె. మోహనుని అందమైన రూపం తల్చు కుంటూఉంది ఆవిడ.

ఎవరినైనా ఇట్టే ఆకర్షించగల నిండైన విగ్రహం. తల్లులలో మాతృప్రేమ కలిగించే ముద్దు

మోహం. కన్నెపిల్లలమదిలో కోర్కెలను రేకెత్తించే చిరునవ్వు—మొత్తంమీద తన్మయం కలిగించే ఆకర్షణీయమైన సుందరరూపం.

ఇంతకన్నా మంచివరుడు ఇందిరకు దొరుకుతాడా? అబ్బాయికి విద్య ఉంది. కనుక ఐశ్వర్యాన్నిగురించి బాధపడక్కర్లా. అదీకాకుండా తమకున్న ఆస్తికంతా ఇందిరేకదా వారసురాలు. ఇందిరను చేపట్టేవాడు బీదవాడయితే ఏం?

మోహనునిరూపంతో పోల్చిచూస్తే ఇందిర రూపం చెప్పుకోతగ్గదేమీకాదు. తన తల్లికళ్ళకు ఇందిరది అప్సరస, సురసుందరి, ముద్దులమూట. కాని, మాతృత్వమునేతెర తొలగించిచూస్తే ఇందిర రూపం అతి సామాన్యమైనది. నలుగురిలో కలిసి ఉన్నప్పుడు విశిష్టంగా కనిపించే రూపంకాదు ఇందిరది. అలాంటి ఇందిరని మోహన్ పెళ్ళి చేసుకుంటాడా? కాని.......రూపానికంత ప్రాధాన్యమా? అపురూపమైనసౌందర్యం ఇందిరకు లేకపోవచ్చు. మిగతావిషయాల్లో ఇందిరకేం లోటూ లేదు. భర్త అనుకుంటే మోహన్ తమ అల్లుడు కాగలడు. ఔను ఎందుకు కాకూడదు?

లలితమ్మ ఇలా ఆలోచిస్తూఉండగానే రావుగారు లోపలికి వచ్చారు. భర్త రాకతో తన ఆలోచనలు కట్టిపెట్టి లేచారు లలితమ్మ.

"మోహనరావు ఈరోజు ఊరికి వెడతారట."

"ఊఁ" అన్నారు లలితమ్మ.

"వంట కాస్త తొందరగా చేయించు."

"ఆయన వచ్చినపనేమయింది?"

"మూడువంతులు ఈమారు అతన్ని పంపడం వీలుపడదు. ఒకవిధంగా ఈమారు ఎవర్ని పంపడమో నిర్ణయం అయిపోయింది. ఆ విషయం చెప్పాక, ఆయన చాలా బెంగపెట్టుకున్నట్లున్నాడు"

లలితమ్మ శాంతంగా, "దేవుడు ఏదిచేసినా మంచికే చేస్తాడు." అన్నారు.

రావుగారు నవ్వి, "ఈ వేదాంతంప్రకారం అందరూ నడుచుకుంటె ఇహ మనిషికి నిరాశ అన్నమాటే ఉండదు" అన్నారు.

లలితమ్మ ఒకసారి చుట్టూచూసి నెమ్మదిగా అన్నారు,

"మీరు తల్చుకుంటే అతన్ని అమెరికా పంపగలరు."

"వీల్లేదు లలితా. కమిటీలో నా ఒక్కడిమాట వల్ల ఏమవుతుంది? మిగతావాళ్ళు ఒప్పుకోవద్దూ?"

"మీ కమిటీ ఎవడిక్కావాలి? మన స్వంత డబ్బుతో ఎందుకు పంపకూడదు?"

రావుగారు తెల్లబోయారు.

"ఏమిటి? మనమా! అతనేం నా కొడుకా, అల్లుడా?"

"కొడుకేమో కాదు. కాని, అల్లుడిగా చేసుకోవచ్చుగా. అబ్బాయి లక్షణంగా ఉన్నాడు. చదువుంది. అతన్ని అల్లుడిగా చేసుకొని ఎందుకు పంపరాదు?"

లలితమ్మ ఆత్రంగా భర్తవేపు చూస్తూఉంది. రావుగారు ఒక నిమిషం స్తబ్దునిలా ఊరుకొని, "వీల్లేదు" అన్నారు.

"ఏం? ఇందిరకు తగినవాడు కాదా అతడు?"

# వెండి మబ్బు

రావుగారు అనునయంగా, "నువ్వు తొందర పడుతున్నావ్ లలితా! మన మతన్ని ఇప్పుడే చూస్తున్నాం. ముఖంచూసి మోసపోరాదు. నాకుమాత్రం అతనికి ఇందిర నివ్వటం ఏమాత్రం ఇష్టంలేదు" అన్నారు.

"ఏం?"

"మన ఇందిరకు తగినవాడు కాడతడు."

తాను సూచించిన వరుడు ఆయనకు నచ్చలేదని తెలిసి, కొంచెం అసహనంతో,

"మీ కూతురు సర్వగుణ సంపన్నురాలా?"

"నా కూతురేనా? నీ కూతురుకూడా అది" నవ్వారు రావుగారు.

లలితమ్మ చిఱునవ్వుతో, "నాకుమాత్రం ఆ అబ్బాయి నచ్చాడు"

"నాకు నచ్చలేదు."

"పెళ్ళిచేసుకోబోయేది మీరు కాదుగా! మీ కూతురు!"

"అమాటే నీకూ అన్వయిస్తుంది!"

రాము: నాన్న ఎందుకే అంత సేపటినుంచీ పాడుతున్నాడు?

తల్లి : చెల్లాయిని నిద్రపుచ్చుతున్నారు బాబూ!

రాము : అదా సంగతి. నేనే చెల్లాయినైతేఎప్పుడో కళ్లు రెండూ గట్టిగామూసుకునిపడుకునేవాణ్ణి.

ఎస్. నారాయణరావు (కాకినాడ)

ఇద్దరూ నవ్వుకున్నారు. వాకిట్లో నీడ కనిపించింది. వెనువెంటనే ఇందిర చేతిలో కత్తితో ప్రవేశించింది.

"ఎక్కడికి వెడుతున్నావ్, తోటలోకా?"

"అవును."

"భోజనాలకు ఆలస్యమవుతుంది. పుట్టయ్య తోటకు వెళ్తాడులే. నువ్వు వెళ్ళక్కర్లా. మోహన్ ఊరికి వెళ్ళిపోతున్నారు. ఆకులు వేద్దువుగాని పద" అన్నారు లలితమ్మ.

ఇందిర ఏమీ అర్థంకాక, ఆశ్చర్యంతో విప్పారిన కళ్ళతో తల్లివేపుచూస్తూ నిలుచుంది. తల్లిమాటలు విచిత్రంగా తోచాయి. ప్రశ్నార్థకంగా తండ్రివేపు చూసింది ఇందిర. ఆయన మాటలాడకుండా నవ్వి వెళ్ళిపోయారు.

రావుగారు వెళ్ళిపోయాక లలితమ్మ కూతురిదగ్గరకువచ్చి, "ఇందిరా, తలదువ్వుకొని వేరే చీర కట్టుకో" అన్నారు.

"తల దువ్వుకున్నా."

"ఏం దువ్వుకొన్నావో, అంతా చెదరిపోయింది. చీరకూడ మార్చెయ్. ఆ నీలం ధర్మావరం చీర...."

"తల దువ్వుకొంటాగాని చీరమాత్రం మార్చను" అంది ఇందిర ఖచ్చితంగా.

కూతురు మొండితనంలో తనకేమీ తీసిపోదని తల్లికి తెలుసు. తల దువ్వుకున్నాక, రెండు మందార పూలు తలలో తురిమింది.

రావుగారు, మోహన్, పుట్టయ్య భోజనాలకు కూర్చున్నారు. లలితమ్మ పర్యవేక్షణలో వడ్డన జరుగుతూ ఉంది. వంటవాడు వడ్డిస్తూఉంటె, ఇందిర చేత నీళ్ళు, నెయ్యి పంపిస్తూఉంది ఆమె. ఆరోజు తల్లితీరు విచిత్రంగా కనిపించింది ఇందిరకు. కాని మాట్లాడకుండా చెప్పినట్టు నడచుకుంది.

భోజనాలయ్యాయి. ఇంటిముందు కారాగిఉంది. మోహన్ అందరివద్దా శలవు పుచ్చుకొని, కార్లో కూర్చున్నాడు.

అతని వాడిన ముఖంవంకచూసి, రావుగారు.

"నేను మళ్ళీ ప్రయత్నిస్తాను. కాని, మీరేమీ ఆశించకండి. లేదంటే మళ్ళీ నిరాశ ఎదురవుతుందేమో!" అన్నారు.

"అలాగే" అని మోహన్ చేతులెత్తి నమస్కరించాడు.

కారు వెళ్ళిపోయింది. ఇందిర జోళ్ళు తొడుక్కొని కత్తి పుచ్చుకొని బయల్దేరింది. రావుగారు, "తోటలోకి నేనూ వస్తున్నా పద" అన్నారు.

తండ్రీ కూతుళ్ళిద్దరూ ఉత్సాహంగా తోటవైపు వెళ్ళిపోయారు.

లలితమ్మ తండ్రీ కూతుళ్ళిద్దరూ ప్రశాంతంగా ఉండటం గమనించి కుపితురాలయింది. తాను మనసులో ఇంత ఆరాటపడుతూంటె, వాళ్ళిద్దరూ నిశ్చింతగా ఉండటం ఆమె కేమీ అర్థంకాలా.

కూతురు పెళ్ళిచెయ్యటానికి తనకున్నంత తొందర ఆయన కేమీలేదు. "మగవాళ్లే ఇంత!" అనుకుంటూ, ఆమె లోపలికి వెళ్ళింది.

అసలు లలితమ్మ చాల పట్టుదల గలది. ఏదైనా విషయం ఆమె మనసులో ప్రవేశిస్తే, ఇహ అది జరిగేవరకు ఆమెకు నిద్రపట్టేదికాదు. ఎందుకోగాని, మోహనుణ్ణి చూసిన వెంటనే అతనే తన కూతురికి తగ్గ వరుడని నిశ్చయించుకుంది. కాని, భర్త తన ఆశాజ్యోతికి చమురుపోసి ప్రోత్సహించకుండా, తటస్థంగా ఉండటం ఆమెను చాలా వ్యథపరిచింది. మళ్ళీ ప్రస్తావించి చూద్దామని తన్ను తానే సమాధాన పరచుకుంది.

మోహనుడు వెళ్ళిపోయిన నాలుగురోజులకే ఆమెకా అవకాశం లభించింది.

చిక్కమగళూరులోఉన్న ఇందిర స్నేహితురాలు, సావిత్రి, తనతమ్ముడి పుట్టినరోజు పండుగకని ఇందిరను పిలవడానికి వచ్చింది. ఇందిరతోబాటు ఏదో పనిమీద పుట్టయ్య కూడా చిక్కమగళూరు వెళ్ళాల్సొచ్చింది.

ఇందిర ఉదయం ఐదింటికే లేచి స్నానంచేసి జడ అల్లుకొంది. లేతఎరుపురంగుచీరకు ముదురు ఎరుపురంగు బార్డరుఉన్న చీర కట్టుకుని, తెల్లపట్టుజాకెట్టు వేసుకుంది. కారుతలుపు సగం తెరచి పుట్టయ్యకోసం ఎదురుచూస్తూ

నిలుచున్న ఇందిరని మెట్లమీద నిల్చున్న లలితమ్మగారు తనివిదీరా చూస్తున్నారు.

కొండమీదనుండి వీచే చల్లనిగాలికి ఇందిర చీర కుచ్చిళ్ళు రెపరెపలాడుతున్నాయ్. సంపూర్ణారోగ్యంవల్ల కాంతివంతమైన ఆమె ముఖానికి పిరెండ అపూర్వ సౌందర్యాన్నిస్తూ ఉంది.

ఇందిర అందగత్తెకాదు. నిజమే. కాని, ఆమె ఒంటివంపులు బేలూరు సుందర శిలాబాలికలను జ్ఞప్తికి తెచ్చేవి. ఆమె హృదయంలోని స్నేహ సముద్రానికి అంతేలేదు. కరుణామయి ఇందిర.

మోహన్ ఐస్త్రీలో ఎంత చక్కటి పిల్లలను చూశాడో ఏమిటో! అతనికి ఇందిర నచ్చుతుందా? ఒక క్షణం తల్లి హృదయం శంకించింది. కాని, మరుక్షణమే ఒక అవ్యక్తమైన భరోసా ఆమె మనస్సుకు స్తిమితం చేకూర్చింది.

"ప్రెజంట్ తీసుకున్నావా?" లలితమ్మగారు కేకవేసి అడిగారు.

ఇందిర తల ఊపి, చేతిలోని సంచిని చూపించింది.

పుట్టయ్యవచ్చి కార్లో కూచోగానే లలితమ్మ, "మీరు కాస్సేపు ఉన్నా ఫరవాలేదు. ఇందిరతోనే రండి" అంది.

కారు కనుమరుగవగానే ఏదో గొప్పపని చేసిన వాళ్ళలాగా నిట్టూర్పు వదలి, లోపలికి వెళ్ళారు లలితమ్మ. రావుగారు అప్పుడే అద్దంముందు కూర్చుని, ముఖక్షౌరకర్మకు ఉపక్రమిస్తున్నారు. లలితమ్మ దగ్గరగా కూర్చుని, "మరీ......" అంటూ ప్రారంభించారు.

"సరే, సరే, ఏం చెప్పాలనుకుంటున్నావో చెప్పేసెయ్. నువ్వు ఇక్కడి కొచ్చినపుడే ఏదో ఉందను కున్నాను."

"ఓ, ఏమైనా సంగతులుంటేనే మీ దగ్గరకు రావాలా, లేకపోతే రాకూడదా ఏం?"

"రాకూడదని కాదుగాని, ఉన్నమాట అన్నాను" అంటూ, ఆమెవైపుచూసి, "ఏం నన్ను అలా చూస్తున్నావు?" అన్నారు.

"మీ ముఖానికి మీసాలుఉంటే ఎలా ఉంటుందో అని చూస్తున్నా."

"నా మీసాలు కూడా నువ్వే పెట్టుకొన్నావుగా చాల్లే. మనిద్దరిలో ఎవరికన్నా ఒకరికే మీసం ఉండాలి. నీకు ఉంది. నాకు లేదు."

"చాలు ఊరుకోండి. ఎవరైనావింటె నవ్వి పోతారు. నేను మగరాయుణ్ణి అని వెక్కిరిస్తారా!" అంటూ విసుక్కుంది లలితమ్మ.

"నేను ఎవరికి భయపడకపోయినా నీకు భయపడాల్సొచ్చింది" అంటూ నవ్వారు రావుగారు.

లలితమ్మ ఓరగా చూస్తూ, "బాగా గుర్తుకు తెచ్చుకోండి. ఈ ఇంట్లో మిమ్మల్ని భయపెట్టే వారు ఇంకెవరూ లేరా?" అన్నారు.

రావుగారు మృదువుగా నవ్వి, "అవును నీకన్నా ఇందిరకు ఎక్కువ భయపడతాను" అన్నారు.

"ఇందిరకు పెళ్ళి చేయరా?"

లలితమ్మగారు ఏ విషయం మాట్లాడాలని వచ్చారో రావుగారికి అర్థమైంది.

"ఆ చెయ్యచ్చులే!" అన్నారు బిగువుగా.

"ఇంకా ఎప్పుడు? ముసలిది అయిపోయాకనా? ఏ వయస్సులో ఆ ముద్దూ, ముచ్చటా ఉండాలి"

"ఈ వయస్సులో నీకేం చెయ్యాలనుంది"

"మనుమణ్ణి ఎత్తుకోవాలని ఉంది"

"నిజం చెప్పు లలితా—నీకు మనుమడిని ఎత్తుకోవాలనుందా? కొడుకుని ఎత్తుకోవాలనుందా?"

"చా ఊరుకోండి, ఇందిర పెళ్ళిసంగతి అడుగుతూంటే!"

"అలాగే, చేద్దాంలే" రావుగారు మాట మార్చడానికి చూశారు.

"మోహన్ ఎందుకు కాకూడదూ అని?"

"నిజం చెప్పాలంటె నా కెందుకో ఇందిరను ఆ అబ్బాయి కివ్వటానికి ఇష్టంలేదు"

"ఏం మోహన్ బాగా లేడా, చదువు తుక్కా?"

"నేను అలా అనలేదే! కాని ఇందిరకు తగిన వాడుకాదు."

"పెళ్ళి చేసుకునేది ఇందిరకాని, మనం కాదుగా. దాన్నే అడిగిచూద్దాం. ఇందిరకు నచ్చితే పెళ్ళి ప్రయత్నం చేద్దాం."

"ఇందిరకు నచ్చకపోతే?"

"ఈ సంగతి ఇక్కడికే వదిలేద్దాం. ఇందిర ఇష్టపడితే?"

"ఇష్టపడితే, సరే అప్పుడు చూద్దాం."

## మేలుకొలుపు

**నాగరాజ్**

లేవేరా! గిరిధారీ
రావేరా! వనమాలీ !!
ఉదయారుణ భానుని
కరకిరణావళికి
పులకించెను రా
ప్రకృతి యంతా॥
విరిసెను తమములు-అర
విరిసెను తమ్ములు
ముకుళింతు వదేలా
మోహన, కనుదమ్ములు॥
గోధన మడవుల
గ్రుమ్మరు వేళరా
గోవుల గావగరారా
గోకుల పాలక॥
రాతిరి యమునకు
రయమున—రమ్మన
వచ్చెనురా—రాధిక
వ్రజవనితల తోడ॥

లలితమ్మగారు మనసులో, "ఇందిర ఒప్పుకొంటుందా? నేను చెప్తే వింటుందా? ఊహు ఇందిర పట్టుదల పిల్ల. కాని, ఒప్పుకోక ఏంచేస్తుంది. అబ్బాయి రాజకుమారుడిలా ఉన్నాడు. తప్పకుండా ఒప్పుకుంటుంది" అనుకున్నారు.

తల్లిదండ్రులు బరువంతా కూతురుమీద మోపి నిశ్చింతులయ్యారు. సాయంత్రం పేరంటం, భోజనం పూర్తయి, ఇందిర ఇల్లుచేరేటప్పటికి రాత్రి పదయింది. పుట్టయ్యకూడా ఉన్నాడు కంగారు పడనవసరంలేదని తెలిసినా, భార్యాభర్త లిద్దరూ లోపలికి వెళ్ళకుండా వరాండాలోనే ఎదురుచూస్తూ కూర్చున్నారు.

"ఎందుకో ఇంత ఆలస్యం? కాస్త పొద్దుండగానే బయలుదేరి రాకూడదూ" మెల్లిగా గొణుక్కున్నారు లలితమ్మ.

దూరంగా కారులైటు కనిపించి మళ్ళీ వచ్చిని చెట్లవెనుకకు మరుగవగానే.

"మన కారే అయిఉండాలి" అంటూ నిశ్చింతగా నిట్టూర్చారు.

కారు ఇంటిముందు ఆగగానే రావుగారు, "ఎందుకింత ఆలస్యం?" అన్నారు.

ఇందిర చిలిపిగా పుట్టయ్యవేపు చూస్తూ, "వీరు చిక్కమగళూరులోఉన్న సత్యమంతా కొన్నది చాలక, బెంగుళూరు వెడుతూంటె బలవంతంగా లాక్కొచ్చాను. లేకపోతె......" అంటూ నవ్వింది.

"భోజనాలే ఆలస్యమయ్యాయి" అన్నారు పుట్టయ్య.

అన్నేళ్ళుగా రావుగారింట్లోఉన్నా, పుట్టయ్య రావుగారి ఎదుట సరదాగా మాటాడటానికి వెనుకాడేవాడు. ఇందిరదగ్గర మాత్రమే అతని చనువు, సరాదాలు.

లలితమ్మగారు కూతురు ఇంట్లోకి రాగానే, "అంతా వైభవంగా జరిగిందా?" అన్నారు.

"ఊఁ" సావిత్రికి నే నిప్పుడు రావటం ఇష్టమే లేదు."

కూతురికళ్ళు అలసట, నిద్రతో బరువుగా కనిపించాయి. తమ మనసులోని సంగతి అప్పుడే అడుగుదామనుకొన్నారుగాని, నిద్రమత్తుతోఉన్న ఇందిర కళ్ళను చూసి, "రేపు అడిగితే సరిపోతుంది" అను కున్నారు.

"అమ్మా, రంగడితో నారింజచెట్లకు ఎరువు వేయుమని చెప్పాను. వేశాడో లేదో" అంది ఆత్రంగా.

ఒక్కక్షణం లలితమ్మగారికి కోపమొచ్చింది. తనేమో ఇందిరపెళ్ళిగురించి బెంగపెట్టుకుంటూ ఉంటే, కూతురు చెట్లకు ఎరువుసంగతి ఆలోచిస్తోంది.

తమ ఇద్దరి ఆలోచనలకూ ఎంత తేడా!

"ఇంక పడుకో పోమ్మా" అన్నారు లలితమ్మగారు. ఇందిర తలలోని పూలు తీస్తూ,వెళ్ళబోయింది. పూలు వెంట్రుకల్లో చిక్కుకుని బాధపడుతూంటె చూసి లలితమ్మగారు,

"ఇలా రావే తల్లి, నేను తీస్తాను. నువ్వు తీసే తీరుకు వెంట్రుకలు ఊడివస్తున్నాయి" అంటూ దగ్గరకువచ్చి చిక్కుపడిన వెంట్రుకల్లోంచి అతి మృదువుగా పూలను విడిపించారు. (సశేషం)

# మానవునూతనదేహస్థితి

**23—వ పేజీ తరువాయి**

మాగ్నెటురాయికి ఉత్తరాగ్రము దక్షిణాగ్రము అని రెండు అగ్రములు వుంటవి. ఉత్తరాగ్రమును అంటుకున్న మేకు మొనకు దక్షిణాగ్ర లక్షణములు ఏర్పడతవి. అల్లాగే ఆమేకు రెండవ కొనకు ఉత్తరాగ్ర లక్షణములు ఏర్పడతవి. మరొక మేకును ఆ అగ్రం వద్దకు తెస్తే ఆ కొత్తమేకులో మళ్లీ దక్షిణాగ్రలక్షణములు ఏర్పడి అది దానిచేత ఆకర్షింపబడి దానితో అతుక్కుంటుంది. పాజిటివ్ కరెంటు పాజిటివ్‌చేత ఆకర్షింపబడదు. రెండు పాజిటివ్‌లమధ్య వైముఖ్యం వుంటుంది. అల్లాగే అయస్కాంతం ఉత్తరాగ్రములమధ్య వైముఖ్యం ఉంటుంది. ప్రాణశక్తి కలిగి, ఆహారం తీసుకుని ఊపిరి పీలుస్తున్నవారిలో జీవకణములు సజీవములుగా ఉంటవి. జీవశక్తివలన ఈ వికృతులు ఏర్పడుతూ వుంటవి. తల్లికడుపులోఉన్న శిశువుకు బొడ్డును అంటివుండే రక్తనాళముల ద్వారా, తల్లి రక్తపరిభ్రమణంతో సంబంధం యేర్పడివుంటుంది. కాని ప్రసవంకాంగానే, బొడ్డు కత్తిరించి వేస్తారు. అంతటితో, ఆహారమూ, ఆక్సిజనూ తల్లినుండిరావడం ఆగిపోతుంది. శిశువు వెంటనే ఏడ్చి గాలి పీల్చుకుంటుంది. ఆ శ్వాసంతో శిశువు శరీరంలో జీవకణములలో విద్యుద్రసాయనిక వికృతులు ఆరంభిస్తవి. అంటే శిశువు స్వతంత్ర "జీవితం" ఆరంభమౌతుంది. బొడ్డు కత్తిరించిన తరవాత మొదటి ఊపిరి పీల్చడానికి ముందర శిశువుశరీరంలో ప్రాణశక్తి వున్నదా? లేక మొదటి శ్వాసక్రియతోనే వాయువుతోపాటు ప్రాణశక్తి ప్రవేశిస్తున్నదా? శిశువుదేహంలో వున్న వివిధాంగములలో వున్న జీవకణములలో, వివిధ రసాయనిక వికృతులనూ ప్రారంభించి, వాటిచేత వివిధ రసములను స్రవింపచేసి, వివిధ విధులనూ నిర్వహింపజేసేశక్తి మొదట పీల్చినగాలిలోనే ఉన్నదా? ఆగాలిలో మనకు తెలిసిన ఆక్సిజనువంటి వస్తువులు మాత్రమే వున్నవా? లేక మనకు తెలియని ఇతర వస్తువు లేమయినా ఉన్నవా? శరీరకార్యక్రమమును సాగించేశక్తి కేవలం గాలికేవుంటే, కొందరు శిశువులు గాలినే పీల్చకుండా మరణిస్తా రెందువల్ల? కొందరు కొంచెంసేపు గాలి పీల్చి కొంతకాలం జరిగాక మరణించడం ఎందువల్ల? బతికితే ఆహారంలో మార్పులూ పరిసరములలో మార్పులూ క్రిమి దోషాది రోగకారణములూ శిశుదేహాన్ని రోగగ్రస్తం చేయవచ్చు. కాని ఆదిలోనే ఈ విపరీతం ఎందువల్ల కలుగుతున్నది? అసలు స్తబ్ధమై యున్న శిశువు ఊపిరితిత్తిలో చలనం కలిగించి, గాలి పీల్చుకునేటట్లు చేసేశక్తి యేది? గర్భాశయంలో వేడి ప్రదేశంనుంచివచ్చిన శిశువు చర్మంలోవున్న స్పర్శేంద్రియం, బయట చల్లనిగాలి తగలంగానే, ఉద్రిక్తమై మెదడును కదిలించి దానిద్వారా ఊపిరి పీల్చేటట్లు చేస్తుందని కొందరి భావన. అయితే ఆపని అందరు శిశువులలోనూ ఎందుకు జరగదు? శరీరకార్యక్రమమంతా అగ్నిశక్తి విద్యుచ్ఛక్తివల్ల కలిగిన సంక్లిష్ట రసాయనిక వికృతులవల్లనని గ్రహించాము. మొదట పీల్చినగాలిలో వుండే ఏవస్తువు ఈ శక్తులను మొదటిమాటు ఉత్పత్తి చేస్తున్నది? ఒకమాటు ఆశక్తి ఒకచోట పుడితే, ఆశక్తినుంచి ఇతర ప్రదేశములన్నీ ఉద్రిక్తములై కార్యకలాపానికి పూనుకోవచ్చును. కాని మొదట ఏ అంగంలో, ఏ ఉపాంగంలో, ఏజాతిజీవకణంలో అందులోవున్న ఏ సూక్ష్మభాగంలో ఈ జీవితకార్యం ప్రప్రథమంగా ప్రారంభించబడుతున్నది? ఈప్రశ్నలకు సరిఅయిన సమాధానములు విజ్ఞానం ఇవ్వగలిగిన స్థితిలో లేదు. మానవుడిబుద్ధికి అందని ఏదో కారణంచేత, శిశువు గాలిఅంటూ పీలిస్తే, అందులో ఆక్సిజను, జీవకణములలోనున్న భాస్వరమును ప్రజ్వలింపగా ధాతుదహనం ఆరంభించడానికి సావకాశం వున్నదని అనుకుంటానికి వీలున్నది. అయితే ఏ కారణంచేత, వివిధవయస్సులవారిలో వివిధ కారణములచేత జీవకణంలో వివిధ భాగములు తమ విధులను నిర్వహించలేక నశిస్తున్నవి? అల్లా నశించకుండా వాటి విద్యుద్రసాయనికశక్తిని చిరకాలం, ఇప్పుడున్నదానికన్నా ఎక్కువకాలం ఉండేటట్లుగా చేయడానికి సాధనము లేమిటి? మంచి గాలీ, మంచి ఆహారమూ, దేహ పరిశ్రమా, టీకాలు వేయించుకోడమూ ఇటువంటివేనా? ఇంకేమయినా ఉన్నవా? ప్రయోగనిర్ధారితములై వైజ్ఞానిక సత్యములుగా ఉద్ఘాటించి చెప్పగల మార్గములు ఉన్నవా? ఈ ప్రశ్నలన్నీ ప్రపంచంలోవున్న మేధావులయిన వైద్యశాస్త్రవేత్తల నందరినీ అనాదినించీ ఎదుర్కొంటూవున్నవే. ఆప్రశ్నలే అతి మేధావిస్ఫురితములయిన యోగుల మేధస్సులనూ కలవరపరచినవి. కాని, ఇదమిత్థమని నిర్ణయించినవారు లేరు. పుట్టేవారు పుడుతున్నారు చచ్చేవాళ్లు చస్తున్నారు. ఆయుర్దాయంలో, దేహపటుత్వంలో, ఇంద్రియపటుత్వంలో విపరీతమయిన వ్యత్యాసములు కనిపిస్తున్నవి. కొందరు అధిమానవశక్తులను ప్రదర్శిస్తున్నారు. కారణంలేని కార్యంలేదు. ఈ వ్యత్యాసాలకు కారణం ఈనాడు మనకు తెలియదు.




రైళ్లలో అనేక రైలుపెట్టెలున్నవి. అందులో అనేక దీపాలూ పంకాలూ ఉన్నవి. వాటినన్నింటినీ తాత్కాలికంగా కలిపే సాధనములున్నవి. ఆసాధనములు ఇంజన్ డ్రైవరుచేతిలో వున్నవి. అతను స్విచ్చి వేయంగానే రైలుపెట్టెల అడుగున ఉన్న బేటరీలు చార్జి అవుతూ పంకాలను త్రిప్పుతూ దీపాలను వెలిగిస్తున్నవి. ఇందులో ఇష్టంలేనివారు ఒక పంకానో, ఒక దీపాన్నో ఆర్పివేసుకుంటున్నారు.

జీవుల శరీరములు ఈ బేటరీలవంటివి. వాటికి బాహిరమైన ఒక శక్తిప్రభావం వాటిమీద ప్రసరించినప్పుడు, అవి అల్పశక్తితో అధికశక్తిని ఉత్పత్తిచేస్తున్నవి. డైనమోనుంచి వచ్చే తీగ ద్వారా బేటరీకి విద్యుచ్ఛక్తి పుడుతున్నది. డైనమోలో రెండు శక్తిసహితములయిన తీగెల కట్టల చలనంతో విద్యుచ్ఛక్తి పుడుతున్నది. డైనమోను ఇంజను ఆడిస్తున్నది. ఇంజను బేటరీకరెంటుతో పోసే పెట్రోలునుండి ఆడుతున్నది. ఇంజనును తోలేవాడు దానిని స్టార్టు చేస్తున్నాడు. వాణ్ణి వాడికి బాహిరమయిన శక్తి ఏదో ఆడిస్తున్నది. ఆ శక్తి ఏది ? ఏ మీడియం ద్వారా అది మనలో ప్రసరిస్తున్నది ? బేటరీలోకి కరెంటు డైనమోలోనుంచి వచ్చినట్లుగా ఆ శక్తికి మరొకచోటనుంచి చలనశక్తి వస్తున్నదా ? లేక అది స్వయంప్రేరితమా ? అసంఖ్యాకజీవులలో ప్రాణశక్తుల సాముదాయికశక్తియే ఆ మూల శక్తి అయివుంటుందా ? ఈ ప్రశ్నలకు సమాధానం దొరికితే, వైద్యవృత్తికి పరమాదర్శమైన మరణనిరోధకార్యం సాధ్యమవుతుంది. జీవులందరూ ఒకరితో ఒకరు, మనకు తెలియని మీడియంద్వారా, మన బుద్ధికందని కారణముల వల్ల పరస్పరసంబంధం కలిగినవారనీ, అన్ని జీవుల జీవితవిశేషములనూ నిర్ణయించేదీ, తానుగా ఏ ఒకశక్తికీ అధీనము కానిదీ అయిన ఆదిశక్తి ఒకటి ఉన్నదని అంగీకరించక తప్పదు. అయితే ఆ శక్తి ప్రసరణకుకూడా వస్తువు కావాలి. ఎంత సూక్ష్మాతిసూక్ష్మమయిన ప్రకృతి విభజనను ఊహించినా, శక్తిశూన్యమయిన రేణువు లేదనీ, రేణురహితమయిన శక్తి ఉండదనీ తేలిపోతుంది. ప్రాణులందరికీ కారణభూతమయిన మూలప్రాణి ఉండితీరాలి. వివిధ మూలవస్తువుల అణువులను పరిశీలిస్తే మూడురకములు కనుపిస్తవి. (1) ఏదో శక్తి ప్రయోగంతో విద్యుద్దీత్యా అస్వస్థములయిపోయేవి (2) దేనితోనూ అస్వస్థములు కానివి (3) తమలో ఉద్భవించే శక్తితోనే తాముగా విభజనపొందేవి. ఆకాశంలో చాలా ఎత్తున ఉండే ఆర్గాన్ నియాన్‌వంటి మూలవస్తువుల అణువులు. విద్యుద్దీత్యా అతి స్వస్థములు. అందుకే వాటికి ఇంగ్లీషులో "ఉదాత్తవాయువులు" (Noble gasses) అని పేరున్నది. రేడియం యురేనియం వంటి మూలవస్తువుల అణువులు అధికప్రసంగశక్తివలన ( Radio-activity ) తాముగానే విచ్ఛిన్నములై విద్యున్మయములయిన సూక్ష్మరేణువులతో ఏర్పడిన కిరణములుగా మారిపోతూ, ఇతర అణువులను చితకగొట్టగల శక్తిగలవిగా ఉన్నవి. మధ్యలో ఉన్న ఇతర అణువులు ఏదో అల్పశక్తిప్రయోగంతో విచ్ఛిన్నమయేవిగా కనుపిస్తవి. అసలు మూలవస్తువు లనుకున్న వాటిలోనే ఈ విభేదం కనుపిస్తున్నది.

ఒక పాఠకుడు "మీరు స్థూలదేహమును గురించి మాత్రమే వ్రాస్తున్నారు. సూక్ష్మదేహమును గురించి వ్రాయడంలేదు" అని ఉత్తరం రాశాడు. మరొక పాఠకుడు నేను వైద్యానికి సంబంధించని విషయాలు వ్రాస్తున్నానని విమర్శిస్తూ సన్నానంగతి గమనించమని ఆదేశించాడు.

వైద్యమంటే ఏమిటి ? వైద్యుడి ఆదర్శమేమిటి ? కడుపునెప్పి వస్తే కార్మినేటివ్ మిక్చరో వాము కషాయమో తాగమనీ, నెమోనియా వస్తే పెన్సిలిన్ ఇంజక్షను తీసుకోమనీ చెప్పడమే వైద్యమా ? అన్ని కడుపులో నెప్పులూ ఈ అన్ని నెమోనియాలూ పైనఉదహరించిన వాటితో పోవు. అసలు నెమోనియా ఎందుకు వస్తున్నదో తెలుసుకుని కొందరిలో ఎందు కది ప్రాణాపాయం కలిగించదో, మరికొందరిలో కలిగిస్తుందో ఊహించడమూ, వ్యాధినివారణకంటె వ్యాధి నిరోధానికి ప్రయత్నించడమూ వైద్యుడికి ఉత్తమాదర్శం. వైద్యవిజ్ఞానం అనేకరకములు అందులో వైజ్ఞానిక వైద్యవిధానమనిపించుకునే అల్లోపతీలో వైద్యవిజ్ఞానం అనేక విజ్ఞానముల కలయికతో ఏర్పడ్డది. వైద్యంతో సంబంధం లేకుండా ఫిజిక్సు, కెమిస్ట్రీ, ఖగోళశాస్త్రం, అఖరికి జ్యోతిశ్శాస్త్రం ఉండవచ్చు. కాని ప్రతి శాస్త్రంతోనో అంతో ఇంతో సంబంధం లేకుండా వైద్యశాస్త్రం ఉండలేదు. వ్యాధి కారణాలు అనేకములు. అందులో కొన్ని మాత్రమే ఈనాడు మనకు తెలుసు. వైద్యశాస్త్రానికి ఒక పరిధి అంటూ లేదు. దాని పరిధి అనుక్షణమూ అధికమవుతున్నది. అధికమవుతున్నకొద్దీ అనేక రకములయిన శాస్త్రవిశేషములను వైద్యం తనలో విలీనం చేసుకుంటున్నది. వైజ్ఞానికవైద్యం ప్రయోగనిర్ధారితములయిన సత్యములమీద ఆధారపడి ఉన్నది. ప్రయోగానికి ముందు ఏదీ ప్రయోగనిర్ధారితమైన సత్యం కాదు. ప్రయోగం లేకుండా అది సాధ్యమూకాదు. మనకు బాగా తెలిసిన వాటినిబట్టి ఆ ప్రయోగం ప్రమాదకరమని తోచినప్పుడుతప్ప ఉపయోగకరమని తోచిన ప్రతి ప్రయోగాన్నీ చేసి, సత్యాసత్యనిర్ణయం చేయక తప్పదు. "మానింది మందు. మాన్పినవాడు వైద్యుడు" కాని ఏ మందు ఏరోగాన్ని ఎందుకు ఎల్లా మాన్పుతున్నదో తెలిసినవాడు ఉత్తమ వైద్యుడు.

"మీరు చెప్పిన డాక్టరు దగ్గరకు నిన్న వెళ్ళాను."
"నేను పంపానని చెప్పావా?"
"ఆహా! చెప్పాను."
"ఏమన్నాడేమిటి?"
"డబ్బు ముందే ఇమ్మన్నాడు."
పి. రాజేశ్వరరావు (అనకాపల్లి)

పరిమితములయిన నా పరిస్థితులలో, అపరిమితమైన ఆసక్తితో, కృషితో, పరిశీలనతో నేను తెలుసుకున్న విషయములను నాదేశీయులకు నా మాతృభాషలో నాకు చేతనయినంత వివరంగా తేలికగా తెలియజేయడం ఈ వ్యాసరచనలో నా ఏకైకాదర్శం. తేలుకుట్టితే బాధపడేవాడిని మంత్రంపెట్టి బాధలేకుండా చేయగలవాడు నాదృష్టిలో ఉత్తమోత్తమమయిన వైద్యుడు. ఏదో సకృతుగా కాకుండా, ప్రయోగించబడినప్పుడల్లా నికరమయిన ఫలితములను కలిగించిన ప్రతి చికిత్సావిధానమును బుద్ధిమంతులు హర్షించి, గౌరవించి, అర్థంచేసుకుంటానికి ప్రయత్నించడం అవసరం. కార్యకారణవిచారణతో పరిశీలించుకుంటూ పోతే, వైద్యవిజ్ఞానపరిధిలోనికి రాని శాస్త్రమే ఉండదు. ఎవరెంత తెలుసుకోవాలో నిర్ణయించే కొలబద్ద ఏదీ లేదు. అనేక లక్షల మంది పాఠకులలో విజ్ఞానాభిరుచి అనేక్తి ఒకే రకంగా ఉండదు. దేహధర్మములను తెలుసుకునే కుతూహలం ఉన్నవారిదగ్గరనుంచి ఈ వ్యాసములు కలిగించే విజ్ఞానానికి సమగ్రమయిన ఔషధ విజ్ఞానం జోడించుకుంటే సాధారణవ్యాధులను ఔషధములద్వారా నివారించగల శక్తి కలిగేటంత సవివరంగా ఈ వ్యాసములు వ్రాయాలని నా కోరిక. నా జీవితకాలంలో ఔషధేతరములయిన మార్గాలతో, ప్రసిద్ధవైద్యులుకూడా నివారించలేని వ్యాధులను నివారించినవారి నెందరినో నేను చూచాను. అది సకృతుగా ఏర్పడిన సంఘటన కాదు. అల్లా ప్రత్యక్షనిదర్శనములు కనిపించినప్పుడు దానిని పరిశీలించడం, అర్థంచేసుకుంటానికి ప్రయత్నించడం, ఉచితమైనప్పుడు ఉపయోగించడం, అవైజ్ఞానికలక్షణం కాదు. సైన్సు ఆదర్శం సత్యాన్వేషణ. సత్యములయినవన్నీ విజ్ఞానపరిధిలోకి రావలసిందే. కారణములు తెలియని కారణంచేత సత్యం సత్యంకాకపోదు. ప్రాచీనమయిన కారణంచేతా, అంతరించిపోయిన కారణంచేతా, ప్రాచీన వైద్యవిధానములు విసర్జనీయములూ కావు.

జీవకణపరిశీలన సామాన్యమయింది కాదు. శ్రద్ధగా, అందులో జరిగే కార్యక్రమాన్ని అర్థం చేసుకుంటే జీవి శరీరాన్నేకాదు, జీవితాన్నే అర్థంచేసుకోగల శక్తి వస్తుంది. జీవకణ విజ్ఞానం అణువిజ్ఞానం పెరిగినతరవాత అమోఘంగా పెరిగిపోతున్నది. ఆధునిక విజ్ఞానవిధానముల ద్వారా పరిశీలించినప్పుడు ప్రాచీనవిజ్ఞానం అద్భుతకృత బయటపడుతున్నది.

శుక్లశోణితములలో ఉండే జీవకణముల సంయోగంతో పిండం యేర్పడుతున్నది. అది విభజన పొంది కోటానుకోట్ల జీవకణములుగా వృద్ధిచెంది అంగోపాంగసహితమయిన కోశవిభేదం పొందుతున్నది. జీవకణంనుంచి జీవకణం పుడుతున్నది. అది పటికబెల్లంముక్క విరగకొడితే రెండు పటికబెల్లంముక్కలు కావడంవంటిది కాదు. జీవకణవిభజన అతి సంక్లిష్టమయిన కార్యక్రమం. ఆ విభజనలోనే మూల జీవకణంనుంచి పంచుకున్న జీవకణవిభాగాములద్వారా అనేక జన్మలక్షణములూ, జాతి లక్షణములూ కొన్ని రోగములకు ఆస్పదం కలిగించే దేహలక్షణములూ సంక్రమిస్తవి. ఆ విషయములుకూడా వివరించిన తరువాత జీర్ణకోశవ్యాధులు చర్చిస్తాను. ★

'ఆంధ్రసచిత్ర వారపత్రిక'లో ప్రచురణకు ఇండియన్ ఇంక్ తో వేసిన కార్టూనులు మాత్రమే పంపాలి. సాధారణంగా 4"×2", 4"×4" చిత్రాలు పత్రికలో పడుతూ ఉంటాయి.



# విడీ విడని చిక్కులు

16-వ పేజీ తరువాయి

భుజంమీద ఒక్కటి చరిచేడు మిత్రరత్నాన్ని.

"ఎక్స్యూజ్ మీ .... సారీ ! .... నీకు తెలియబర్చలేకపోయాను .... అంతా ఓ కథ .... మొత్తానికి నా మ్యారేజి అయ్యింది. పిల్లల్లేరు నీ దయవల్ల."

"అచ్ఛా ! పోనీ యిప్పుడేనా చెప్పావ్ ! .... పద పద కాఫీ పోయించు" సూర్యం దారితీసేడు.

జగన్నాథం సూర్యాన్ని భుజంమీద చెయ్యివేసి అనుసరించేడు.

"నాకు కాఫీ పోయించు చాలు" సూర్యం మిత్రుడికేసి పరిశీలనగా, అతగాడిలో ఏమేమి మార్పులొచ్చేయా అన్నట్లు చూసేడు.

"నో .... నో .... మనం స్వీట్. హాట్ ఇత్యాదులు తిందాం .... ఎందుకంటే బోలెడు ఉదంతం చెప్పాలి నీకు .... " అని బేరర్ వేపు తిరిగి 'రెండు జహంగీర్ తెమ్మ" న్నాడు.

"నాది వర్ణాంతర వివాహం .... " చెప్పసాగేడు జగన్నాథం.

సూర్యం ఉలిక్కిపడి, శ్రద్ధగా వినడానికి ఆయత్తమయ్యేడు.

"ఇంకేం .... కంగ్రాచ్యులేషన్సు! సంఘ సంస్కారం చేసేవ్‌రా జగూ !" అన్నాడు సూర్యం.

"నా మొహం .... సంఘసంస్కారం దేశోద్ధరణకోసరం కాదు యీ ఏడుపంతా .... నాకోసరమేను.లేదా...నా వైఫ్ కోసరమూనూ...." నవ్వేడు జగన్నాథం.

మిత్రుడు తనమాటలని కెటువంటి శ్రద్ధాసక్తులు చూపించుతున్నాడోనని పరిశీలించి "నీకు తెలుసుగా మా శశిరేఖదీ నాదీ కాలేజీపరిచయమని', అన్నాడు మళ్ళీ.

"ఔను .... శశిరేఖ ? యేస్,... యేస్, డిబేట్లమ్మాయి కదూ !" అని శశిరేఖను గుర్తించి, అంతలో "సారీ యిప్పుడు "మిసెస్ జగూ కదూ" అంటూ సర్దుకున్నాడు.

"మానాన్న ఎంత సంప్రదాయం, ఆచారం, కులం ఇత్యాదుల్ని పాటిస్తాడో నువ్వెరుగుదువుగా?"

ఒక జహంగీరుముక్కని కొరికేడు జగన్నాథం.

"ఎరక్కపోవడ మేమిటి ? నిప్పులు కడుక్కుంటూ రాయన" సూర్యం అందించేడు.

"ఆపిల్ల నాయుళ్ళమ్మాయి ! నా కర్మకాలి నాకు హైద్రాబాద్‌లో ఉద్యోగం అయ్యింది. అక్కడ ఈ అమ్మాయి ఎం. ఏ లో జాయినయ్యింది...."

"అచ్ఛా !" మిత్రుని మధ్యలోనే అందుకుని "ఇంకేం .... పబ్లిక్ గార్డెన్స్, నవాబు పార్కు .... టాంకు బండూ ఇత్యాదులు మీ సొత్తు అయ్యేయి" అన్నాడు సూర్యం.

"అంతేకాదు .... మా నాన్న నాకు "తనకొడుకుని కానని, స్నానం చేసేసేనని ఉత్తరంముక్క రాసి పడేసేడు కూడాను."

"నేను మొదట ఇంటికి వెళ్ళేను....అమ్మ ఒకటే ఏడుపూ .... నాన్న నా మొహం కూడా చూడలేదు. తిరిగి హైద్రాబాద్ వెళ్ళిపోయేను.

బేరర్‌తో "రెండు ప్లేట్ పకోడీ తే" మని రెండు క్షణాలు ఊరుకున్నాడు జగన్నాథం.

"నువ్వు ఖచ్చితంగా ఆ అమ్మాయిని పెళ్ళి చేసుకుంటానని చెప్పేవ్ ?" సూర్యం ప్రశ్న వేసేడు.

"మరి దానిగొంతు కొయ్యమన్నావా ?.... ఇంకా నిను .... జరిగి పదినెలలు కావస్తున్నది గనుక ఇలా మాటాడుతున్నాను గాని అప్పుడు ఘోరున వారం రోజులు యేడ్చే ననుకో ...."

సూర్యం అతగాడిమీద సానుభూతిచూపులు బరిపేడు.

"నేను అప్పుడు తిరిగి వెళ్ళేసరికి శశిరేఖ మాయమయ్యింది."

సూర్యం పకోడీ నోట వేసుకుంటున్నవాడు ఉలిక్కిపడ్డాడు.

"వాళ్ళ నాన్న ఒక సర్కిల్ యిన్‌స్పెక్టర్‌కిచ్చేస్తానని తాంబూలాలు గట్టా పుచ్చుకున్నాడట .... చూడు, ఎన్ని తిప్పలు పడ్డానో" జగన్నాథం కథలో ఉత్కంఠ పోషిస్తున్నాడు.

"పాపం సర్కిల్ ఇన్‌స్పెక్టరితో పోటీ" అని తలపూపేడు సూర్యం.

"శశిరేఖ మొదట చదువు మానేసింది. తర్వాత నా రూంకి వచ్చేసింది..... "

"తర్వాత" క్లయిమాక్సులో సినిమారీలు తెగిపోతే ఎలా ఉంటుంది ? అలాగుంది సూర్యం సంగతి.

"నేను రిజిష్టర్ మారేజీ చేసుకుని .... కాపురం పెట్టేను .... "

"రెండు కాఫీ తే .... బిల్లు నాకివ్వు" బేరర్ కేసి తిరిగి చెప్పేడు సూర్యం.

"అయితే మీ నాన్నగారు, వాళ్ళ వాళ్ళూ, ఈ రెండు కుటుంబాలూ దూరం అయినట్లే నన్న మాట....?"

జగన్నాథం మొహమంతా గంభీరత అలుముకుంది.

"ఏం చేస్తాంరా భాయ్ ! అంతవరకు వచ్చేకా నవ్వులపాలు అవుతామా ? .... మా అమ్మని చూద్దామని మా ఊరు వెళ్ళేను .... " అన్నాడు జగన్నాథం

"మీ నాన్నగారి కోపం తగ్గిందా ?"

"సరిసరి .... కంటబడితే కాలరాసేస్తాడు .... నీకు తెలీదేమో మా నాన్నది చచ్చుకోపం .... రక్తం తాగేస్తాడు."

కాఫీ తాగడం మొదలెట్టేడు జగన్నాథం.

"దొంగతనంగా మా అమ్మని చూసి మా చెల్లాయికి చీరె కొనిపెట్టి వస్తున్నా .... "

బిల్ తీసుకుని నిలబడ్డాడు జగన్నాథం.

"మొత్తానికి హీరో నయ్యేవ్" సూర్యం భుజం తట్టేడు.

"ఏం హీరోనో..."నీకు నీవారూ,నాకు నావారూ, లేరూ" అన్న బ్రతుకయ్యింది..... అదీగాక మా చెల్లాయికి కుదిరిన సమ్మంధం కాస్తా దీంతో చెదిరిపోయింది."

సూర్యం ఉత్సాహం చెరిగిపోయింది. ఆఖరి విషయం అత న్నెందుకో కలవరపరిచింది. "మన దేశంలో ఆడపిల్లని చేసుకుందికీ, గవర్నమెంటు

ఉద్యోగం వచ్చిందికి ఇంత రాద్ధాంతం అవుతుం దెందుకోయ్ ?" అన్నాడు.

"ఎవర్నడుగుతావ్....?"—

సూర్యం "జెగూ! మాయింటికిరావూ" అన్నాడు మిత్రునిచెయ్యి పట్టిలాగుతూ.

"ఎందుకురాను? కాని జాతి భ్రష్టుణ్ణంటే నీకు మాయింట బడితే పూజ తప్పదుగా" అంటూ నవ్వేడు జగన్నాథం.

"నో.. నో.... మా బామ్మ వాండ్రఫుల్ మనిష్మ" సూర్యంచెప్పేడు.

"ఇంకోసారి. ఇప్పుడు ట్రయినుకు వేళ య్యింది.... అదినరేగాని మావూరు అంటే హైదరా బాద్ వస్తే మాయింటికి వస్తావా?"

"ఛీ! నోర్మూయ్! ఎవడేనా వింటే నవ్వుతాడు. మాయింటికి కాపోతే మరెక్కడికి వెడతానూ?..... శాఖాహారం వండాలిసుమా" సూర్యం నొచ్చు కున్నట్లు మాటాడి అంతలో నవ్వేశాడు.

"సరిసరి. నా బ్రాహ్మణ్యం పోయిందిగాని అలవాట్లు మారలేదురోయ్! నేను మా ఒదినా కూడా వచ్చి శాఖాహారులం....."

"అయితే మరీమంచిది..."

సూర్యం, జగన్నాథం చాలా కలసిమెలసి తిరిగిన మిత్రులేమో విడిపోతున్నప్పుడు ఇద్దరూ చలించి పోయారు.

"నీ పెళ్ళికి పిలూ!"

సూర్యానికి జెగన్నాథం వీడ్కోలుకేక.

"కుటుంబ సమేతంగారా" అని సూర్యం చెయ్యి ఊపేడు.

## 27

సూర్యం దారంట నడుస్తున్నాడేగాని మనస్సు పరిపరివిధాల పోసాగింది.

జగన్నాథాన్ని మెచ్చుకున్నాడు. కాని అతనిమీద జాలికూడా పడకండా వుండలేకపోయేడు.

జగన్నాథం చెల్లెలిపెళ్లి చెదిరిపోయిందంటే కించపడ్డాడు.

ఆ కుటుంబంలో ఎవరు ఏపనిచేసినా అది ఆడకూతురి మెడని చుట్టుకుంటుందన్నమాట. అయితే సత్సంప్రదాయానికి ఈ రకపు కొలత బద్దలున్నంతకాలం, కంచుకాగడావేసి వెదికినా యేదో వకలోపం లేని కుటుంబా లుంటాయా? అని తల పోసేడు.

అతను కాలుస్తున్నది మూడో సిగరెట్టు. "జగన్నాథం మొత్తానికి సమాజాన్ని ధిక్కరించేడు" అని గొణుక్కున్నాడు.

కాని "యిది సమాజానికి సంబంధించిన సమస్యా?" అన్న అనుమానం తల యెత్తిందత గాడిలో.

"కేవలం ఇది వ్యక్తిగత మయినది.... యీ పెళ్లి వలని సుఖంవచ్చినా, కష్టం వచ్చినా, జగన్నాథం అనుభవిస్తాడు.... అతగాడి సంతతికి రేపటిసమా జంలో రాగల గౌరవప్రతిపత్తులగురించి....అతగాడే యిబ్బంది పడతాడు."

మరి?

"ఐతే తల్లికీ తండ్రికీ .... మమతలకీ అన్నిం టికీ దూరం అయ్యేడు మరి."

సూర్యానికి తనదా రవాన్యాన్ని ఇదంచ నట్లని పించింది.

గాలీ, వెల్తురూ, చీకటిలాంటి పరోక్షమైన ప్రభావమే సమాజానికీ వ్యవస్థకీ, వ్యక్తిమీద వున్నదనిపించింది.

పరధ్యానంలో అతను ఇంటిమెట్లు యెక్కుతూ కూడా సిగరెట్టు పీలుస్తున్నాడు.

"అరె! మాష్టారూ" అని బయటికి వెడుతున్న నిర్మల ప్రక్కకి ఒదిగింది.

సూర్యానికి సిగరెట్ నోటినుండి రాలిపోయింది. ఈ ప్రపంచంలో పడ్డాడు.

దొంగతనం చేస్తూ దొరికి పోయిన దొంగలాగ బెదిరిపోయేడు.

"పాఠం ఇవాళ ఆలస్యం అయ్యిందికదూ" అన్నాడు. తమాయించుకొని ముందుకువెడుతూనే.

"ఫర్వాలేదు.... ఎవరో బంధువు లొచ్చారు.... అన్నది నిర్మల తనూపనిమీద వెడుతున్నట్లు నటించి!

"అయ్యో! సూర్యం బాబూ! మా మేనమావ గారు వాళ్ళూ వచ్చేరు. నువ్వింకా ఎరుగవు కాబోలు! ఔనులే ఎలా తెలుస్తుంది.... ఇదేగా ఆఫీసునుంచి రావడం" అంటూ నిరంజనంగారి విధవప్పచెల్లెలు వచ్చింది. అక్కడికి

ఆవిడ ముసుగు సవరించుకుని నిర్మలకేసి ముళ్లకంచెలాగ చూసి వెళిపోయింది.

"చచ్చేమే"...అప్రయత్నంగా వెలువడ్డ యీ మాటలు సూర్యం నోటివెంట.....

* * *

తన ఇంట్లోకి వెళిపోయే సూర్యానికి రాజ్యలక్ష్మి వాళ్ల వాటావేపునుండి లలితాంబ కేకలు వినిపించేయి. అటువెడదామా అని రెండు క్షణాలు నించుని తిరిగి మనసు మార్చుకుని ఇంట్లోకి అడుగుపెట్టేడు.

వరండాలో. మేనమామ జయరావు కుర్చీలోనూ, నరసమ్మగారు పీటమీదా, మరో ఇరవై సంవత్సరాలలోపు ప్రాయంవుండే అమ్మాయి చాప మీద కూచుని ఇతగాడి రాకకే ఎదురుచూస్తున్న ట్లుంది.

"రా! రా! సూర్యం" అంది బామ్మ.

"రావోయ్ రా! ఇవాళ లేటయ్యిందే? మేం మధ్యాహ్నం బండిలో వచ్చేం.." అన్నాడు జయరావు గారు.

ఆ అమ్మాయి మడిచిన పాట్లాంతో కూచుని, తెల్లనిచీర పాదాలమీదికి లాక్కొని, ఓసారి తల యెత్తి సూర్యాన్ని చూసింది. మళ్లీ తలదించు కుంది.....

సూర్యం విస్తుపోయి చూడ్డం రెండుక్షణాలే అయినా నరసమ్మగారు కలిగించుకుని.

"అయ్యో! అదేమిట్రా అలా చూస్తావు? అది మీనాక్షి...." అన్నది.

సూర్యానికి నవ్వొచ్చింది ఆ పరిచయానికి, "మీనాక్షో, చకోరాక్షో ! యెవరైతేనేం, తన కేమవుతుందీ ?" అని తనలో తను నవ్వుకున్నాడు.

అది గ్రహించినట్లు జయరావుగారు "మా అమ్మాయి బి. య్యే పరీక్ష రాసిం" దని చెప్పేడు.

"ఆహా !" అని సూర్యం తనగదిలోకి వెళ్ళి పోయేడు.

"నేనలా పనిమీద పోయి, ఓ గంటలో వస్తా" నని అదివరకు నిర్ణయించుకున్నప్రకారమే జయ రావుగారు లేచి బయటికి వెళ్లిపోయేడు.

"లేవే, పిల్లా .... వాడికి కాఫీ యిద్దువుగానీ ..." అంది నరసమ్మగారు లేస్తూ, మీనాక్షిని అధికార పూర్వకమైన స్వరంతో.

మీనాక్షి చాపచుడుతూ ఉండగా, రాజ్యలక్ష్మి



తచ్చింది. కొత్తమనిషిని చూసి సిగ్గుతో కుంచించుకు పోయింది.

ఆపిల్ల అంతవరకూ యేడ్చిందికాబోలు కన్నీటిచారలు కట్టేయి. జుట్టు విరగబోసుకునుంది. నుదుట కుంకుమ చెరిగిపోయింది. ముక్కుమీద కాస్త నిలిచింది.—దుస్తులు నలిగి ఓణీ నడుం దగ్గర జారిపోయింది.

మీనాక్షి ఆపిల్ల పడుతున్న అవస్థను గమనించనట్లు పరిశీలనగా చూసింది.

వెళ్లిపోబోతున్న రాజ్యలక్ష్మిని నరసమ్మగారు కేకవేసింది.

"అయ్యో ! అదేమిటే రాజూ ! ఏం కావాలే ? ఏం జరిగిందే ? ఆ వేషమేమిటి ? ఆ జుట్టేమిటే ?" అని.

"పిన్ని పిండిజల్లెడ ఇమ్మంది" రాజ్యలక్ష్మి తల దించుకుని నించుంది.

సూర్యం గాభరాగా ఇవతలికి వచ్చేడు. అతని కళ్లల్లో ఆందోళన స్పష్టంగా అగుపిస్తోంది.

నరసమ్మగారు రాజ్యలక్ష్మి తల నిమిరింది. "అదో గొడ్డు ! కోపమొచ్చిందా ఒళ్లూపై తెలీదు!" అన్నది. లలితాంబ నుద్దేశించి.

"ఆఁ ! నీ మనుమరాలు మాత్రం యేం తక్కువదా ? ఏం చేసిందో" నన్నాడు హాస్యధోరణిలో సూర్యం.

అన్నాడేగాని రాజ్యలక్ష్మివాలకం అతని గుండెల్లో కలవరపాటు కలిగించింది. బాధను దాచేటందుకు వెదుక్కున్నాడు.

పిండిజల్లెడ తీసుకుని వెళ్లిపోయింది రాజ్యలక్ష్మి.

"రెండుజడలు కావాలిట! ... పానిముండా ? ఇది సంసారా ?" అన్న కేకలు నూతి దగ్గర లలితాంబ ముమ్మారు వేసింది.

"అయ్యో ! పిల్లలు, తల్లీ వాళ్లూ ! కాలధర్మం అన్నారు .... ఈ రోజుల్లో అందరికి "ఫాషన్లు" మరీ మితిమీరిపోయేయి .... అదిగాక ఈ "పాడుముండా సినిమా" లొచ్చేయి" అంటూ సుభద్రమ్మగారు అందుకుంది.

"ఆఁ మరేం? కాలధర్మమే .... వెధవముండలు కొప్పులు ముడుచుకుంటున్నారు .... కన్నెపిల్లలు రోడ్లమీద విరగపడుతున్నారు .... నే నొప్పను .... అట్టే వాగిందంటే గుండు గీయించేస్తాను" అంటూ నృత్యసరళిలో చిందులుత్రొక్కి బిందె ఎత్తుకుంది లలితాంబ.

రెండుజడలు వేసుకున్నందుకు చావబాదిందని తెలిసినప్పుడు సూర్యం విలవిల్లాడిపోయేడు.

"అయ్యో రాజూ ! ఎంతపని చేసేను" అని ముమ్మారు గొణుక్కున్నాడు.

మీనాక్షి వచ్చి అక్కడ నించోడం అతగాడు చూడలేదు.

మీనాక్షి, ఎర్రంచు తెల్లగ్లాస్కోచీర కట్టుకుంది. రెండేసి గాజులు వేసుకుంది. మెడలో ఒంటిపేట గొలుసు ఉన్నది. చెవులకి నక్షత్రాలు. ముక్కు బోసిగా ఉంది ..... అత్యంత సరళంగా ముస్తాబయ్యింది. జెడ ఒదులుగా అల్లుకుని రిబ్బను కట్టకండా ఒదిలేసింది.

నాగరికతా, నాజూకుతనం ఆమె నించున్న తీరులో మూర్తీభవించి ఉన్నాయి. సూర్యాన్ని భయంచేత గాక, చనువులేమి, బెరుకుగా చూస్తూ నించుంది.

# విడీ విడని చిక్కులు

సూర్యందగ్గర కాఫీకప్పు తెమ్మని నరసమ్మగారి హుకుమ్ !

సూర్యం కాఫీ తాగి కప్పు వట్టే పట్టుకుని ఆలోచిస్తున్నాడు. మీనాక్షి ఇరుకున పడ్డది.

సూర్యం ఉలిక్కిపడ్డాడు. "ఓ ! సారీ ! కూచోండి" అన్నాడు లేచి నిలబడి. కప్పు బల్లమీద ఉంచేడు.

మీనాక్షి నవ్వేసింది.

కప్పు తీసుకుని వెళ్లిపోయింది ఆమె నడకతీరును సూర్యం కళ్లంతలేసిచేసి చూసేడు.

రాత్రి జయరావు వచ్చి "అమ్మా ! అత్తగారూ ! నేనీ రాత్రి ఉండిపోవాలి తప్పదు" అన్నాడు లౌక్యంగా.

---

కోర్టులో విచారణ జరుగుతోంది. సాక్షి ప్రతి ప్రశ్నకూ 'అని అనుకుంటాను' కలుపుతూ సమాధానం చెబుతున్నాడు. ఈ సమాధానాలు వినివిని విసిగిపోయిన న్యాయవాది "మీకు తెలిసిందేదో చెప్పండి. మీరే మనుకుంటున్నారో కోర్టుకు అనవసరం" అని కసిరాడు.

"ఏమీ అనుకోకుండా చెప్పడానికి నేనేవన్నా న్యాయవాదినిటండీ!" సాక్షి తాపీగా సమాధాన మిచ్చాడు.

ఎ. రామప్రసాద్ (మద్రాసు)

---

నరసమ్మగారు "ఎంతమాట .... అసలు మీనాక్షిని ఓ వారంరోజు లుంచమని చెబుతున్నా" నంది నవ్వుతూ.

"అది సరేనండీ ! దానికి అక్కడ కొంత యేవో స్వంతపనులున్నాయ్, అంటే చదువుకున్నదేమో ఫ్రెండ్సూ అదీ అన్నమాట .... సరేలెండి నేనీ రాత్రి బండిలో ఇక్కణ్ణే ఉన్న గూడెం వెడతా... చాలా జరూరు. ఉదయం అయిదోగంటకి వస్తా" నన్నాడు జయరావుగారు.

"నీ యిష్టమొచ్చినప్పుడు రా .... నీ కూతురు పూచీ నాదీ ...." వెటకారంచేసింది నరసమ్మగారు.

మీనాక్షి సూర్యంగదిలో పుస్తకాలు తిరగేస్తూ కూచుంది.

తండ్రి వెళ్లిపోతూ ఆమెకి చెప్పి "రేపు ఉదయం వెళ్లిపోదాం .... మళ్లీ వద్దాం .... నీ బావని చూస్తానన్నావ్‌గదాని తీసికొచ్చే నన్నా"డు జనాంతికంగా.

మీనాక్షి తండ్రిమాటలను హర్షించలేనంత చిరాగ్గా చూసింది. తనేం చంటిపిల్లా ? బావేం ఆటబొమ్మా !" అనుకుంది.

*    *    *

రాత్రి భోజనాలవేళ మీనాక్షికీ, సూర్యానికీ చనువు ఏర్పడింది. నరసమ్మగారు ఇద్దర్నీ చివాట్లువేసి ఏకవచనప్రయోగం నేర్పింది.

అసలు తెలుగునాట, బావా మరదళ్ల చనువూ ఏకవచనప్రయోగం, వ్యాకరణసూత్రంలాంటిది. ఇట్టే అలవడింది వాళ్లకీనూ.

"అయ్యో ! మరీ రెండుమెతుకులేనే పిల్లా ? నీతిండి ? ఇలా అయితే రేపు బాగా ఆదా చేస్తావన్నమాట." నరసమ్మగారు మీనాక్షివిస్తట్లో మరింత అన్నం వడ్డించింది.

"లావెక్కిపోతానని బెంగ కాబోలు" నన్నాడు సూర్యం.

"కాదు నీ ఆర్జన దివాళాతీస్తుందని బెంగ" అంది మీనాక్షి !

మొత్తానికి మీనాక్షి అన్నం పిసికిపిసికి పారేసింది.

"అయితే బియ్యేలో నీ సబ్జక్టు యేమిటి ?" సూర్యం అడిగేడు.

"లిటేచరు ...."

"ఐ సీ ...." ఇద్దరూ మౌనంగా ఉన్నారు.

"తర్వాత యేం చేస్తావు ?"

సూర్యం నిశ్శబ్దాన్ని భంగపరిచేడు.

"క్లాసు వస్తే ఎమ్మే చదువుతా." మీనాక్షి యధాలాపంగా పుస్తకం పేజీలు తిరగేస్తూ జవాబు చెప్పింది.

"మీకు మర్చంటాఫ్ వెనిసు డ్రామా ఉందా ?"

"లేదు కాని .... దానిని మేం ఇంటర్‌లో చదువుకున్నాం." మీనాక్షి అతనికేసి చూసింది. నిజంగా అతగాడికి ఆ షేక్స్‌పియర్ డ్రామా ప్రసక్తి అవసరమా ? లేక తనని పరీక్షిస్తున్నాడా అని అనుమానంపడ్డది.

"నాకు దాని నోట్సు ఉంటే పంపు ? కావాలి.. "ఒథెల్లో కూడాను ...." అన్నాడు సూర్యం.

"సరె" నంది మీనాక్షి "ఎందుకు" అన్న ప్రశ్నకి ఆమె పెదవులు విడలేదు.

తర్వాత ఆ ఇద్దరి సంభాషణా సినిమాలమీదికీ వాటిదగ్గర్నుంచి కాలేజీలమీదికీ దారితీసింది.

ఆ ఇద్దరిమధ్య అభిప్రాయభేదాలు కొన్ని ఉన్నా ఇద్దరూ వాటిని పెంచి పెద్దవిచేసుకోలేదు. ఒకరి పరిచయంకోసరం ఒకరు మొహమాటంగా తాత్కాలికంగా తమతమ వాదాలను త్రుంచేసుకున్నారు.

ఒకమ్మాయి అబ్బాయి కబుర్లు చెప్పుకుంటూ ఉంటే గడియారాలు అక్కసుగా తెగ పరిగెడతాయి.

"పదకొండున్న రయ్యిందిరా బాబూ"అన్న నరసమ్మగారి కేకతో, ఇద్దరూ పడకలకి వెళ్లిపోయేరు.

ఇద్దరికీ నిద్ర పట్టలేదు. మీనాక్షికి సూర్యం ఒక్కటే తలంపు కాని, సూర్యానికి ఆవేళ ఊపిరి సలపనన్ని ఆలోచనలు.

సాయంత్రం జగన్నాథం — ఆతర్వాత నిర్మలా, నిరంజనంగారి విధవప్ప చెల్లెలూ.... ఆవిడ్ని చూస్తేనే సూర్యానికి ఎంచేతో అదోరకమయిన భయం. తర్వాత రాజ్యలక్ష్మి ఉదంతం—ఆనక మీనాక్షి పరిచయం... ఇత్యాదులు—

(సశేషం)

# సినిమా వార్తలు

13—వ పేజీ తరువాయి

1842 లో జర్నల్ డే డిబట్స్‌లో సీరియల్‌గా యూజినీ సుయి రచించిన నవల ఆధారంగా తయారయ్యే ఈ చిత్రంలో జీన్ మారియస్, జిల్‌హవర్త్, డానీ రాబిన్, రేమండ్ పెల్లెగ్రిన్, పియర్రీమాండీ పాల్గొంటున్నారు.

## ఇండో-సోవియట్ చిత్రం

భారత రష్యాలు కలసి "ఎ టేల్ ఆఫ్ టు హార్ట్స్" అన్న చిత్రం నిర్మిస్తున్నాయి. బొంబాయి, తాష్కెంట్, హిందీ, రష్యన్ ద్విభాషా చిత్రానికి ఆధారం 17 వ శతాబ్దపు కవిమీర్జా బెదిల్ పర్షియన్ కవిత ఆధారం.

బొంబాయి ఫిల్మాలయాలో తయారయ్యే ఈ హిందీ భాషా చిత్రంలో సాయిరాబాను, జాయ్‌ముఖర్జీ, ప్రముఖ భూమికలు ధరిస్తున్నారు. దర్శకుడు: రోనోముఖర్జీ, హిందీ చిత్రకథ: సర్దార్ జఫ్రీ, రోనో ముఖర్జీ.

ప్రముఖ పాత్రలు ఇంకా నిర్ణయంకాని రష్యన్ భాషా చిత్రం తాష్కెంట్ ఉజ్బెక్ ఫిల్మ్ స్టూడియోలో తయారౌతుంది. దర్శకుడు కామిల్ యార్మటోవ్. చిత్రకథ: యస్. రషిదోవ్, వి. విట్కోవిచ్.

చిత్రం ఆగస్టులో సెట్సుకు వెళ్తుందిట.

## చెకొస్లొవాకియా ఉత్తమ చలన చిత్రాలు

జూలియస్ ప్యుసిక్ రచించిన "రక్తాక్షరాలు" ఆధునిక చెక్ సారస్వతంలో అత్యంత ప్రఖ్యాతిగాంచిన గ్రంథం. ద్వితీయ ప్రపంచయుద్ధంలో నాజీలను ప్రతిఘటించి పోరాడడంలో కమ్యూనిస్టులు చూపిన ధైర్యసాహసాలగాథ ఇది.

చలనచిత్ర దర్శకుడు జిరోస్లావ్ బాలిక్ ఈ గ్రంథాన్ని ఆధారంగా చేసుకుని వైడ్‌స్క్రీన్ చిత్రం నిర్మిస్తున్నారు.

రచయిత జాన్ ఓట్‌సెనాసెక్‌తో కలసి దర్శకుడు జిరోస్లావ్ బాలిక్ ఈ చిత్రానికి స్క్రిప్టు వ్రాశారు. ఇల్యారాసెక్ ప్రధానపాత్ర నటిస్తున్నారు.

## 'స్లింగర్ల్'

యువదర్శకుడు కారెల్ కాచినా నిర్మించిన చిత్రాలలో "స్లింగర్ల్" అనే చిత్రం పేర్కొనదగినది. ఈ చిత్రంలో దర్శకుడు ఒక బాలిక కళ్లతో యుద్ధాన్ని దర్శించి, యుద్ధం మానవతకు ఎంత విరుద్ధమైనదో స్పష్టం చేస్తాడు. ఈ దర్శకుడు ఈ మధ్యనే కొత్తగా నిర్మించిన "బాధ" అనే చిత్రానికి కూడా యోర్గా కోటర్‌బోవా అనే ఈ బాలికనే ఎంచుకున్నారు; చిత్రంలో కోటర్‌బోవా దర్శకుని భావాలను అతిసహజంగా మనసుకు హత్తుకునేటట్టు తన నటనలో వ్యక్తంచేసింది.

ఈ చిత్రంలో దర్శకుడు కారెల్ కాచినా అనేక అవుట్‌డోర్ దృశ్యాలలో చెకొస్లొవాక్ గ్రామ



సారథిస్టూడియోచిత్రం 'ఆత్మబంధువు'లో మోహన, రామారావు.

సీమల సౌందర్యాన్ని ప్రేక్షకులకు చూపిస్తున్నారు. చిత్రమంతా నిర్మలమూ, నిరాడంబరమూ అయిన శైలిలో ఉంటుందిట.

## "గడ్డిలో కుందేళ్లు"

మానవుని ఆత్మసంఘర్షణ అనే ఇతివృత్తం పాతదే అయినప్పటికీ మంచి నాటకీయతతోకూడిన కథగా వాక్లావ్ గజెర్ దర్శకత్వాన చిత్రించబడింది. ప్రధానపాత్ర అయిన మార్టిన్ అనే స్కూలు పిల్లవాడిలో ఈ ఆత్మ సంఘర్షణను చిత్రించడంవల్ల ఈ నాటకీయత మరీ ఆకర్షణీయమైంది. ఈ పాత్రను మిసాకోబ్లిక్ అనే బాలుడు నటించాడు. ఒటా హాఫ్‌మన్ ఈచిత్రానికి స్క్రిప్టు వ్రాశారు.

## చెక్ గ్రామసీమలు

"జననం 21 లో", "ఎ. ఓముక్ చేసిన నేరం", "ఏడవఖండం" వంటి చిత్రాలను నిర్మించిన దర్శకుడు వాచస్లావ్ గజెర్ ఇటీవల ఒక ఉత్తమ చిత్రాన్ని నిర్మించారు. ఈ చిత్రంలో బాలనటుడు మిసాకోబ్లిక్ అతి సహజంగా, అద్భుతంగా నటించాడు. ఈ చిత్రంలో ప్రప్రథమంగా పేర్కొనదగిన విషయమిది.



యం. యం. వారి 'అన్నగింతలు'లో జగ్గయ్య, జమున

తెలుగు పత్రికలన్నిటితోనూ ఆంధ్రసచిత్ర వారపత్రిక సర్క్యులేషన్ అత్యధికమైనది.




అతి త్వరితముగా సందేశం అందజేసే ఈ పద్ధతికి మీరు చేయవలసిందల్లా మీ సందేశం అందవలసిన వ్యక్తి పేరు, 'టి.ఎఫ్' అని ముందు వ్రాసిన టెలిఫోను నంబరూ (ఈ టి.ఎఫ్ అన్నది ఒక్కమాటగానే లెక్కపెడతారు), టెలిగ్రాం ఆఫీసు పేరూ వ్రాయాలి.

సుబ్బారావు
టీ.ఎఫ్ 31670
న్యూ ఢిల్లీ

టెలిఫోనుద్వారా కూడా మీరు టెలిగ్రాములు పంపే ఏర్పాటు వుంది. ఫోనోగ్రామ్స్ విభాగానికి టెలిఫోనుచేసి తద్వారా మీ టెలిగ్రాములను పంపించండి.

**మీకు ఇతోధికంగా సేవచేయడానికి మాతోసహకరించండి**

తంతి తపాలా శాఖ

DA 62/132

# సినిమా వార్తలు

## డిసికా చిత్రంలో అవార్డు విజేతలు

ఈయేటి ఉత్తమ నటీ నటులుగా అకాడమీ బహుమతులు పొందిన సోఫియా లోరెన్, మాక్సి మిలియన్‌షెల్, రోమ్‌లో విట్టోరియో డిసికా దర్శకత్వాన తయారయ్యే 'ది కండెమ్డ్ ఆఫ్ అల్టోనా' లో నటించబోతున్నారు.

జీన్—పాల్ రచన ఆధారంగా తయారయ్యే ఈ చిత్రంలో ఫ్రెడిక్‌మార్చ్, అనౌక్‌ఎయిమీ, రాబర్ట్ వాగ్నర్ కూడా నటిస్తున్నారు. నిర్మాత: కార్లోపాంటి చిత్రకథ: అబ్బీమాన్, ఇటాలియను కవి సిజరే జావాట్టోనిని.

## 'ది ఓల్డ్ డార్క్ హవుస్'

ప్రముఖ బ్రిటిష్ నవలాకారుడు జె. బి. ప్రీస్ట్లీ రచన "ది వోల్డ్ డార్క్ హవుస్" చలన చిత్రంగా రూపొందబోతోంది.

అమెరికాలోని 'భయానక' చిత్ర నిపుణుడు విలియమ్ కాజిల్, బ్రిటిష్ నిపుణుడు జేమ్స్ కార్రె రాస్ కలిసి పనిచేస్తున్న ఈ చిత్రం కేవలం భయానకంగా ఉండదని వీలైనంత హాస్య భరితంగా దని చేయాలని నిర్మాతల సంకల్పంట.

ఈ చిత్రాంతానికి పాత్రల్లో ముగ్గురుతప్ప అంతా చచ్చిపోతారట. అందువల్ల ఇది భయానకంగా ఉంటుంది.

లండన్ బ్రేస్టూడియోలో తయారౌతున్న ఈ చిత్రంలో సినీ—నాటక రంగ నటుడు, నాటక కర్త రాబర్ట్ మోర్లే, జోసీ గ్రెన్‌ఫెల్, పీటర్ బుల్, మెర్విన్‌జోన్స్, ఫెనెల్లా ఫీల్డింగ్ పాల్గొంటున్నారు.



మహశక్తివారి 'కలిమిలేములు'లో కృష్ణకుమారి

## బైబిల్‌పై చిత్రం

నిర్మాత డినో డి లోరెన్‌టిస్ 'బైబిల్' అంతటినీ ఆధారంగా భారీఎత్తున చలనచిత్రం తీయబోతున్నారు. సుమారు 1 కోటి పౌండ్లు ఖర్చయ్యే అంచనాగల ఈ చిత్రం రోమ్‌లో నిర్మిస్తారట. ఈ చిత్రానికి ప్రఖ్యాత బ్రిటిష్ కవి—నాటకకర్త క్రిస్టోఫర్ ఫ్రై చిత్రకథ వ్రాస్తున్నారు. ఈయన బెన్‌హర్‌కు వ్రాసిన చిత్రకథ రాయల్ సొసైటీ ఆఫ్ లిటరేచర్ అవార్డు పొందింది.

## టెన్ కమాండ్‌మెంట్సు

ప్రఖ్యాత దర్శకుడు జూలియన్‌డు వి. లియద్ (సెలెన్ డెఫ్లిసిన్స్) త్వరలో 'ది డెవిల్ అండ్ ది టెన్ కమాండ్‌మెంట్స్' అనే చిత్రం తయారు చేయబోతున్నాడు. ఇందులో దయ్యంపాత్ర చాలా తక్కువట. దేవుని భూమికను ఫ్రెంచి హాస్యనటుడు ఫెర్నాండెల్ ధరిస్తున్నాడు. ఈ చిత్రంలో అలియన్ డెలాన్, డానియల్లె డారియల్స్, జార్జి విల్సన్ మాడలైనె రాబిన్‌సన్, జీన్‌క్లాడ్ బ్రియాలె నాయల్ రోక్వేవర్ట్, హెన్రీ టి. పోట్, రోజర్ నికొలస్ తదితరులు పాల్గొంటున్నారు.

# హిందీ చిత్రజగత్

## నూత్నచిత్రం 'హంకదం'

ఉనియరా ప్రొడక్షన్స్‌వారి పై చిత్రానికి బొంబాయి మోహన్ స్టూడియోలో ముహూర్తం జరిగింది. ధర్మేందర్, నందా, బాలరాజ్ సహాని, సులోచనా, మృదులా, సజన్, హెలెన్ పాల్గొంటున్న ఈ చిత్రం, సంగీతం రోషన్, పాటలు: మజ్రూ సుల్తాన్‌పురీ, చిత్రకథ, సంభాషణలు: భానూప్రతాప్, ఛాయ:అపూర్వ భట్టాచార్య, కళ: సుధేందురాయ్, దర్శకత్వం:బిరేన్ త్రిపాఠీ, నిర్మాత: గణపత్ మధూర్.

## దూర్ గగన్

కిశోర్ ఫిలింస్ 'దూర్ గగన్‌కి ఛాహోంమే' చిత్రానికిగాను కుమావూన్, దహిసార్, భందలిలీ, ఆప్త ప్రాంతాలలోకొన్ని ఔట్‌డోర్ దృశ్యాలు చిత్రీకరించారు. ఈ చిత్రానికి నిర్మాత, దర్శకుడు, చిత్ర కథకుడు, సంగీత దర్శకుడు: కిశోర్‌కుమార్. సంభాషణలు రమేష్‌పంతు, పాటలు శైలేంద్ర.

## కణ్ కణ్ మే భగవాన్

రూపకళాసంస్థ నిర్మిస్తున్న పై పేరిటి చిత్రానికిగాను రెండు పాటలు రికార్డు చేశారు.

అనితాగుహ, మహీపాల్, ప్రకాశ్, రాజావానే మారుతి పాల్గొంటున్న ఈ చిత్రంకు కథ:వి. పాండే, పండిత్ మధుర్, సి. కె. మస్త్, యస్. యం. అబ్బాస్, పాటలు:భరత్ వ్యాస్, సంగీతం: శివరామ్, దర్శకుడు: బాబూభాయ్ మిస్త్రీ.



## బాలయోగి

ఆదివారపుపేటను ఇప్పుడు ఎరుగనివారుండరు. ఈ గ్రామం ద్రాక్షారామానికి మైలు దూరంలో ఉంది. 27 ఏళ్ళకు పూర్వం బాలయోగి ఇక్కడే ఒక పేదకుటుంబంలో జన్మించారు.

బాలయోగి అసలు పేరు సత్రాజు. 13 ఏళ్ళ క్రితం అతడొక రోజున పిల్లలతో కలసి గోదావరి కాలువలో ఈదులాడుతుండగా ఈశ్వరసాక్షాత్కారం జరిగి సమాధిగతుడయ్యాడు. ఆ సమాధి 12 సంవత్సరాల అనంతరం పరిసమాప్తమైంది.

సమాధిగతులుగా ఉన్నప్పుడు ప్రాగిశాభిముఖంగా నాలుగేళ్ళు, ఉత్తర దిశాభిముఖంగా రెండేళ్ళు, పశ్చిమదిశాభిముఖంగా తొమ్మిదిమాసాలు, దక్షిణ దిశాభిముఖంగా ఒక సంవత్సరం బాలయోగి తపస్సు చేశారు. అటుతరువాత మరికొన్ని సంవత్సరాలు మళ్లీ ప్రాగ్దిశాభిముఖంగా తపస్సు కొనసాగించి దిక్‌సిద్ధి పొందారు. 1954 నుంచి కొన్ని ఏళ్ళపాటు మౌనముద్ర, నిరాహారదీక్ష పూనారు. కేవలం వాయుభుక్కులుగా నేఉండి తపస్సు కొనసాగించారు.

వేలాదిజనం బాలయోగిని దర్శించడానికి ఆదివారపుపేట వస్తూ ఉంటారు. ఇదివరలో వారి దర్శనం సంకొక్కమారే లభ్యమయ్యేది. ఇటీవల ఆశ్రమంలో ప్రతిసక్రవారం భజన కార్యక్రమాలు ఏర్పాటు అవుతున్నాయి. బాలయోగి ఈ కార్యక్రమాలలో వాల్గొని లీలలు ప్రదర్శిస్తున్నారు. ద్వాదశవర్ష సమాధి అనంతరం బాలయోగి ఇప్పుడిప్పుడే మానవాళికి సందేశాలు ఇస్తున్నారు.



ఎం. నరసింహం (కాకినాడ)

**తెలుగు పత్రికలన్నిటిలోనూ ఆంధ్రసచిత్ర వారపత్రిక సర్క్యులేషన్ అత్యధికమైనది!**

# సరాగమాల

15-వ పేజీ తరువాయి

సహజంగా వాటి పొగడ్త వుండకమానదు. అంత మాత్రమున ప్రతి పాటను పొగడదనని యిబ్బంగి విలాపనింద నాపై మోపుట కడు ధూర్తము. కాదా మాధవీ!

* * *

ఆ మధ్య కళాప్రపూర్ణవారి ఆఫీసుకి వెళ్ళాను. పారుతీస్తున్న "ఇరుగుపొరుగు" చిత్రంలో కొన్నిపాటలు, మాస్టర్ వేణు కృతులు, విన్నాను. అందులో "మబ్బుల చాటున చంద్రునిలా, పొద మాటున దాగిన చినవాడు" భలే చలాకీగా వుంది. దీనికి కారణం పాడిన ఎల్లారీశ్వరి, పాటవ్రాసిన ఆరుద్ర. చిత్రీకరణ బాలయ్య గిరిజలపై హుషారుగా జరిగిందని విన్నాను. ఈచిత్రం ఆగస్టు ప్రాంతాలలో విడుదల కావచ్చు. రికార్డులు అదే సమయానికి వస్తాయి.

* * *

"దక్షయజ్ఞం" చిత్రంలో సంగీతం మన సమీక్షకులు వ్రాసినట్లు "రసాలూరు"తూనే వుంది. పి. లీల పాడిన భక్తిగీతం "నీపాద సంసేవ దయసేయవా, నిజభక్త మందార సదశివ" అన్నది శ్రోతలను చిక్కని శాస్త్రీయ బాణీల కమ్మ తెమ్మెరలలో తేలించి, యమని రాగచ్ఛాయలలో లాలించి పరవశులను జేస్తుంది. లలితంగా, మధుర రసభరితంగా, పై పాటకన్నా కాస్త త్వరితంగా ప్రజాదరణ పొందగలిగేవి సుశీలపాడిన రెండు పాటలు "కమనీయం కైలాసం", "కోయిలా తెలుసవటే" అన్నవి.

ఉన్న రెండు యుగళగీతాలు సోషలుసినిమాలో నాయికా నాయకులు మెరీనా బీచి వెంట సైకిళ్ళు త్రొక్కుతూ, తక్కుతూ తారుతూ పాడవలసినవి చంద్రుడు నక్షత్రాలు పాడిన సన్నివేశం కోసం రచయితా, సంగీత దర్శకులు కూర్చొని ఫక్తు శాస్త్రీయ పద్ధతిని ఒక 'నక్షత్రరాగ మాలిక చేసివుంటే యెంత లక్షణంగా వుండేది?

ఇందులో ఒక శాస్త్రీయ గీతంవుంది. కాని ఆపాట తయారింపులో స్వరాల తాళింపు, దరువుల దంపు ఎక్కువై సాహిత్య మేళవింపు కుదరలేదు. ఈ పాటకు నాట్యంకూడా అంతంతమాత్రంగానే వుంది.

మొదట చెప్పుకున్న మూడు పాటలకు ఆరుద్ర సాహిత్యం ఆనందాయిగా అంత్యానుప్రాసలదీవిగా, అందాలప్రోవుగా వుంది. ఈ మూడుపాటలే చిత్రంలో, పంకమునున్న పంకజాలలాగ విమల కాంతు లీనుతూ వున్నాయి.

ఈవి రికార్డుగా వచ్చేసరికి మరోరెండు నెల లవుతాయి. శ్రీ రాజరాజేశ్వరి దయ! ★

# రాళ్లూ - రత్నాలూ

8 వ పేజీ తరువాయి

పేటల సైకిలుగొలుసు ఆమె ఎక్కస్థలాన్ని అంటిపెట్టుకుని ఉంది. ఈ నగలతో ఆనాడు మరింత శోభాయమానంగా మనోహరంగా ఉన్న భార్య ఆకృతిని చూసి కుమారస్వామి ముగ్ధుడై ఉండవలసిందే. కాని అతడు ఎందుచేతనో ఖిన్నుడై విచారంతో తల దించుకున్నాడు.

శ్రీదేవి అతని గడ్డాన్ని మునివ్రేళ్లతో పట్టుకుని పైకెత్తుతూ గోముగా "చూశారూ! చూశారూ! మీరలా తల దించుకుంటే నాకెంత బాధగా ఉంటుందో ఆలోచించారా?" అన్నది. తర్వాత అతనిపక్కనే కూర్చుని అతని తలను ఒళ్లోకి తీసుకుంటూ "ఇవి గిల్టునగలనే కదూ మీ బాధ? మరేం చెయ్యగలం చెప్పండి? వీటికే పాతిక రూపాయలు ధారపోశాం. అన్నయ్య పెళ్లి ఇలా అర్ధంతరంగా ఒచ్చింది కాబట్టి గాని .... లేకపోతే ఈ దండగకూడా ఎందుకు? ఇలా చూడండి .... పొద్దున్న ఎప్పుడో తిని వెళ్లిన అన్నం .... లేచి స్నానం చెయ్యండి ముందు .... నేను కలిపి పెడతానుట .... మీరేమో వేలు కొరక్కుండా తినాలిట .... ఊఁ!" అన్నది.

అతడు లేచి కూర్చున్నాడు. శ్రీదేవి నీళ్లు తోడేందుకు పెరటిలోకి వెళ్లింది. కుమారస్వామి ఒకసారి నిట్టూర్చి అలాగే పరధ్యానంగా కూర్చున్నాడు. పిచ్చి శ్రీదేవి! కాపురానికి వచ్చి నాలుగేళ్లయినా ఒంటిమీద చిన్నమెత్తు నగ అయినా లేకుండా అలాగే ఉంది. పెళ్లిలో ఆమె తండ్రి కూడా ఆమెకు నగలేమీ పెట్టలేదు .... రెండు జతల గాజులు మాత్రం ఉంటే తనకు ఉద్యోగం లేనన్నినాళ్లూ గడవటంకోసం వాటిని తెగ నమ్ముకోవలసివచ్చింది. శ్రీదేవి తండ్రికి పెద్ద ఆడపిల్లలమీద ఉన్న మక్కువ అందరికన్నా చిన్నదయిన శ్రీదేవిమీద లేదు! 'పుట్టగానే తల్లిని చంపింద'ని మాటిమాటికీ తిడుతూ ఆమెపట్ల అసహ్యభావాన్ని పెంచుకున్నాడాయన. వెదికి వెదికి కుమారస్వామివంటి చదువూ సంపాదనాలేని అసమర్థుడికి అంటగట్టి తనబాధ్యత ఒదిలిపోయిం దనుకున్నాడు.

కుమారస్వామికి బంగారు దుకాణాల మధ్య ఉన్న 'ధర్మకాటా' దగ్గర ఉద్యోగం. ఉదయం తొమ్మిదిగంటలనుంచీ రాత్రి ఎనిమిది గంటల దాకా, లగ్గసరిరోజులయితే మరికాస్త పొద్దుపోయేదాకా అతడు 'ధర్మకాటా' ముందే కూర్చుని ఉండాలి .... వెండినీ, బంగారునీ, ఎన్నో రకాల వస్తువులు ఎంతెంతో విలువగలవి తూకం కోసం అతనిదగ్గరికి వస్తాయి. అన్నింటినీ, చిన్నా పెద్దా అని లేకుండా ఓపికగా వెంట్రుకవాసి అయినా తేడా లేకుండా సున్నితపు త్రాసులో ఉంచి తూచి పంపిస్తాడు కుమారస్వామి.

శ్రీదేవి లోపలినుంచి ఒస్తూ 'ఇంకా అలాగే కూర్చున్నారా? .... లేవండి" అన్నది. కుమారస్వామి లేచి పెరట్లోకి వెళ్లి భార్యచెంత నిలబడి చెంబుతో నీళ్లు అందిస్తూ ఉండగా స్నానం చేశాడు .... తర్వాత వొళ్లు తుడుచుకుని లుంగీ చుట్టుకుని భోజనానికి కూర్చున్నాడు. అతని

ముందు పింగాణీకంచంలో అన్నమూ, పచ్చడి ఉన్నాయి. శ్రీదేవి కంచం దగ్గరికి లాక్కుని కలిపి ముద్దలు పెడుతూవుంటే ఆ పచ్చడిమెతుకులే అమృతోపమానంగా కనిపించాయి.

కుమారస్వామి తిండి ముగించి పెరట్లో మంచం వాల్చుకుని పడుకున్నాడు. తర్వాత దాదాపు పదినిముషాలలో శ్రీదేవికూడా పని అంతా ముగించుకుని తలుపులన్నీ వేసి వచ్చింది. కుమారస్వామి పడుకునివున్న మంచంపక్కనే చాప పరుచుకుని కూర్చుంటూ 'వీటికీ అసలు బంగారు నగలకూ ఏమీ తేడా ఉన్నట్టే కనబడదు. కదండీ?' అని అడిగింది. కుమారస్వామి నవ్వి "భలేదానివే. అనుభవం ఉన్నవాళ్లకు మొదటిచూపులోనే తెలిసిపోతుంది. ఏమీ తెలియనివారికి దాని అసలు సంగతి తెలియడం కష్టమే" అన్నాడు. శ్రీదేవి 'రేపు పెళ్లిలో బయటపడకుండా వుంటే అంతే చాలు ....' అన్నది పడుకుంటూ ....

ఆమె తర్వాత కొద్దినిముషాలలోనే నిద్ర పోయింది. కుమారస్వామి వెన్నెలలో చంద్ర బింబాన్ని ధిక్కరిస్తున్న భార్య ముఖాన్ని చూస్తూ అలాగే పడుకున్నాడు. అతనికి దాదాపు పదిహేను రోజులక్రిందట జరిగిన విషయం గుర్తుకు వచ్చింది.

వారున్న ఇంటికి ఉత్తరదిశగా మేడలో జడ్జీగా లోకాయన ఉన్నాడు. ఆయన భార్యకు నగలంటే విపరీతమైన అభిమానం .... పిల్లలేమో లేరు.... లంకంత ఆ ఇంట్లో భార్యాభర్తలిద్దరే ఉండే వారు. భర్త భోజనంచేసి కోర్టుకు వెళ్లిపోయిన తర్వాత ఆమె కేమీ తోచేదికాదు. ఒక్కొక్కనాడు బంగారు దుకాణాలు చూసివద్దామని బుద్ధి పుట్ట గానే నౌకరును కేకవేసి కారు సిద్ధంచేయించ మని చెప్పి చేతి కందినంత డబ్బు అందుకుని బజారుకు వెళ్లిపోయేది. ఆమెకు తమ ఇంటిప్రక్కన చిన్నపూరింట్లో ఉన్న కుమారస్వామి దంపతు లంటే అవ్యాజమైన అభిమానం. క్రొత్తగా బదిలీ యి ఆ యింట్లో దిగిననాడే ఆమెను పక్క యింటి పెరటిలో కలనేతరంగుచీర కట్టుకుని లేడి ళ్లతో అమాయకమైన చూపులతో తనవైపు చూస్తున్న శ్రీదేవి ఆకర్షించింది. తర్వాత చాలా ర్లు మధ్యాహ్నంపూట ఏమీ తోచనప్పుడు వా ద్దరూ పెరటిగోడపక్కన చెట్టునీడలో లబడి కబుర్లు చెప్పుకునేవారు. శ్రీదేవికి ఆమెను చూస్తే ఆశ్చర్యంగా ఉండేది. ఆమె ధగధగలాడే ళ్ల ఆభరణాలు కొన్నాళ్లూ, తళతళలాడే కేవలం బంగారువస్తువులు కొన్నాళ్లూ ధరించేది. మొత్తా కి అన్నీ కళ్లు జిగేలుమనిపించే నగలే ....

ఒకనాడు సాయంకాలం జడ్జీగారి భార్య పెరటి డమీదినుంచి శ్రీదేవిని పిలిచి 'నే నిప్పుడే బంగారుదుకాణానికి వెళ్లి వస్తున్నాను. మా రికి ఒక ఉంగరం కొందామని వెళ్లాను. మీ ఆయన కంవేసేచోట కూర్చుని ఉన్నాడు. అతనికి క్కడ ఉద్యోగమా ?' అని అడిగింది.

శ్రీదేవినుదుట పడుతున్న ముంగురులను పైకి నుకుంటూ "అవునట....నే నెప్పుడూ అక్కడికి ల్లలేదు" అన్నది.

జడ్జీగారి భార్య నవ్వి "భలేపిల్లవే నువ్వు .... రేపు నేను మళ్లీ వెడుతున్నాను. మావారికి ఆ ఉంగరం నచ్చలేదు. దాన్నిమార్చి మరొకటి తీసుకురావాలి .... రేపు నువ్వుకూడా రా నాతో పాటు ...." అన్నది.

శ్రీదేవి అప్పు డేమీ మాట్లాడలేదుగాని రాత్రి కుమారస్వామి భోజనం చేస్తూవుండగా అతని అనుమతి లేకుండా వెళ్లడ మెలాగా అని సందే హించింది. అలా చేస్తే అతనికి కోపం రావచ్చు నేమో కూడా. అందువల్ల తీరా ఆమె బయలు దేరేసమయానికి 'రాను పొమ్మం'టే సరిపోతుంది లెమ్మనుకున్నది..... కాని మర్నాడు మధ్యాహ్నం ఎండ పూర్తిగా వాటారకుండానే జడ్జీగారి భార్య జరజరమని శబ్దంచేసే పట్టుచీర కట్టుకుని వసుస్తూనే వచ్చి 'ఏంపిల్లా ? ఇంకా ఏం చేస్తు న్నావు ? త్వరగా బయలుదేరు. కారుకూడా సిద్ధంగా ఉంది ....' అన్నది. శ్రీదేవి చాప వేయ బోయింది. ఆమె వారించి "ఇప్పుడు చాపలెందుకు పరుస్తావు ? త్వరగా చీరె మార్చుకుని బయ ల్దేరు" అన్నది. శ్రీదేవి అనుమానిస్తూ "ఇప్పుడు నేనుకూడా ఎందుకు పిన్నిగారూ ? మీరు వెళ్లి రారాదూ ? పైగా మావారికి ఏమీ చెప్పలేదు కూడా ...." అన్నది. ఆమె నవ్వి " అదా నీభయం? ఏం ఫరవాలేదులే.... ఆ అబ్బాయేమీ కఠోరకుడు కాదులే .... ఊఁ ! త్వరగా కానివ్వు ...." అని తొందర చేసింది. శ్రీదేవికి తప్పలేదు. ఆమె లోప లికి వెళ్లి తాను కట్టుకునివున్న చీరనే మళ్లీ సరిగా కట్టుకుని ముందుగదిలోకి వచ్చింది. ఆ పూరింటి నాలుగు మూలలూ చూస్తూ కూర్చున్న జడ్జీగారి భార్య శ్రీదేవివైపు జాలికలిసిన చూపులతో చిత్రంగా చూసి లేచి బయలుదేరింది. ఇద్దరూ కారులో బంగారుదుకాణాలకు వెళ్లారు. ఒక పెద్ద దుకాణంముందు కారు ఆగగానే ఇద్దరూ దిగి ఒకవ్యక్తి దోవ చూపిస్తూవుండగా లోపలికి నడిచారు. అది చాలా పెద్దదుకాణం. అద్దాల షోకేసులలో రకరకాలైన నగలు ఉన్నాయి. ఒక వైపు వెండివస్తువులు ఉన్నాయి. హాలులో ఎటు చూసినా తళతళలే. చూసేందుకు రెండు కళ్లు చాలవనిపించింది. వారు జడ్జీగారిభార్య రాగానే ఎంతో గౌరవంగా భక్తిశ్రద్ధలతో ప్రవర్తిం చారు. ఆమె క్రిందటిరోజు కొన్న ఉంగరం తన భర్తకు నచ్చలేదని చెప్పి మిగిలిన రకాలు కూడా చూపించమన్నది. ఆమాట నోటినుంచి రావడమే తడవుగా డజన్లకొద్దీ ఉంగరాలున్న పెట్టెలు లెక్క లేనన్ని వారిముందు ఉంచబడ్డాయి. శ్రీదేవి కళ్లు చెదిరిపోయాయి. అన్ని ఉంగరాలూ ధగధగలాడుతూ అద్భుతంగా ఉన్నాయి. అన్ని నిగనిగలాడుతూ కాంతులీనుతున్నాయి. వాటిలో ఒక్క ఉంగరాన్ని ఎన్నికచెయ్యడ మెంత కష్టం ? జడ్జీగారి భార్య మాత్రం ఆరితేరిన పరీక్షకురాలివలె అన్నింటినీ పరిశీ లించి చూసి ఒక ఉంగరాన్ని ఎన్నికచేసింది. దాన్ని ఒక కుర్రవాడు తీసుకొని ముందు నడుస్తూ ఉండగా ఇద్దరూ కొంచెం దూరంలో ఉన్న 'అర్మకాటా' దగ్గరికి వెళ్లారు .... అది ఒక చిన్న

# రాళ్ళూ - రత్నాలూ

గది .... అక్కడ ఒక రిద్దరు మనుషులు తప్ప అప్పుడు మరెవరూ లేరు .... గదిమూల గాలిచొర రానిచోట సున్నితపు త్రాసుముందు కూర్చుని ఉండి జెర్రిపోతువంటి బంగారపు హారాన్ని తూకం వేస్తున్నాడు కుమారస్వామి. అతని పచ్చని నుదుట స్వేదబిందువులు ఉన్నాయి. రెండు, మూడు పొడు గాటి వెంట్రుకలు క్రాపులోనుంచి విడివడి నుదుట పడుతున్నాయి. నిశ్చలుడైన యోగివలె ఆతడు సన్నని ముల్లు వంక తదేకంగా చూస్తున్నాడు. శ్రీదేవి ఆసక్తితో చూస్తూ నుంచున్నది. ఆమెకు ఏమూలో కొంచెం భయంకూడా లేక పోలేదు. గుమ్మం పక్కగా ఒదిగి నుంచుని భర్త చూపులనుంచి తప్పించుకుంటే మంచిదనుకున్నది ఆమె. ఇంతలో తూకం నిర్ణయం చేసి చీటిమీద వేసి నగతోసహా అక్కడివారి కిచ్చి పంపించి అతడు ఉంగరాన్ని అందుకుంటూ జడ్జిగారి భార్య వంక చూసి గుర్తించి 'నిన్న నొక ఉంగరం తీసుకుపోయారుగా మీరు ?" అన్నాడు. ఆమె నవ్వి "అవును. ఇది మరొకటి. మావారికి నిన్నటి ఉంగరం ఏమీ నచ్చలేదుట. అందుకని మళ్ళీ ఈ పూట వచ్చాము. అన్నట్టు ఇలా చూడు. ఈమనిషి యెవరో ...." అన్నది. శ్రీదేవిని ఇవతలికి లాగుతూ. శ్రీదేవి ఇరుకునపడిపోయింది. ఆమె చీరకొంగు పట్టి లాగడంవల్ల గుమ్మంపక్క నుంచి ఇవతలికిరాక తప్పలేదు. భయంతో ఆమెకు ముచ్చెమటలు పోశాయి. తడబడుతూ 'నేను రాననే అన్నాను. ఒస్తేగాని వీల్లేదని పట్టు బట్టి కూర్చుంటే రాక తప్పలేదు.' అన్నది. కుమారస్వామి చిత్రంగా నవ్వి ఏమీ మాట్లాడ కుండా వెనుదిరిగి తనపనిలో లీనమైనాడు. ఆ ఉంగరాన్ని తూకంవేసి చీటీమీద వేసి ఆ కుర్ర వాడిచేతి కిచ్చాడు. తర్వాత వారు ఇవతలికి వచ్చారు.

ఇంటికి వచ్చాక ఆపూట అంతా శ్రీదేవి వ్యాకుల పాటుతోనే గడిపింది. పనిపాటలన్నీ పరధ్యానంగానే చేసింది. పొద్దుగూకగానే పనులన్నీ పూర్తిచేసు కుని తెల్లని చీర రవికా తొడుక్కుని జడ్జిగారి భార్య పెరటిగోడమీదుగా అందించిన మల్లె చెండు తలలో ఉంచుకుని భర్తకోసం ఎదురు చూస్తూ కూర్చున్నది. ఆమెకు లోలోపల భయంగా ఉంది. చెప్పకుండా అలా ఇల్లు ఒదిలి వెళ్లినందుకు అతనికి కోపం రావచ్చు .... ఎనిమిదిగంటలు దాటినతర్వాత కుమారస్వామి పైపంచెతో నుదుటిమీద చెమట తుడుచు కుంటూ వాకిలితడికె తొలగించుకుని లోపలికి వచ్చాడు. శ్రీదేవి నిశ్శబ్దంగా అతన్ని అనుసరించి ఇంట్లోకి వెళ్లి పైపంచె, చొక్కా అందు కున్నది. తర్వాత పెరట్లోకి వెళ్ళి నీళ్లతోడి ముందుగదిలోకి వచ్చి వినయంగా 'స్నానానికి రండి' అని పిలుచుకువెళ్లి నీళ్లు సమపాళ్ళుగ ఉన్నాయో లేదోనని కాసిని చేతిమీద పోసుకుని చూసి చెంబుతో ముంచి అందించింది. అల స్నానఘట్టం పూర్తికాగానే భోజనసమయంలో

దగ్గర కూర్చుని ఉండి విసురుతూ శ్రద్ధగా అన్నీ కనుక్కుని వడ్డించింది. అతని భోజనం పూర్తి కాగానే పెరట్లో మంచంవాల్చి నెమ్మదిగా 'కూర్చోండి' అని చెప్పి లోపలికి వెళ్ళింది. చిత్ర మేమిటంటే కుమారస్వామి అంతవరకూ వళ్లైత్తి మాట అయినా ఆడలేదు. ఆమె ఆ మౌనం అంతా కోపంవల్లనే అని అనుకున్నది .... తర్వాత తాను కూడా భోజనంచేసి తలుపులన్నీ వేసి వచ్చింది. నిండుజాబిల్లి వలుచని మబ్బులను లెక్కచెయ్యకుండా వెన్నెలవర్షం కురిపిస్తున్నది. చల్లనిగాలి తెరలు తెరలుగా హాయిగా వీస్తున్నది. కుమారస్వామి కళ్ళు మూసుకుని వెల్లకిలా పడుకుని ఉన్నాడు. శ్రీదేవి వెళ్లి అతనివక్కనే కూర్చున్నది. ఒక్క క్షణంసేపు ఊరుకుని తర్వాత ధైర్యం కూడ గట్టుకుని నెమ్మదిగా 'ఏమండీ ? కోపమా ?' అన్నది. అతడు కళ్ళు తెరిచి ఒక్క క్షణం ఆమె ముఖంలోకి చూసి 'ఎందుకూ?' అని అడిగాడు. ఆమె తల వంచుకుంది. తర్వాత నెమ్మదిగా 'మీకు ముందుగా చెప్పకుండా అలా .... ఆమెవెంట వచ్చానని....'' అన్నది. కుమారస్వామి నవ్వాడు. నవ్వుతూనే చేతులను ఆమె చుట్టూ వేసి 'పిచ్చినాన్నా' అంటూ దగ్గరికి తీసుకున్నాడు. ఆమె ఏదో బరువు దింపినట్టు 'అమ్మయ్య' అనుకుని నిట్టూర్చింది .... తర్వాత నవ్వుతూ ముక్కుమీద వేలు వేసుకుని ''ఇక్కడా ఇవన్నీ ? తప్పుకదూ ? ఎవరైనా చూస్తే?......'' అన్నది. కుమారస్వామి చేతులు ఇవతలకు తీసుకుని, చుట్టూచూసి ''ఎవరున్నారిక్కడ? ఆ చందమామతప్ప......'' అన్నాడు. ఆమె గలగల నవ్వింది.

ఇది జ్ఞాపకంచేసుకుంటున్న కుమారస్వామి ఉలికిపడి చూశాడు. శ్రీదేవి నిద్రలో నవ్వుతున్నది..... ఆమె కంఠసీమలో తళతళ మెరుస్తున్నది గిల్టు ఆభరణం......అతడు 'వట్టి అప్రయోజకుణ్ణి......' అనుకున్నాడు. తర్వాత అతనికి నిద్ర ముంచుకు వచ్చింది.

* * *

రెండోనాడు ఉదయమే దంపతులిద్దరూ బయలుదేరి స్టేషనుకు వెళ్లారు. కుమారస్వామి తమ ఇద్దరి దుస్తులనూ,ఒక చిన్న పెట్టెలో సర్దాడు. రైలు రాగానే శ్రీదేవిని ఆ పెట్టెతోసహా ఆడవాళ్ల పెట్టెలో ఎక్కించి, తాను వేరేచోట వెళ్ళి కూర్చున్నాడు. శ్రీదేవి చుట్టూ చూసింది. ఆమెకు ఎదురుగా కూర్చునివున్న స్త్రీకి ముప్పయియేళ్లు ఉంటాయి. ఆమెపక్కనే చేతిసంచీతో మరొక పాతికయేళ్ల పడుచు కూర్చునివుంది. మొదటిఆమెకు ఒక చేతి నిండా గాజులూ, మెళ్లో తళతళలాడే రాళ్ల నెక్లెసూ, మరొక చేతికి బంగారు గొలుసు వేసిన వాచీ ఉన్నాయి. ఆమె చీరకొంగుతో విసురుకుంటూ, ''అబ్బబ్బ! ఊపిరాడటంలేదు. రైలు కదిలితే కొద్దిగా గాలి ఆడుతుందేమో!'' అన్నది. శ్రీదేవి ఏమీ మాట్లాడలేదు. ఎదుటిఆమె చూపులు శ్రీదేవి మెడలోవున్న నెక్లెస్‌మీదపడ్డాయి. ఆమెపక్కన కూర్చున్న పడుచు మరీ నిర్ధనురాలేమో, ఆమె మెడలో మంగళసూత్రాలు కూడా లేవు. ఒక పసుపుతాడుమాత్రం వుంది. ఆమె వీరిద్దరివంకా ఆదేకంగా చూస్తున్నది.

రైలు ప్రయాణం సాగించగానే తెరలుతెరలుగా గాలి వీచటం ప్రారంభించింది. శ్రీదేవి ఎదురుగా కూర్చునివున్న ఆమె నగలలో రోజురోజూకూ వస్తున్న మార్పులను వివరించటం ప్రారంభించింది. ఆమెకు తాను ధరించివున్న రాళ్లహారంమీద మోజు పోయిందట. ఇప్పుడు శ్రీదేవి ధరించివున్న నెక్లెస్‌వంటిదే అందరూ వాడుతున్నారట. ఇలా శ్రీదేవి ఏమీ మాట్లాడకుండానే ఆమె ఉపన్యాసం ఇచ్చి ఉన్నట్టుండి 'ఏదీ! ఆ నెక్లెస్ ఒక్కసారి ఇలా ఇవ్వుతల్లీ.......చూసి ఇచ్చేస్తాను' అని అడిగింది. శ్రీదేవినుదుట చెమట బిందువులు నిలిచాయి. ఆమె ఆందోళనను అణుచుకుంటూ, నెమ్మదిగా మెళ్లోవున్న నెక్లెస్‌తీసి, ఎదుటి ఆమెకు అందించి మొహం తిప్పుకుని కిటికీలోనుంచి వేగంగా వెనక్కు వెళ్ళిపోతున్న టెలిగ్రాఫ్ స్తంభాల వంకా, చెట్లవంకా చూస్తూ కూర్చున్నది......ఒక అరనిముషం ఒక యుగంలా గడిచాక, ఆమె శ్రీదేవిని చేతోతట్టి, పిలిచి, ''ఇదుగో పెట్టుకోఅమ్మా......సింపుల్‌గా ఎంతో బావుంది........నేనుకూడా ప్రస్తుతం వున్నదాన్ని మార్చి ఇలాంటిదే తీసుకుంటాను. ఈ రాళ్లకు డబ్బు పొయ్యటం దండగ..... కొనేటప్పుడు వదులూ, ఇరవైలూ పోసేరాళ్ళ అమ్మేటప్పుడు నయాపైసా కూడా చెయ్యవు. అన్నట్టు, ఇది ఎన్ని నవరసులు తల్లీ?'' అన్నది. శ్రీదేవి నెక్లెస్ మెళ్లో ఉంచుకుంటూ, వెంటనే 'నాలుగున్నర అనుకుంటాను. అయినా నాకు వివరాలు సరిగా తెలియవు. మావారే తెచ్చారు!' అన్నది. ఒంటిమీద చిన్నమెత్తు బంగారం అయినాలేని ఆ మూడోఆమె శ్రద్ధగా వింటున్నది.

ఇంతలో బండి ఒక స్టేషనులో ఆగింది. సన్నగా, పొడుగ్గావుండి, మాసినపంచె చొక్కా ధరించివున్న ఒక నడివయసు వ్యక్తివచ్చి, ఆ మూడోఆమెదగ్గర నంచి అందుకున్నాడు. ఆమెలేచి దిగబోతూ శ్రీదేవి మెడవంక ఒకసారి చూసింది. శ్రీదేవి మనసు ఎవరో కెలికినట్టు బాధపడింది. ఆమె దిగిపోగానే, కుమారస్వామివచ్చి 'ఏమన్నా కావాలా?' అని అడిగాడు. శ్రీదేవి తల అడ్డంగా ఊపింది. ఏమీ అక్కర్లేదన్నట్టు. అతడు మళ్లా వెళ్ళిపోయాడు. ఎదుటి ఆమె ముచ్చటపడి, ''మీఆయనేగా?'' అని అడిగింది. 'అవు'నని తలవూపింది శ్రీదేవి......ఆమె ఇంకేమీ అడగలేదు......

* * *

స్టేషనులో దిగి దంపతులిద్దరూ నడక సాగించారు. ఇల్లు అరమైలుదూరం ఉంటుంది. కుమారస్వామి మొదట్లో 'నువ్వు నడవలేవు. బండి మాట్లాడనా?' అని అడిగాడు. శ్రీదేవి 'వద్దు......కాస్త దూరమేగా! నడిచిపోదాం......మళ్లీ బండికట్టుకుంటే ఏ అర్ధరూపాయో అచ్చుకోవాలి.......చదివింపుకని తెచ్చిన పదిరూపాయలు తప్ప, మనకు మళ్ళీ ఛార్జీలకేగా డబ్బున్నదీ?'' అన్నది.

ఇద్దరూ వెళ్లేసరికి పెళ్లిఇల్లు హడావిడిగా వుంది. అందరూ ఏవేవో పనులమీద హడావిడిగా తిరుగుతున్నారు. పట్టుచీరెల జరజరలూ, కాలిమెట్టెల గణగణలూ, గాజుల గలగలలూ వీనులకు విందుగా వినవస్తున్నాయి. వరండాలో మేళం

# రాళ్లూ - రత్నాలూ

మోగుతున్నది. పిల్లలు అటూ, ఇటూ గోల చేస్తూ తిరుగుతున్నారు.

వరండాదాటి ముందుగదిలోకి వెళ్ళగానే శ్రీదేవి పెద్దఅక్కగారు చూసి, ఎత్తిపొడుపుగా, "ఏంతల్లీ? పదిరోజులనాడు శుభలేఖవేస్తే తీరిగ్గా ముహూర్తం వేళకు వచ్చారా?" అన్నది...... శ్రీదేవి నవ్విందే గాని, మారు పలకలేదు.

తండ్రిదగ్గరికి వెళ్ళి కనిపించగానే, ఆయన ఏమీ మాట్లాడకుండా తలఊపి, 'ఊఁ!' అని మాత్రం అన్నాడు. కుమారస్వామికి దాహంతో నాలిక పిడచగట్టుకుపోతున్నది. అతడు వరండాలో చాపమీద కూర్చుని, చిన్నవదినగారిని పిలిచి 'ఏమండీ వదినగారూ! కాసిని మంచినీళ్ళిప్పిస్తారా?' అని అడిగాడు. ఆమె విని లోపలికి వెళ్ళి, అవని శ్రీదేవికే ఒప్పజెప్పింది. శ్రీదేవి మంచినీళ్ళు తెచ్చియిచ్చి పెట్టె తీసుకుని లోపలికి వెళ్ళింది.

తర్వాత ఆమె పెళ్ళికుమారుడి దగ్గరికివెళ్ళి, "ఏమిరా, అన్నయ్యా!" అని పలకరించింది. అతడు పక్కకు తిరిగిచూసి, "నువ్వా?.......ఇప్పుడుటే రావటం? శుభలేఖ వేసి ఎన్నాళ్లయింది? అంత తీరని ఉద్యోగం చేస్తున్నాడా మీ ఆయన?" అన్నాడు. శ్రీదేవి మనసులో కష్టపడినప్పటికీ, పైకిమాత్రం నవ్వి వెళ్ళిపోయింది.

కుమారస్వామి స్నానంచేసి, ఉత్తరంవైపు వరండాలోకి వెళ్ళాడు. అక్కడ ఇంటి పెద్దఅల్లుళ్ళిద్దరూ కూర్చునివున్నారు. పక్కన మరో ముగ్గురు బంధువులు కూడా ఉన్నారు. అందరూ ఖరీదైన పంచెలూ లాల్చీలు ధరించిఉండి, ఖరీదైన సిగరెట్లు తాగుతున్నారు. కుమారస్వామి ఒకపక్కన నిశ్శబ్దంగా కూర్చుండిపోయాడు. పెద్ద అల్లుళ్ళిద్దరూ సంపన్నులు. వేళ్లను ధగధగమెరిసే ఉంగరాలు పెట్టుకుని వున్నారు. ఒకాయన మెడలో సన్నని గొలుసూ, పులిగోరూ వున్నాయి. వారిలో పెద్దఅల్లుడు మాత్రం కుమారస్వామిని గుర్తించి పలకరించాడు. రెండోఆయనకు గుర్తురాక అడిగి తెలుసుకుని, "ఓహో అలాగ!" అన్నాడు.

తర్వాత అక్కడివారందరూ పేకలు తెప్పించి ఆడటం ప్రారంభించారు. కుమారస్వామి ఎన్నడూ పేకాట ఆడలేదు. దాన్ని గురించి అతనికి ఏమీ తెలియదుకూడా. ఆ ఆట చిత్రంగావుంది. రూపాయలు గల్లుగల్లుమని చేతులు మారుతున్నాయి.

ఆనాడు భోజనాలైనతర్వాత ఆడవాళ్లందరూ విశ్రాంతిగా హాల్లో కూర్చునిఉండగా, ఒక విశేషం జరిగింది. శ్రీదేవి దూరపు మేనత్త ఒకామె, "ఏమే! నీ మొగుడు ఇప్పు డేం చేస్తున్నాడు? ఏమైనా సంపాదన ఉందా లేదా?" అని అడిగింది. శ్రీదేవి ఏమీ మాట్లాడలేదు. ఆమె పెద్దఅక్కగారు వెంటనే అందుకుని.......మెడ పట్టనన్ని ఆభరణాలు ధరించి వుండి, వాటిని సర్దుకుంటూ! 'ఆఁ! అతనేమి సంపాయిస్తాడు? మొన్న వచ్చినప్పుడు కూడా చూశాంగా. చిన్న మెత్తు బంగారమయినా లేదు....తిండికి కూడా లోటు లేకుండా జరుగుతున్నదో లేదో అనుమానమే!!' అన్నది. చిన్న అక్కగారు నవ్వుతూ, శ్రీదేవివంకచూసి ఆశ్చర్యపోయింది. శ్రీదేవి భుజాలమీదుగా కప్పుకున్న పమిటకొంగు కొంచెంజారి మబ్బు తెరలనుండి

విడివడిన చంద్రరేఖలా నెక్లెస్ ఆమె కంటబడింది. ఆమె వెంటనే, "ఏదో చేయించాడే మరిదిగారు......" అంటూ శ్రీదేవిమెడలోనుంచి ఆ నెక్లెసును ఇవతలకి తీసింది. దాని వెంటనే రెండు పేటల సైకిల్ గొలుసు కూడా ఇవతలకి వచ్చింది.

శ్రీదేవి నుదుట పట్టిన చెమటను పమిటి కొంగుతో అద్దుకుంటూ, తలవంచుకుని కూర్చుండి పోయింది. కొన్ని క్షణాలు నిశ్శబ్దం.....అందరూ ఆ రెండు వస్తువులనూ చేతుల్లోకి తీసుకుని చూస్తూ తమకు తోచిన వ్యాఖ్యానాలు చేస్తున్నారు.

"ఇప్పుడు రాళ్ల నగలు ఫ్యాషన్‌కాదు. ఇలాంటివే బావుంటాయి"

"నేనూ మామిడిపిందెల నెక్లెస్ తీసుకుందామను కున్నాను. తీరా విచారిస్తే, మా ఊళ్లో చేసినవి తయారుగాలేవు....."

'సింపుల్‌గా ఫస్టుగా వుంది...'

మళ్లీ ఒక్క క్షణం నిశ్శబ్దం. శ్రీదేవి మేనత్త ఆ నెక్లెసును, వెలుగును ఎదురుగావుంచి చూసి అననే అన్నది...."ఇదేమిటేఅమ్మాయీ! ఇదేం బంగారమే.......తేడా కనిపిస్తున్నదే."

శ్రీదేవి లేచి విసవిస లోపలికి వెళ్ళిపోయి, పక్క గదిలో తలుపుచాటున నుంచున్నది.....అవతలివారి మాటలు వినిపిస్తూనే ఉన్నాయి.

"ఇవి గోల్డుకవరింగ్ నగలేమోనే"

"నే నప్పుడే అనుకున్నాను. ఆ వాజమ్మ గురిగింజ ఎత్తు బంగారమయినా కొనగలడా?"

"అప్రయోజకుడు. ఏమీ లేకపోయినా నయమే. గిల్టునగలు కొని పెడతాడా?"

శ్రీదేవి గుడ్ల నీరుకుక్కుకుంటూ పెరటిలో నూతి పళ్లెంమీదికివెళ్ళి నిలబడింది. ఒక ముసలామె అందర్నీ మందలించి "మీ కసలు బుద్ధుల్లేవు. వాళ్లజోలి మీకెందుకు? ఇన్నాళ్లూ వాళ్ల ఆలనా పాలనా ఎవరైనా పట్టించుకున్నారు గనుకనా? పాపం ఆ కుర్రవాడినంటున్నారు. మీరు ఒక వడ్లగింజఎత్తు బంగారం పెట్టారా దానికి ఎప్పుడన్నా? సిగ్గు లేకపోతే సరి....." అంటూ ఆ గిల్టు నగలను తీసుకుని శ్రీదేవిదగ్గరికి వచ్చింది. ఆమె ఎవరో దూరపు బంధువు. ఆ క్షణంలో తల్లే అలా వచ్చిందనిపించి శ్రీదేవి ఆమె భుజంమీద తల వాల్చి, వెక్కి వెక్కి ఏడ్చింది. కుమారస్వామి మంచినీళ్ళకోసం వచ్చి, సంగతి తెలుసుకుని ముఖం కందగడ్డలా చేసుకుని, మంచినీళ్లు అడగకుండానే విసవిసా వరండాలోకి వెళ్ళిపోయాడు. శ్రీదేవి ఆ ముసలామె భుజంమీద తల వాల్చి, దుఃఖిస్తున్న దృశ్యం అతన్ని కదిలించివేసింది. అతడు 'ఉస్సు'రని నిట్టూరుస్తూ చాపమీద కూలబడ్డాడు.

పక్కవీధిలోనే ఆడపెళ్ళివారి ఇల్లు. అర్ధరాత్రి పెళ్లి అయిపోగానే కుమారస్వామి బయలుదేరి శ్రీదేవితో "నేను వెడుతున్నాను. నువ్వు రెండు రోజులపాటు ఉంటావా?" అన్నాడు. ఆమె తల అడ్డంగాఊపి, "ఊహూ!! ఇక్కడ ఉండను. మిమ్మల్ని వదిలి అసలు ఉండలేను. ఇద్దరం పోదాం పదండి......" అన్నది. వాళ్లిద్దరూ ప్రయాణమవుతున్నారని తెలిసి తండ్రి ఏమీ మాట్లాడకుండా ఒక చీరె, సంచెలచాపూ తెచ్చి, తాంబూలంతోసహా ఇద్దరికీ ఇచ్చాడు. శ్రీదేవికి కళ్లవెంట నీళ్లు తిరిగాయి! 'ఇక ఇంతలో మళ్లీ ఇక్కడికి రాబోయేది లేదు........' అనుకుని ఆమె కన్నీళ్లు వత్తుకుంటూ దగ్గరలో నిలబడివున్న అన్నగారికిచెప్పి బయలుదేరింది. ఆమె అక్కలిద్దరూ అప్పు డక్కడ లేరు. ఆ ముసలామె వీధి గుమ్మందాకావచ్చి, గద్గదస్వరంతో "వెళ్లి రాతల్లీ! వీళ్ల సంగతి మనకు తెలియని దేమున్నదీ? పశుప్రాయులు....నువ్వేమీ బాధపడకు......." అని సాగనంపింది.

*　　*　　*

ఆనాడు రాత్రి వెన్నెల పుచ్చపువ్వులావుంది. జాబిల్లి మబ్బుతెరలను చీల్చుకుంటూ బయటికి వచ్చి, వెలుగులను కుమ్మరిస్తున్నది. కుమారస్వామి పెరటిపంచలో వెల్లకిలా పడుకొని ఉన్నాడు.

కొన్ని నిముషాలతర్వాత శ్రీదేవిచేతిలో మంచి నీళ్ళచెంబుతో వచ్చి, చెంబును గడపలోవుంచి, భర్త పక్కనే కూర్చున్నది. అతడు ముఖం తిప్పుకున్నాడు. ఆమె "ఇటు చూడరూ? నామీద కోపమెందుకూ? నేనేం చేశాననీ?" అని అడిగింది. అతడేమీ మాట్లాడ లేదు. ఆమె ఒక్కక్షణం ఆగి, తన మెడలోవున్న గిల్టు నగలనుతీసి విసిరి దూరంగా పారేసింది. 'ఇప్పుడు నావంక తిరగండి' అన్నది. అతన్ని తనవైపు తిప్పుకుంటూ. కుమారస్వామి రెండుచేతులతో ఆమెను దగ్గరికి తీసుకున్నాడు. శ్రీదేవికి అతని కళ్ళలో నీళ్ళు తగిలాయి. ఆమె చేతితో అతనికళ్లు తుడుస్తూ, "ఛా తప్పుకదూ? వాళ్లనుగురించి అసలు ఆలోచించకండి. ఈ నగలు గిల్టువయితే వాళ్ళు మనసులే గిల్టు మనుషులు.......మీ అంత మంచి వారెక్కడైనా ఉంటారా? మీరు రత్నం......మిగిలినవాళ్ళు రాళ్ళు........." అన్నది. ★

---

# హరివంశం

### 11-వ పేజీ తరువాయి

పౌండ్రకుడు వానివంక విచిత్రముగా చూచెను. "ఓరి! మాతలి! నీకు తెలివితేటలు అధికములై పోవుచున్నవి. నేను నీకు ఒక్కపని నప్పగించితిని. అది చేసుకొని రాలేకపోయినావు. అది సరే! నా మనసులోని ఆలోచనలను చదువుచున్నావు. ఇది విచిత్రము" అన్నాడు.

"మహారాజ! ఇందు విచిత్రమేమియున్నది. నేను తమకు సారథిని. తమ మనస్సు నెరుగకపోయిన సారథ్య మెట్లు చేతును. ఇక వెళ్లిన కార్యము చెడుటయందురా! అది చెడునని తమకు ముందుగానే తెలియును. స్వామి! నేను పట్టి మాతలిని. అనగా ఆపేరు తల్లితండ్రులచేత పెట్టబడినవాడను. మరి దారుకుడో! ఆయన అసలు మాతలి! మాతలియా! ఆ మాతలియు రథసారథ్య విద్యలో నాయనవద్ద శిష్యత్వ ముండవలయును. మహారాజ! దారుకుడు అవతారపురుషుడు. మాతలియు, అనూరుడును, మరి ఇతర దేవయోనులైన అశ్వకుశలురు, రథసారథ్యవిద్యా పుంమూర్తులు, కలిసి ఆయనగా అవతరించిరి. ఆయన కాశికలోనుండగా ఒకటి, రెండు విద్యలు నేనును ఆయనవద్ద నేర్చితిని. రథమును బహుగతులలో నాయన నడుపగా చూచితిని. కాని, నేటి ఈ కౌశల్యము......."

అద్భుతమే మాతలియై మాట్లాడుచున్నదో! మాతలికి ఇప్పుడు తన కన్నులముందు నామాక్షీమదావహాధిష్ఠితము, దారుకసారథికము అయిన రథము కదలుచున్నట్లున్నది. అతడు ఏకాగ్రదృష్టియై, రథసారథ్యవిద్యయొక్క పరాకాష్ఠప్రదర్శనమును చూచుచున్నవాడువలె నుండిపోయెను. రథము కదులుచున్నదా! నేలమీద నడచుచున్నదా! అవి గుర్రములా! ఆ గుర్రములు వల్గగమనములు పోవుచున్నవి. గాలిలో తేలుచున్నవి. ఆకాశములో ఈదుచున్నవి. రథమునకు కుదుపులేని వేగము, వేగముతో రథముయొక్క గమనము—మాతలి యనుకొనినాడు. "దారుకస్వామి! నీవు దేవుడవు. ఆ రథము నీ అస్త్రము. ఆ గుర్రములు నీమంత్రములు. నీవు అధిష్ఠాన దేవతవు. ఎవ్వరయ్యా! నిన్ను అందుకొనువారు" అని. విచిత్రమేమనగా, తన రథము అతని రథమునంటి పోవుచున్నది. యజమాని వెనుకపోవుశ్వానమువలె పోవుచున్నది. తాను గుర్రములను తోలుటలేదు. పగ్గములను బిగించుటయు, వదులుచేయుటయు, మలుపులుతిరుగుటకు వీలుగా కదిలించుటయు చేయుటలేదు. తక్కిన రథములు వెనుకపడినవి. తన రథము మాత్రమే దారుకునిరథము వెంటనంటి పోవుచున్నది. అహో! ఇది దారుకుని మహత్త్వము! అతని ఇష్టముమేరకు నా గుర్రములు కదులుచున్నవి. అంతే. నేను నిమిత్తమాత్రుడను" అనుకొన్నాడు మాతలి. మరియునప్పుడు జరిగిన దంతయు కన్నులముందు ఆడగా "అహో! విద్య" అని బిగ్గరగా ననినాడు.

"మాతలి! నిలుచుండియే కలకనుచున్నావురా! మాకు సమాధనము చెప్పుటయు మరచిపోయినావు" అనినాడు పౌండ్రకుడు.

మాతలి మరల లోకములో పడినాడు. అతని శరీరము విచిత్రమైన ఆనందముతో పులకలు తేరిపోయినది. వాని ముఖమున విచిత్రమైన కాంతి వెల్గినది. వాడు ఇట్లులనినాడు: "మహారాజ! తమరు నాకీ కార్యమును అప్పగించుటయే చాలును. దానిని సాధించలేకపోతినన్న విచారము నాకు లేదు. తమకును ఉండదనుకొందును. మహారాణి దీక్షను పాడుచేయుటకు, శ్రీకృష్ణవాసుదేవుని పరీక్షించుటకు తా మీ ప్రయత్నము చేసితిరి. స్వామి! మహారాణి ఎవ్వరు? సాక్షాత్తు అన్నపూర్ణ. ఆమె తలపెట్టిన కార్య మెట్లు చెడును. మరియు వాసుదేవుడు డెవ్వరు? ఎవ్వరైన నాకేమి! దారుకప్రభువు అన్నాడు ఓరి! మాతలి! నా విద్యను నీకు చూపించుచున్నానురా! మరి భగవంతునివిద్యలో ఇది ఎంత! నేను ఆయనకు శిష్యుడను" అని. నేను చేతులెత్తి ఆయనకును, ఆయన గురువునకును నమస్కారము చేసినాను........"

"అవును! నీకును సుదక్షిణకు పట్టిన పిచ్చియే పట్టినట్టులున్నది. ఆ యాదవుని వాసుదేవు డనుచున్నావు!"

అంతలో పౌండ్రకునకు కోపము ముంచుకొని వచ్చెను. అంతలో అతని కన్నులు సాయంసూర్యుని ముదురుకిరణములనుబోలి ఎర్రనికాంతులను వెలిగ్రక్కెను. అతడు రోషముగా మాతలివంక చూచెను.

మాతలి వణ్కెను.　　(సశేషం)

# ఆంధ్రసచిత్ర వారపత్రికలో ప్రకటనలు
# మీ వ్యాపారాభివృద్ధికి తోడ్పడుతాయి




విహాకుటుంబములో బట్టలన్నిటినీ సర్ఫ్‌తో ఇంట్లో ఉతుక్కోండి ... చీరలు, దుప్పట్లు, షర్టులు, తువ్వాళ్లు! అవి సులువుగా అమిత తెల్లగాను, పరిశుభ్రంగాను వుంటాయి. అదంతా సర్ఫ్ యొక్క ఉతికే అధిక శక్తి వల్లనే. నేడే సర్ఫ్ వాడి చూడండి! అది ఇంట్లో ఉతుక్కొనే అత్యుత్తమ విధం.

# సర్ఫ్ అమిత తెల్లగా ఉతుకును!

హిందుస్తాన్ లీవర్ ఉత్పత్తి

SU. 27-X52 TL

# గళ్లనుడికట్టు - 104



## అడ్డం

1. గారెగాలి నేడి!
3. ఛత్రమే.
4. జంఘ తిరగబడింది.
6. చీమల—, అంటారు.
8. అనగనగా, ఏమిటి? విలువైన వస్తువా?
10. మేక—గాంక్షీర్యము, అంటారు.
12. అటునుంచి గడ్డము, శత్రుజయార్థము దండెత్తిపోవుట!
14. ప్రాసతోబాటు వైరాగి.
16. స్త్రీ, ఇష్టము.
17. ఇది సుత్తిదెబ్బలు తింటుంది!
18. వాకబుచెయ్యండికానివైవుముండే.
20. కాంతిపురము మధ్య కోరు అర్థం స్ఫురిస్తుందికాని ఇక్కడ తిరగబడుటం జరిగింది.
21. ఆకలి మొదట అడ్డగింత!
22. పడగలారు జాగ్రత్త! ముందే పాము కనిపిస్తుందా?
23. 16 నిలువు చివరభాగం కంచరగాడిద, ఒంటె.
24. చిత్ర—.
25. బోయిది ఒక వృక్ష భాగము.
26. సీస దండుగకాకుండా మొదటే చూసుకొనటం మంచిది.
28. కొయ్య.
29. ఇది అట్టకాడతో తగలవచ్చు!
30. ముసలితనము.
32. ఆకాశంలోనూ తెరమీదా కూడా చూడవచ్చు.
34. జార్జిలో ఒక అక్షరం తగ్గిస్తే పువ్వు!
35. ఆనందము మధ్య ముంత!
37. మా—, (శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి నవలపేరు).
38. సంగతివెనుక పోక!
40. ఒకరు చేస్తే మరొకరు వినవచ్చు.
41. పౌరుషములోనే కోపముకూడా!

## నిలువు

2. ఉప్పుకొంచెం మార్చినా అదే.
3. అయిదున్నొకటి!
5. ఆపినచో చిన్నదొరకును!
6. అడేలు!
7. తడికాదు, సత్యమా?
9. ఒక తీర్థవిశేషము సోయగముమధ్య అటు మంచి కనిపిస్తుందా?
10. పోయుట. (—రాజు; ఒకకవి అని గుర్తుకి తెచ్చుకొనండి!)
11. మీకు, వారికి కానిచో మరెవరికి?
13. ఇది కోర్టుకి సంబంధించినది.
15. తాలింపు.
16. వెలుగుతో నిండినది, అని అర్థము రావాలి.
17. ధాగి.
19. కల్ల,—; అంటారు.
21. ఆ సంతోషం ఒకసూరె!
24. బయలు ప్రదేశం.
27. సూత్రము తలక్రిందులు.
28. మోపు.
29. వాని జిహ్వలో గుర్రము.
31. రోజు.
33. జన సందోహం.
34. కమ్మ.
36. ఒక ఆయుధం తలక్రిందులు.
37. నొప్పి.
39. శ్రీ.

---

## 103-వ గళ్లనుడికట్టుకు జవాబు



★

## రచయితలకు విజ్ఞప్తి

రచయితలు తమ రచనలతోను, రేఖా చిత్రములతోను, తగినన్ని తపాలా బిళ్ళలు అంటించి, చిరునామా వ్రాసిన కవర్లు జతచేసి పంప కోరుతాము. అట్లా పంపితేనే నిరాకరించిన రచనలను మరికొంత త్వరగా త్రిప్పి పంపటం సాధ్యమవుతుంది.

## కథకానికథ పోటీ నిబంధనల

(1) కవరుమీదగాని, కార్డు మీదగాని, ఇన్‌లాండు కవరు మీదగాని స్పష్టముగా 'కథకానికథ పోటీకి' అని వ్రాయాలి.

(2) ఈ పోటీకథలతో ఇతర రచనలను జతచేసిపంపకూడదు. పోటీకి అర్హతలేని రచనలు త్రిప్పి పంపబడవు. వాటిమీద ఉత్తర ప్రత్యుత్తరములు జరుపబడవు. కార్డులు జతచేసి పంపకూడదు.

# న్యూఢిల్లీ లేఖ

7-వ పేజీ తరువాయి

పార్లమెంటు సభ్యులలో ఇంకా కొద్దిమంది మాత్రమే వ్యవస్థాపకు లనదగినవారు ఉన్నారు. రాజ్యాంగనిర్మాతలలో అగ్రగణ్యులైన ప్రధాన మంత్రి దాని పరిరక్షణకు ప్రమాణం స్వీకరించారు. అయినప్పటికీ సమాఖ్యరూపం అంతరించి పోయింది. రాజ్యాంగ విధ్వంసకులకు కీ॥ శే॥ మౌలానా ఆజాద్ నాయకత్వం వహించారు.

విద్యాశాఖపద్ధతులపై సభలో చర్చ జరిగినప్పుడు విద్యాప్రణాళికలలో కేంద్రప్రభుత్వం ఇతోధికంగా పాల్గొనాలని పలువురు సభ్యులు సూచించారు. విద్య రాష్ట్రాలకు సంబంధించిన విషయమే అయినా అట్లా పాల్గొనే వీలులేదని మంత్రిగారు అనలేదు; సభాపతి అడ్డు చెప్పనూలేదు. కాగా ప్రాథమిక, సెకండరీ, విశ్వవిద్యాలయ, సాంఘిక విద్యలకు నాలుగు స్థాయీ సంఘాలను ఏర్పాటుచేయనున్నట్లు మంత్రిగారు వెల్లడించారు. నిజానికి ప్రాథమిక విద్య రాష్ట్రప్రభుత్వాలకు కూడా సంబంధంలేని విషయం. ప్రాథమిక విద్యా వసతులు కల్పించవలసిన బాధ్యత పురపాలక సంఘాలకు, జిల్లాపరిషత్తులకు మాత్రమే ఉన్నది.

ఇక్కడ పరిశీలించదగు అంశాలు రెండు ఉన్నాయి. రాజ్యాంగరీత్యా తమకు కేటాయించబడిన విషయాలలో కేంద్రం జోక్యం కల్పించుకున్నా, రాష్ట్రాలు ఉపేక్షించి ఉన్నాయంటే, తమకుతాము సమకూర్చుకోవలసిన ధనం ఈ రీత్యా లభించటమే కారణం. పరోక్షపన్నులను సమర్థించుకునేందుకు ఆర్థిక మంత్రి శ్రీ మొరార్జీదేశాయ్ నానా యాతనా పడుతున్నారు. ఈ పన్నులభారం ఎవరిమీదనైనా నెట్టే రుద్దవచ్చుకాబట్టి, ప్రజలు వాటి సంగతి అంతగా పట్టించుకోరు. మరోవిధంగా చెప్పాలంటే ప్రత్యక్షపన్నులవల్ల వచ్చినంత ప్రతిఘటన పరోక్ష పన్నులవల్ల రాదు. ఈ కారణంగానే రాష్ట్రాలు కేంద్రంమీద ఆధారపడవలసి వస్తోంది. పరోక్ష పన్నులు విధించే అవకాశం రాష్ట్రాలకు చాలా పరిమితంగా ఉన్నది. ఇహపోతే అభివృద్ధిపన్ను, భూమిశిస్తు మొదలైన ప్రత్యక్ష పన్నులు విధిస్తే అవి (రాష్ట్రాలు) అప్రతిష్ఠపాలవుతాయి. కనుకనే పన్నుల విధించవలసిన అవసరం లేకుండా తమకు నిధులు సమకూరుతున్నంతవరకూ విద్యకు సంబంధించిన సంఘాలు కేంద్రం నియమించినా రాష్ట్రాలు అభ్యంతరం చెప్పవు.

రానురాను తమ రెవెన్యూ బడ్జెట్‌లను సరిపెట్టుకొనడానికికూడా రాష్ట్రాలు కేంద్రంమీద ఆధారపడే ధోరణి కనిపిస్తోంది. ఇది ప్రమాదకరమైన పరిణామం. ఈనాడు కేంద్రంలోనూ, రాష్ట్రాలలోనూ కూడా ఒకే పార్టీ అధికారంలో ఉన్నదికాబట్టి, వాటిమధ్య వచ్చే అభిప్రాయ భేదాలు సమరసంగా పరిష్కారం అవుతున్నాయి. ఉదాహరణకు డా. బి. సి. రాయ్‌నే తీసుకోండి. బొగ్గుగనుల ప్రత్యేకం హక్కుల విషయంలో ఆయన కేంద్రాన్ని ఎదిరించారు. శ్రీ మాలవియా చాలాసార్లు డా. రాయ్‌ని కలుసుకుని మాట్లాడారు. పర్యవసానమేమిటి? డా॥రాయ్ ముభావంగానే ఉన్నారు. శ్రీ మాలవియా మాత్రం అలవాటు ప్రకారం పత్రికాప్రకటనలు చేస్తూ వచ్చారు; "డా॥ రాయ్‌తో సంప్రదించినమీదట పరిష్కారంకాని సమస్య అంటూ ఉండదు" అన్నారు. నిజమే; కాని, అది డా॥ రాయ్ చెప్పిన షరతులకు ఒప్పుకుంటే కుదిరిన పరిష్కారం!

కేంద్రంలో ఒక పార్టీ, రాష్ట్రంలో మరొక పార్టీ అధికారంలోకి వచ్చినప్పుడు ఇబ్బంది ఏమిటో తెలిసివస్తుంది. (కేరళలో ఈ చిక్కు రానే వచ్చింది) అప్పుడు కేంద్రం 'కామధేనువు' రూపం దాల్చి, ఆ రాష్ట్రాన్ని కాల్చుకుతింటుంది.

రాజ్యాంగ్యం దృష్ట్యా చూస్తే, ఇది విపరిణామంగా కనిపిస్తుంది. పరోక్షపన్నులపై ప్రధానమైన విమర్శ ఏమంటే, వీటివల్ల ప్రభుత్వం ప్రజల అభిమానాన్ని పోగొట్టుకుంటుంది.

ఇప్పటి ఆర్థిక బిల్లును ఇందుకు ఉదాహరణగా తీసుకోవచ్చు. మరో రు. 71 కోట్ల పన్నులద్వారా రాబట్టాలని దీని ఆశయం. కాని, వీటిలో అధిక భాగం పరోక్షపన్నులే. స్టాక్ ఎక్స్ఛేంజిమీద ఈ బిల్లు ప్రభావం ఏమిటి? టెక్స్‌టైల్ వాటాల కొటేషన్లుకూడా పెరిగాయి.

* * *

ఎన్నికలలో గెలుపొంది, కొత్తగా లోక్‌సభకు వచ్చిన ఢిల్లీ ప్రతినిధులు అంతకుముందు వచ్చిన వారికంటే కొమ్ములు తిరిగిన వారేమీకాదు. ఢిల్లీ నుంచి ఎన్నికైన ఐదుగురు సభ్యులలో శ్రీ మెహర్ చంద్ ఖన్నా సహాయమంత్రి అయ్యారు. ఎన్నికలకుముందుకూడా ఆయన సహాయ మంత్రిగానే ఉండేవారు. ఢిల్లీ పౌరులకు ఆయన చేయగల సహాయం చాలా ఉంది; చేస్తారు కూడాను. శ్రీ శ్యామ్‌నాథ్ సమాచారశాఖ ఉపమంత్రి అయ్యారు. కొత్తగా ఎన్నికైన వారిలో మరొకరు శ్రీ శివచరణ్ గుప్త. చౌదరి బ్రహ్మప్రకాశ్, శ్రీ నవల్ ప్రభాకర్ పాతవారే. శ్రీ శ్యామనాథ్ ఉపమంత్రి అయ్యారు కనుక రాజ్యాంగరీత్యా ఢిల్లీ వ్యవహారాలలో ఆసక్తిచూపే అవకాశంలేదు. చౌదరీసాహెబ్ ప్రశ్నలువేయటం లాంటి చౌకబారు పనులు చేయరు. లోగడ లోక్‌సభకు ఎన్నికైన శ్రీయుతులు కృష్ణనాయర్, రాధారమణ్ సృష్టించిన సంప్రదాయాన్ని శ్రీ గుప్త అనుసరిస్తున్నారు. అందుచేత ప్రశ్నలు వేసి, ఉపన్యాసాలుచేసి ప్రభుత్వానికి వారు అదనపు ఖర్చు కలిగించరు. శ్రీ నవల్ ప్రభాకర్ ఇంకా ప్రశ్నలు వేస్తూనే ఉన్నారు. ఏమైతేనేం ఢిల్లీ పౌరుల బాగోగులను ప్రతిపక్షాలు, ముఖ్యంగా కమ్యూనిస్టువర్గం పట్టించుకుని, ప్రతి సమస్యపైన చర్చ సాగిస్తున్నాయి. 

# యువ ప్రపంచం

## విద్యార్థులపై సినిమాల ప్రభావం

ఈ 20 వ శతాబ్దములో విద్యార్థులపై సినిమా ప్రభావము ఎక్కువగా ఉన్నదనుటలో ఆశ్చర్యము లేదు. ఈ సినిమాలను కేవలము విజ్ఞాన వికాసముకొరకు చూచి ఆనందించే విద్యార్థులు చాలా తక్కువ. కొందరు విద్యార్థులను వారము రోజులు ఆహారము మానివేయమనిన, మానివేయుదురేమో గాని, ఒక్కవారము సినిమా చూడకుండా ఉండమనిన, ఉండజాలరు! పోని సినిమాచూసి వచ్చి తనపనిలో నిమగ్నుడవచ్చుగా. అలాకాదు. తను చూసిన సినిమాలోని పాటలను (చదువుకంటె శ్రద్ధగా) వల్లె వేసుకుంటూ, తనే ఒక హీరోనని, పగటి కలలుకంటూ, ఊహాప్రపంచములో, ఊహాసుందరి ప్రక్క విహరిస్తూంటాడు!

ఈ మధ్య (మా లెక్చరర్లు చెప్పగా విన్నది.) విద్యార్థులు ఆన్సరు పేపర్లో సినిమాల గురించి నటన గురించి మ్యూజిక్ డైరెక్టర్ల గురించి వ్రాసి ఇవ్వటం కూడా నేర్చుకున్నారు. తనుఎలాగో తప్పుతానని తెలుసు. అందుకని సినిమాలు గురించి వ్రాసానని చెప్పుకుంటారు సినిమాలగురించి వ్రాసిన హీరోలు. మీరే ఆలోచించండి. ఆ జవాబు ఎంత సమంజసముగా ఉన్నదో! ఈ సినిమాల పిచ్చి విద్యార్థుల కెంతో విద్యార్థినులకూ అంతే! అంటే అందరూ అలాంటి వారని కాదు సుమండీ! విజ్ఞానవికాసము కోసము చూసే విద్యార్థులు, విద్యార్థినులు కూడా వున్నారుకాని చాలా తక్కువ! అంటే సినిమాలే వీళ్లను చెడగొడుతున్నయా అని అంటారేమో!

విద్యార్థులు, విద్యార్థినులపై సినిమా ప్రభావము ఏమిటో మాత్రమే నేను వ్రాశాను. సినిమాల వలన ఎంతమంది బాగుపడుతున్నారో మీకు తెలియంది కాదుగా!

నందూరి సాయిబాబు (గుంటూరు)

* * *

## ఉద్యోగావకాశాలు

భారీ పరిశ్రమలలో ఉద్యోగావకాశాలను గూర్చి దుర్గాపూర్ నుంచి ఒక ఆంధ్ర సోదరుడు "యువప్రపంచము" శీర్షిక క్రింద వ్రాసిన విషయం అంత సబబు గాదని అన్నందుకు మన్నిస్తారని ఆశిస్తున్నాను. లక్షల సంఖ్యలలో ఉన్న ఆంధ్రదేశ నిరుద్యోగులు కేవలం "ఉద్యోగాన్వేషణ"లో వందలకు వందలు డబ్బు వెచ్చిస్తూ, ఉద్యోగం కొరకు విదేశమైనా, ఎక్కడైనాసరే ;అది ప్రాప్తిస్తే చాలని, వివిధ పరీక్షలకు వెళ్ళివస్తున్న ఆంధ్రయువకులు, ఉద్యోగం దొరకగల అవకాశముంటే, భాష, వాతావరణ పరిస్థితులు, ఆహారనియమాలు లెక్కచెయ్యక సాహసించి ఉద్యోగాలు దొరికే భారీ పరిశ్రమలుగల ప్రదేశానికి పోగలుగుదుము. మన సోదరుడు సూచించినట్లు లభించగల ఉద్యోగాలు ఏవైనా ఉంటే, అవి సాంకేతిక విద్యార్హతలుగల యువకులకే వీలవుతుందేమో! కాని వారెళ్ళటానికైనా సరే రాష్ట్రంలోనే సాంకేతిక అర్హతలుగలవారు వందల సంఖ్యలో కొరతగా ఉన్నారు. ఎటొచ్చి చిక్కు సాంకేతికార్హతలు లేని నాలాంటివారికే. కేవలం ఉన్నత విద్యతో (మెట్రిక్ తో) ఉద్యోగం లభించగలదా అనే సందేహంతప్పితే సాహసం చెయ్యలేక కాదు. అలా సాంకేతిక అర్హతలేని 'నిరుద్యోగులకు' అవకాశాలుగలచో "ఆంధ్ర సచిత్ర వారపత్రిక" ద్వారా తెలియజేసినచో సందేహాన్ని వదలిపెట్టి అన్వేషణ సాగిస్తాము.

జి. చిన్నయ్య, (గుంతకల్లు)

* * *

## కాయకష్టం తప్పా?

యువప్రపంచం శీర్షిక కేవలము కాలేజీయువకుల సమస్యలకే పరిమితము కారాదు. విశ్వవిద్యాలయములలోగాని, ఉన్నత పాఠశాలలో గాని చదివి ఇంటివద్దనే నిరుద్యోగులైయున్న యువకులనేకులు గలరు. నేటి యువకులు సామాన్యముగా గుడ్డలు మాయని ఉద్యోగముల (White collar Jobs) నాశించుచుండుటచే అట్టి ఉద్యోగములు చాలినన్ని లేక నిరుద్యోగులగుచున్నారు. ఉన్న కొద్ది ఉద్యోగములు అందరికి లభింపకుండుట, ధనాశ, బంధుప్రీతి మొదలగువాని కవి లోబడిపోవుట చేతను బీదయువకులలో ఈ సమస్య ఏర్పడుచున్నది.

విద్యాలయమునందు మంచి మార్కులనుసంపాదించుకొని, మంచి నడతగల బీదయువకులకు ఉద్యోగములు లభించుట దుర్భరమగుచున్నది. ఆర్థికస్తోమతలేని తల్లిదండ్రులు అప్పుతెచ్చియైనాసరే కుమారులను చదివించి, తుదకు నిరుద్యోగులైనవారిని గాంచి కుందుచుందురు. వృద్ధాప్యములో తమకు సంపాయించి పెట్టుదురన్న ఆశ నిరాశయగుచున్నది.

ఈ నిరుద్యోగసమస్య పరిష్కరింపవలెనన్న ప్రభుత్వము, ప్రజాసంస్థలు న్యాయముగా వ్యవహరింపవలెను. యువకులు తమ మనస్సు మార్చుకొని 'కాయకష్టము' చేయుటకు సుముఖులు గావలెను.

అనుముల వెంకటరామకృష్ణారావు (తెనాలి)

## పొట్టికథ

### పుస్తకాభిమాని

పార్వతమ్మగారు భర్త రాసిన ఉత్తరం చదువుతున్నారు. "పుస్తక పఠనం అంటే నాకున్న అభిమానంలో నూరోవంతుకూడా నీకు లేకపోయినందుకు నాకు చాలా విచారం కలిగేది. పైగా పుస్తకాలమీద అంతడబ్బు ఖర్చుచేస్తున్నావని ఒకటి రెండుసార్లు నామీద మండిపడ్డావు కూడాను."

"నేను చచ్చిపోయినతరువాత నీకీ ఉత్తరం వస్తుంది. దీన్ని చదివావంటే నా కిష్టమైన పుస్తకాన్ని ఒక్కసారైనా తెరచి చూసినదానవవుతావు!"

ఈ ఉత్తరం నారాయణరావుగారికి ప్రాణప్రదమైన భాగవతంలో ఉంది. ఆయన చనిపోయాక పార్వతమ్మగారు ఇంట్లో ఉన్న పుస్తకాలన్నీ పాతపుస్తకాల దుకాణంలో అమ్మేశారు. నాలుగురోజులతరువాత దుకాణం యజమాని ఆమెకీ ఉత్తరం తీసుకొచ్చి ఇచ్చాడు!

కె. శ్యామల, (విజయనగరం.)






Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press 6 & 7 Thambuchetty Street Madras-1. Chief Editor: S. Sambhu Prasad.

